# నరమేధము

( Prescribed as Non-detailed text, under Part-II Telugu for I year of the Two-year Intermediate Course for the academic year 1979 80 by the Board of Intermediate Education as per R. C. No. 52736/A2/78 dated 30-4-79 )



రచయిత్రి

మల్లాది వసుంధర, ఎం. ఏ.

పబ్లిషర్సు

కిషోర్ పబ్లికేషన్సు

విశాఖపట్నం — 4

ద్వితీయ — 1979 [illegible]    మూల్యం 4 - 50

# ప రి చ య ము

ఇది నరమేధమను చరిత్రాత్మక నవల.

ఆంధ్ర రాజులయిన విష్ణుకుండినులు బహు పరాక్రమశీలురు. యజ్ఞ కర్తలు వారి యేలుబడిలో నాంధ్రములు స్వర్ణయుగముగ మనినవి. విష్ణుకుండిన ప్రభువులలో నొక మాధవవర్మ నర మేధమును చేసినట్లు బిరుదు ప్రశస్తి కన్పించుచున్నది. ఆ రాజుల శౌర్యగాధలు పరమోత్సాహ కరములు. వారల శౌర్య మునకు తనిసి వారలతోడి యుద్ధమున నోడిపోయిన పరరాజులు తమ కూతుంద్ర వారికిచ్చి పెండ్లి చేసి సంబంధములు కలుపు కొనిరి. నరమేధమునందలి మాధవవర్మ పట్టమహిషి యయిన చంద్రావతీదేవి వివాహమట్టిదియే చంద్రగుప్త చక్రవర్తి మాధవ వర్మ శౌర్యమునకు ముగ్ధుడై సంబంధము కలుపుకొనెను. మాధవ వర్మ పల్లవుల నోడించెను పల్లవులు చక్రవర్తులు. బ్రాహ్మణ ప్రభువులు. పౌరుషాశ్రయులు. అభిమానధనులు. మాధవవర్మ చేతిలో నోడిన కుమార విష్ణువు ప్రాణాంతము ప్రతీకార వాంఛను వీడలేదు. మృత్యుఘడియలో తన మనుమరాలయిన త్రిలోచన పల్లవిని పిలచి యామెనుండి విష్ణుకుండిన వంశ నిర్మూలనము నకై వాగ్దానము గావించుకొని మరీ చనిపోయెను. పల్లవ రాజ

పుత్రి. ద్రుపదరాజపుత్రి యంతటి ప్రతిహింసా పరాయణురాలు. కాఠిన్యమున నశ్వత్థామను మించినది. వీరిలో చాణక్యుని వారసురాలు. ఆమె ప్రతిజ్ఞా పూర్తికై తన జీవితమును కలాటువుగా తీర్చుకొన్నది. అంతశ్శైత్యము బహిరుష్ణతకల మహాగ్రీష్మాతప తపనీయ శైలినియై హృదయముచే నమృత స్యందినియై మనస్సుచే హాలాహలమూర్తియై ద్వివిధములయిన ప్రకృతుల మధ్య నలిగిపోయి తుదకు వాగ్దాన బంధితురాలై తత్పరిపూర్తికై నాత్మహనన మొనర్చుకొనిన తీవ్ర ప్రకృతి. ఈ నవల యందంతట పల్లవరాజకన్యా రాజనీతితంత్రములును కుహనారాగ ప్రాకట్యములు ఆమె క్షుభితాంతకరణమునుండి వెలువడు నసంఖ్యాకములయిన భావనావలయములు వర్ణితములైనవి.

మాధవవర్మ మహారాజు నరమేధము చేసెను. ఈనవల యందు నరమేధమను శబ్దముపై తద్గతమైన యర్థముపై చర్చసాగినది. తీర్పులు నయినవి.

ఏదియయిన యొకకర్మను ఫలాపేక్షతోచేసిన నది ఫలించును. నీస కల్పమును బట్టి యాఫలము నావిధముగ దీపించును మహారాజుగ చేసిన నరమేధ ఫలితము రాజ్యమునకు సౌఖ్యఫలదాయినియై పైయుక్తియై మాధవవర్మకు విపరీత ఫలదాయినియై పుత్రఘాతి యైనది.

ఈ కర్మలను గూర్చి చర్చసాగినది.

కథా సంవిధానమునకై కొన్ని విషయములు మార్పుట జరిగినది. భాష సరళ గ్రాంధికమునే వాడితిని.

చరిత్రాత్మక నవలలు వ్రాయుట మిగుల కష్టసాధ్యమయిన విషయము. చరిత్రకు న్యాయము చేకూర్చుచు నవల యందు రమ్యత సంధానించుటకై కొన్నికల్పనలు చేయవలె. లేనిచో వట్టి చరిత్రయే వ్రాయుచో ప్రయోజన మెట్లున్నను పఠితలకు విసుగు కలుగును. అందుకై యనంతములుగ నున్న చరిత్ర గ్రంధము లుండనే యున్నవి. ఒక ఉత్తమ మయిన గ్రంధము పఠితృ లోకమును తద్గత కథాసంవిధానముచే భావశబలతచే సన్నివేశ చారుత్వముచే తదంతర్లీన మహావిషయ దీర్ఘదీర్ఘచర్చా విమర్శనలచే నాకట్టుకొనును. అది రచయిత యయిన వాని ప్రతిభ వ్యుత్ప త్తులపై నాధారపడి యుండును అట్టి ప్రయత్న మీ నరమేధము నందు సమృద్ధిగ జరిగినది. కవికుల గురువైన కాళిదాసు అనినట్లు "హేమ్నః స్సంలక్ష్యతే హ్యగ్నౌ విశుద్ధి శ్యామకాపివా" పఠితృ లోకమే యొరపిడియై సాహిత్యప్రక్రియ లుద్దీపించవలె. నర మేధమట్లు నిలచినచో నా నవల యదృష్టవంతురాలని చెప్పవలెను.

పఠితృలోకమే ప్రమాణము.

# 1

ఆ పాతాళ నభః స్థలాంత భువన బ్రహ్మాండ మావిస్ఫురత్
జ్యోతి స్స్ఫాటిక లింగమౌళి విలసత్ పూర్ణేందువాంతామృతైః
అస్తోకాప్లుత మేకమీశ మనిశం రుద్రానువాకాన్ స్మరన్
ధ్యాయేదీప్సిత సిద్ధయే ధృవపదం విప్రోభిషించేచ్ఛివమ్.

బ్రహ్మాండ వ్యాప్తదేహా భసితహిమరుచా భాసమానా భుజంగైః
కంఠేకాలా కపర్దాః కలిత శశికళాశ్చండ కోదండహస్తా
త్ర్యక్షా రుద్రాక్షభూషా, ప్రణత భయహరా, శాంభవా మూర్తిభేదాః
రుద్రాః శ్రీ రుద్ర సూక్త ప్రకటిత విభవా; నః ప్రయచ్ఛంతు సౌఖ్యమ్.

పదివేల సుశిక్షితము సుమధురము సుస్వరము ఉదాత్తానుదాత్త స్వరిత బంధురములునైన కంఠములనుండి వినిర్గమించిన శివస్తోత్రములు మహాన్యాస పూర్వకములు రోదసి వలయమంతయు నాక్రమించి ధ్వని తరంగముల వేనవేలుగ సృజించుచుండెను. ఆ ధ్వని తరంగముల కలరి పులకించిన కృష్ణవేణీ తరంగిణి తన చిఱుతరగల మర్మర ధ్వనిచే నానందమును వెల్లడించుచుండెను.

# 2

శరదుదయ సంధ్యా సమయమున కృష్ణవేణీ పులినతలమున నేవంకఁ జూచిన నర్ధగవ్యూతిమేర పటకుటీరములు హిమగిరి ఖండములట్లు ధవళస్నిగ్ధములై దర్శన మొసఁగుచుండెను. ఒకవంక రాటపాకల పందిళ్లు ఆకుపచ్చగ కళ్యాణ సూచకములై కనువిందొనర్చుచుండెను. వేఱొక దెస వంటశాలలు, స్నానాగారములు, ఆహారవస్తు సంచయ శాలలు, యజ్ఞ ద్రవ్యనికర భాండాగారములు దర్శనీయముగనుండెను.

హయహేషలు, గజఘీంకారములు, యజ్ఞపశువుల దీనారావములు, పరిచారకుల సందడులుగ సర్వమునొక చిన్న బ్రహ్మాండ కటాహము వలె మనోహరముగ నుండెను. ప్రతి పటకుటీరముపై నొక పతాక యెగురుచుండెను. అవి పలురకములుగ నుండెను. భిన్నభిన్న దేశముల నుండి వచ్చిన రాజుల రాజప్రతినిధుల గుడారములవి. కదంబ వాకాటక గుప్త పల్లవ రాజవంశముల వారు ప్రధానులు. పలువురు చిన్న చిన్న రాజులు, పాళెగాండ్రు సామంతులు మొదలైనవారి గుడారములు నందు గలవు.

యజ్ఞ దర్శనార్థమై వచ్చిన రాజబంధువుల మిత్రుల భృత్యుల నగరవాసుల కుటీరములు కొన్ని. ఈ మహా కుటీర సమూహమున రెండు మాత్రము ప్రత్యేకముగ దృష్టి నాకర్షించుచున్నవి. అవి రెండును యజ్ఞ కర్తయయిన శ్రీవిష్ణుకుండిన వంశమండనుఁడైన మహారాజశ్రీ మాధవవర్మ, ఆయన యాజకుఁడు కులబ్రాహ్మణుఁడునైన పినాక భట్టారకులవి. మహారాజు పటకుటీరముపై సింహపతాకము యెగురుచుండెను.

విష్ణుకుండిన ప్రభువులందఱు తమ కేతనములపై మృగరాజును చిహ్నముగ స్వీకరించిరి. వారి నాణెములపైన గూడ నీ సింహపు ముద్ర

యుండును. వారల యీ చిహ్నమును బట్టియే వారి మనః ప్రవృత్తి ద్యోతకమగు చుండెను. వారంద అరివీర భయంకరులు, ఆశ్రిత జన మందారులు, వేదధర్మవిష్ణాతులు, యజ్ఞయాగాది క్రతువుల ననేకముం నొనర్చినవారు. రాజసూయాశ్వమేధాద్యధ్వరముల నిర్వహించిన మహా మహులు. సనాతన ధర్మ సంస్థాపన కర్మరతులు, షట్కాల శివారాధనా తత్పరమతులు. శ్రీపర్వతస్వామి మల్లికార్జున మహాలింగార్చనా జీవనులు ! ఆ స్వామి యనుగ్రహముచే త్రికూటాధిపతులై మలయాధిపులైనారు.

వారి పరిపాలనమున నాంధ్రములు స్వర్ణయుగము ననుభవించినవి. తెనుగుభాష తెలుఁగునేల ధన్యతఁజెందినవి. ఆంధ్రులన్న పరరాజులకు గుండె గాలమైవణిలిరి. విజృంభించిన ప్రతాపశ్రీ భీతులై కొందఱు, పరాక్రమ ముగ్ధులై కొందఱు రాజనీతి నెఱపి కొందఱుగ, సాటిరాజు లందఱు వారితో వియ్యమందుటఁజేసి దేశము యుద్ధ విరహితమై సుభిక్షముగ ప్రశాంతముగ సాగుచుండెను.

మహారాజైన మాధవవర్మ నరమేధమును దలపెట్టెను. తలపెట్టుట నగా లక్షలమంది తల పెట్టుటన్నమాట ! అన్ని యజ్ఞముల తీరువేఱు, యీ మహాయజ్ఞము తీరువేఱు. దీనియందు నియమము లెక్కువ. పూర్వయుగములందీ యజ్ఞము నే యొకరిద్దరో రాజులు వినా నెవ్వరును చేసినట్లు కనుపించదు. ఈ క్రతువునందు యజ్ఞపశువుగ మానవుఁడు వరణీయుఁడగుచున్నాడు. యజ్ఞపశువు కాదగినవటుడు కొన్ని విశిష్ట లక్షణములు కలిగి పరిపూర్ణారోగ్యవంతుఁడై, విద్యావంతుఁడై, యజ్ఞ యాగాది క్రతువులందాదృతి కలవాడై యజ్ఞపశువగుటకు తానై సమ్మతించవలయును.

పదినెలలుగ మహారాజట్టి వటునికై ఆంధ్రదేశమంతట గాలించు టకై యజ్ఞజ్ఞులైన బ్రాహ్మణుల నియమించెను. ఫలితము శూన్యమైనది. ఇట్టి నిర్ణీతములైన లక్షణములు కలిగిన యువవటువులు కన్పించకపోవుట, కన్పించినచో వారంగీకరించక పోవుట, వారి తలిదండ్రు లసమ్మతిని దెలియఁజేయుటలుగ నుండెను. క్రతువునకై ముహూర్త నిర్ణయము జరిగినది. పినాక భట్టారకుని సంకల్పమునకు వికల్పమెన్నటికిని సంభ వించదు. ఆయన యాధ్వర్యమున నెన్నియధ్వరములు నిర్వహింపఁ బడలేదు ! యజ్ఞార్థమై యొనర్పు సర్వక్రియాతంత్ర కలాపములు పూర్తి యగుచున్నవి.

నరమేధమను మాటచే నాకర్షితులై, ఆహూతులైన సర్వరాజ బృందము వచ్చిచేరినది. పల్లవరాజైనకుమారవిష్ణు మనుమదును మనుమ రాలును పూర్వవైరముల దొలఁగఁబెట్టి యజ్ఞ దిదృక్షువులై యేతెంచిరి.

విజయ వాటిక యంతయు జనసముద్రమై పోయినది !

తెల్లవారిన యజ్ఞారంభము కావలె, యజ్ఞపశువు వచ్చిన జాడలేదు. మహారాజెచట నుండెనో యెవ్వరికిఁ దెలియదు. ఆ గంతుకులైన రాజు లందఱకు, ఆయన దీక్షితుఁడు కావ నేకాంతవాస నియమ పాలితుఁడుగఁ జెప్పఁ బడుచుండెను. ఇదేమి యజ్ఞము ! ఆహూతులై వచ్చిన యతిథి బృందమును పరామర్శించరా ! చిత్రముగ నున్నదని వారెల్లరు శంకా సంకలిత మానసులైరి.

మాధవవర్మ మహారాజైదు దినముల క్రిందట స్వయముగ తానై యజ్ఞ పశువరణార్థము నగరువీడి చనినట్లెవరికిని దెలియదు. పినాక భట్టా రకుని నీతిచే సర్వము నవ్యముగ సాగిపోవుచున్నది. అయన బలి పశువు లభించి తీరుననినాడు. యజ్ఞము సుసంపన్నము కాఁగలదనినాఁడు.

ఆయన దైవజ్ఞ శిరోమణి ! వేదవిద్యాపారగుడు. చతుర్వేదముల నాయన నధిగమించిన వారు లేరనియే చెప్పవచ్చును. మాధవవర్మ మహారాజున కాయన బాల్యస్నేహితుఁడు, నర్మసచివుఁడు, కుల బ్రాహ్మణుఁడు. ఆయన మాట యనిన మహారాజునకుఁ బరమశివుని యాజ్ఞ వంటిది ! అట్టి ఆయన పంపగా నీయన రాజధానిని వీడి యజ్ఞ పశు పరిశోధనము బయలు దేరెను.

కృష్ణానదికి దక్షిణమున విజయవాటికకు మూఁడు దినముల ప్రయాణము చేయవలసిన దూరమున నొక బ్రాహ్మణాగ్రహారమున నొక యువకుఁడట్టి లక్షణములుగలవాడున్నాడని వార్తవచ్చినది. కాని అతని తండ్రి యందులకు సమ్మతించుటలేదని తెలిసినది. మహారాజు స్వయముగ యత్నించిన కార్యము సానుకూలము కాఁగలదని పినాక భట్టారకుఁడు సుడువగా ఆయన బయలుదేరెను. కాని ఆయన యింకను తిరిగి రాలేదు. పినాక భట్టారకుఁడు మహారాజు రాకకై ప్రతీక్షించుచుండెను.

రాజు నగరమున లేకుండ నీ మహా సంరంభము ! ప్రజా సందోహమును నానారాజ నికరమును సరిదిద్దుకొనుట దుర్ఘటముగ నుండెను. ఇరువది నాలుగు గంటలలో క్రతుప్రారంభము జరుగవలసి యుండెను. ఎంతటి యాత్మప్రత్యయమున్నను నిట్టివేళల మనస్సాందోళనఁజెందుట సహజము కద !

మహారాజ్ఞి మహాకోసలరాజు చంద్రగుప్త చక్రవర్తి ప్రియపుత్రిక చంద్రావతీదేవి మనస్సునకు శాంతి లేకుండెను. ఆమె యజ్ఞ దీక్షితురాలై బందుగుల రాజపత్నుల మర్యాదలకు లోటు రానీకుండ భర్త నగరమునలేని లక్షణము కించిన్మాత్రమైనఁ గానరాకుండ నిర్వహించుచున్నది. ఆయుమకు మొదటినుండియు నీ నరమేధక్రతువయిష్టముగనే యుండెను.

కాని మహారాజు స్వేచ్ఛాతిప్రియుఁడు. ఆమె కాయన గుండె లోతులలోని యమృతపుటూట లెట్లు తెలియునో యట్లే ఆయన హృదయాంతరము నందలి క్రోధాగ్ని కీలికలును తెలియును. రాజ్ఞితానై యేమియుననదు. ఊఱక భర్త ననుసరించును. తాను చక్రవర్తి కూతురను గర్వరేఖఁ గూడ కనిపింపనీయదు. నిరంతరము శ్రీగిరి భ్రమరాంబికా చింతనము దక్క వేఱొండెఱుఁగని భక్తురాలు. ఆమెకు సపత్నీమాత్సర్యము లేదు. ఆమె సద్గుణ కల్పవల్లి !

మహారాజా గ్రామమునకు వెళ్ళగా నచటి గ్రామ ప్రముఖులందఱు నాయన కతిథి మర్యాదలు తల మున్కలుగఁజేసిరి. అంతటి మహాయజ్ఞ సందర్భమున మహారాజు తమ గ్రామమునకువిచ్చేసి వందుల కాశ్చర్యము భయముఁ జెందిరి. మహారాజు సపరివారముగ రాలేదు. కరవాల ద్వితీయుఁడై యవనాశ్వము నెక్కి వచ్చెను. ఆయన సూటిగా నా బ్రాహ్మణుని గృహమున కేగెను. ఆ బ్రాహ్మణుఁడు మహావందితుఁడు, పరమ సౌమ్యుఁడు, శీలవంతుఁడు. ఆయన మహారాజున కెదురేగి యర్ఘ్య పాద్యాదుల నిచ్చి యాసన మొసఁగి గౌరవించెను. బ్రాహ్మణుని వినయ శీలమునకు మహారాజు సంతసించెను. అట్టి మహామహుని కుమారుని యజ్ఞార్థమై యెట్లడుగవలెనని రాజు మనస్సునందు తళవళ పడుచుండెను. కాని దైవకార్యము ! యజ్ఞ సంబంధి విషయము ! ఆయనకుఁ దెలియనిదుండదు కద ! యనుకొనెను.

మహారాజెందుకు తనయింటికి వచ్చెనను విషయమూ బ్రాహ్మణునికిఁ దెలియనిదికాదు. అంతకు పూర్వమే మహారాజు పనుపున వచ్చిన వారి వలన తన నిరాకరణ మాయనకుఁ దెలియును. ఈ మారేమగునో అని బ్రాహ్మణుని భయము !

వచ్చినవాఁడు స్వయము మహారాజు ! పరమ సమర్థుఁడైన ప్రజాపరిపాలకుఁడాయన. ఆయన యేలుబడిలో తామెల్లరు కడుపులోని చల్ల కదలకుండ నిశ్చింతముగ సంసారముల నిర్వహించుకొనుచున్నారు. పరరాజుల దండయాత్రలు, కఱవు కాటకములు, అతివృష్ట్యనావృష్టులు మొదలైన ఈతిబాధలు లేవు. ఆ మహారాజుల పరిపాలనా పద్ధతులట్టివి !

తమ యగ్రహారము రెండవ మాధవవర్మ మహారాజుగారొసఁగినది. వారిచ్చిన మాన్యములను సమృద్ధిగ ననుభవించుచు జీవికలు నిర్వహించుకొనుచున్న తాను, మహారాజు స్వయముగ నేదియే నడిగిన కాదనుట యెట్లు ? అది యధర్మము గద ! 'నా విష్ణుః పృథివీపతిః' అన్నట్లాయన విష్ణ్వంశమునందుద్భవించినవాఁడు. ఆయన యభిలషితమును తిరస్కరించునంతటి ధైర్యము తనకు లేదు.

మహారాజు స్థితియైతమటులే యున్నది — ఓయీ బ్రాహ్మణుఁడా! మీ పమారుని మాకర్పించుడు. మేము నరమేధము చేయుదుమని యడుగ వలసి వచ్చెనే యని రాజు; 'ప్రభూ ! తాము విచ్చేసిన విషయము నాకుఁ దెలియును, తమ కోర్కెను నిరాకరించుట, తమ యిచ్ఛాపూర్తి గాకుండ వంచుట యధర్మము నేరమునని తెలియును, కాని వాఁడు నా యేక మాత్ర పుత్రుఁడు, నా బహిఃప్రాణము. జీవితపు చరమ సంధ్యా కాలమున సర్వవిధముల నాకాధారముకాఁగల బిడ్డ. అతని వీడి నేనెట్లు మనఁగలుగుదును ?' అనవలయునని నృసింహశర్మ ; కాని యేమొక్కరును మాటాడరు. ఇరువురకుఁ దాము మొదట మాటాడిన సమాధాన మేమి వచ్చునో యని భయము. ఇరువురును, చిత్రించిన చిత్తరువుల వలె చలన రహితముగఁ గూర్చుండిరి. ఇరువురు నగ్నిగర్భములైన శమీ తరువులవలె నుండి పోయిరి.

ఇంతలో నృసింహశర్మ కుమారుఁడు యజ్ఞదత్త శర్మ యచట కరుదెంచెను. అతఁడు వచ్చిన వెంటనే తండ్రికి పాదాభివందనమొనర్చి ప్రభువునకు నమస్కరించి నిలచెను. ప్రభువాతని పరికించి చూచెను. చూచుచుండగనే మహారాజునకు ప్రాణములు కన్నులలోనికిఁ దేలి వచ్చి నట్లయినది! తానాచరింపఁ బోవు నరమేధ మహాక్రతుఫలమంతయు రూపుఁగొని తన యెదుట సాక్షాత్కరించినట్లున్నది!

బాల్యమును వీడుట కిష్టము లేనట్లున్న పాలు పొంగారు బుగ్గలు, నూనూగు మీసముల సైతము పొడ సూపలేదు. సమున్నతమై సుదృఢమైన శరీరముతో మకరాంక మనోజ్ఞమూర్తివలె నుండెను. అతని కన్నులు పద్మకళ సదృశ్యములై స్నిగ్ధతారకములు కల్గి సునీలములై యాతని సువర్ణాభమైన మోము నాకట్టుకొన్నవి.

మహారాజు కుమారుఁడైన గోవిందవర్మ కన్నులచ్చముగ నట్లుండును. చంద్రావతీదేవి వపుస్సౌందర్యము నంతను పుణికి పుచ్చుకొనిన బిడ్డఁడాతఁడు. మహారాజునకింకను ముగ్గురు కుమారులున్నారు. అందెవరును గోవిందవర్మ యంతటి సౌందర్యవంతులుకారు. యువరాజు తల్లి వలె సరళ స్వభావుఁడు, జాలి ప్రధానగుణముగ కలవాఁడు. రాజపుత్రుఁడైనను, రాజోచితములైన శౌర్య వీర లక్షణములు తక్కువయైనవాఁడు. నిరంతర శాంతి కాముకుఁడు.

విష్ణుకుండిన రాజవంశము నందలి చమత్కారమేమో గాని రాజులందఱును వీరులుగారు, చిత్రముగ తండ్రి మహావీరుఁడు, రాజ్యస్థాపకుఁడు యుద్ధవిజేత, కుమారుఁడాహవ కార్యమున కనభిముఖుఁడు. అసమర్థుఁడు, భీరువు! తన తాతగారైన రెండవ మాధవవర్మ వీరాగ్రేసరుఁడు. ఆయన పితామహుఁడు మొదటి మాధవవర్మ విష్ణుకుండిన రాజ్యస్థాపనకు మూల

పురుషుఁడు, మహా పరాక్రమశాలి. స్వయముగ తానెన్ని యుద్ధములలో విజయము గాంచలేదు !

పల్లవ కుమారి విష్ణుని నిర్జించుట సామాన్యముగాదు. తన పరాక్రమమునకు మోహపడియేకద చంద్రగుప్త మహారాజు తన కుమార్తె నిచ్చినది ! మరి తన పుత్రుడు సకల సద్గుణ సంపన్నుఁడే; అయిన నేమి ? నపుర భీరువు. రాజ్యమును నిలబెట్టుకొనఁగలఁడో లేడో ! మిగిలిన కుమారులున్నారు. వారు కేవలము భోగలాలసులు. వనితాజన వశం వదచిత్తవృత్తులు ! అధికార వ్యామోహ దూషితాంతః కరణులు. వారిపై తన కాసయేలేదు.

యువరాజున కుదయింపఁ గల పురుష సంతానముపై తన వాంఛ లన్నియు కేంద్రీకృతమై యున్నవి. అట్టి శుభసమయ మెన్నటికో ! తిరిగి విష్ణుకుండిన వంశమున కుమారు మాధవవర్మ జనించవలె. అతఁడు మహాసేనానియై బలములను నడుపుకొనుచు సర్వాంధ్రములఁ బర్యటించ వలె. అతని పాదముల క్రింద సర్వరాజ నికర బలములు కుప్పనూర్పిడి కావలె ! తమరాజ్య ముత్తర దక్షిణాపథముల నాక్రమిలవి విజృంభింప వలె ! అట్టిది తన తీవ్రవాంఛ. అట్టి బిడ్డనికి జనిహేతువు కాఁదగినవాఁడు యువరాజు, తన తొలి సంతానము.

బ్రాహ్మణ వటువైన యజ్ఞదత్తుఁ డచ్చముగ గోవిందవర్మ వలె నుండెను. అతనిని వధ్యపశువుగ సంకల్పించుటకు తన మనస్సభిముఖ ముగ లేదు. అయినను తప్పదు. తనకీ నరమేధముపై మనసు పోనేల ? దైవసంకల్ప మెట్టిదో తెలియదు. తానర్థించిన నృసింహశర్మ యంగీక

రించనిచో నేమిచేయవలెను ? ఆకుమార సుకుమారుఁడైన బాలుఁడిష్ట పడునో లేవో! ప్రాణములపైఁ దీపిలేని మానవుఁ డెవఁడుండును ? ఒక వేళ నాతఁ డంగీకరించినను మహారాజాతని వధ్యపశువుగఁ జూచి నిల్వఁ గలఁడా! ఏమైనను తను వచ్చిన పని నెఱవేర్చుకొని త్వరితగతి రాజ ధాని కేగనిచో సకల రాజలోకమున నలజడి కలుగును. పినాక భట్టార కుఁడిరుకున బడగలఁడు. ఇది యదనుగ గ్రహించి రాజబృంద మేకమై రాజధాని నాక్రమించినను నాశ్చర్యపడ నక్కఱలేదు.

అయినను తానీ నరమేధము నెందులకు సంకల్పించినట్లు ? పూర్వులెవ్వరుఁజేయని దానిని తాను నిర్వహించితి నని తృప్తి ననుభ వించుటకా ? లేక తన యాధిక్యమును వెలయించుటకా ? హయమేధ రాజసూయాది మహాధ్వరములకన్న నిదియధికతర ఫలదాయినియైనదా ? తనకే సమగ్రముగ తెలియుటలేదు. ఇంత జరిగినది గనుక మిగిలినది జరుగవలెను. మహారాజు నాలోచనలిట్లు సాగుచున్నవి.

వచ్చినరాజు మాటాడడేమి ? తానేమి చేయవలెను ? తానే ముందు కదలించవలెనని మహారాజు నభిప్రాయమా ? అది న్యాయమా ? అర్థించుటకు వచ్చిన యాతఁడెంతటి ప్రభువైనను తాను ముందు ప్రస్తా వించవలె గద! తానెందులకు వచ్చినట్లు ? యజ్ఞము తఱుముకొని వచ్చుచున్నది. కాని యజ్ఞ కర్త యింకను నిట్లు తిరుగుచున్నచో యజ్ఞా రంభమెట్లుకాగలదు ? మహారాజు తన కుమారుని యజ్ఞపశువుగ నడుగు టకు రానేలేదేమో ! తానూరక భయపడుచున్నాడేమో ! లేనిచో మహా రాజు తన కుమారునట్లు చూచుచుండెనేమి ? ఆయన చూపులెంత ప్రీతి స్నిగ్ధములుగ నున్నవి ! అట్టి మహారాజీంని యజ్ఞపశువుగ వధించ

గలఁడా ? అంతయు నయోమయముగ నున్నది. ఇట్టివి నృసింహశర్మ యూహలు !

వారిరువురనట్లు చూచుచున్న యజ్ఞదత్తుని కంతయు విచిత్రమని పించినది. వచ్చిన మహారాజు, గృహపతియైన తన తండ్రి యిరువురును మాటాడక యున్నకుందురేమి ? తమ గృహమున కరుదెంచిన మహారాజునకుఁ గావలసినవి సమకూర్చి యాయన కోర్కెను తీర్చవలసిన బాధ్యత తన తండ్రికి లేదా ? పోనిమ్ము, మహారాజు నైతము తాను వచ్చిన పని దెల్పడేమి ? ఆశ్చర్యముగ నున్నది. వారిరువుర నట్లు చూచుచు సమయము వేగించుట కష్టముగ నున్నది. తానీ విషయమునఁ గలుగఁజేసికొనుట ఉచితముగ నుండునా ?

మహారాజు దర్శనమున కరుదెంచిన జనులచే గృహప్రాంగణము కిటకిటలాడు చున్నది.

యజ్ఞదత్తుఁడు తండ్రితో నిట్లనెను — "నాన్నగారు ! మన గృహమునకు మహారాజు లెందుకు విచ్చేసినారు ? వారికి మనవలనఁ గాదగిన కార్యమేమైన నున్నదా ? లేనిచో ప్రభువులు పిచ్చుక గూటిపై భాగీరథి ప్రవహించినట్లు మన గృహమునేల పావనము చేయుదురు !

యజ్ఞదత్తుని మాటలచే ప్రబోధితుఁడైన నృసింహశర్మ ప్రభువు నుద్దేశించి యిట్లనెను — "మహారాజా ! మహాప్రభువులు తామై స్వయముగ మా పేద కుటీరమున నడుగుపెట్టి మా యొనర్చిన సపర్యల స్వీకరించినందుల కెంతయు ధన్యులము. తమవంటి ప్రభువులకు నా

వంటి బడుగు బ్రాహ్మణుఁడేమి మర్యాద చేయఁగలఁడు ! మాకృతముగ తమకేమైన నసౌకర్యము కల్గియున్నచో మన్నింపఁ బ్రార్థించుచున్నాము.

"ఓయీ ! బ్రాహ్మణోత్తమా ! నేనేమి మహారాజును ! నేనీ వేళ యాచకుఁడనై మీ గృహమున కేతెంచితిని."

"ఎంతమాట ప్రభూ ! తాము యజ్ఞ దీక్షితులరని వినినాను. మాకెల్లర కాహ్వానములు కూడ వచ్చినవి. మా బ్రాహ్మణ్య మంతయు రాజధానీ నగరమునకు ప్రయాణమగు చున్నది. తామేమో యిచ్చట దర్శన మొసఁగుచున్నారు !"

"చమత్కార మచ్చటనే యున్నది ! యజ్ఞ దీక్షితులమయ్యు మేము రాజధానిని వీడి యీ మారుమూల గ్రామమున కూరక వచ్చితి మందురా ?"

"ఎట్లందును ! తమకార్యమేమియో సెలవిచ్చిన నేనైనఁ జేయఁ గల్గుదుమేమో !"

మహారాజునకీ మాట లమృతోపమానములలై మిగుల సంతసించి "మీ వలననే కావలసిన కార్యమొకఁడున్నది. అందులకే మేము యాచకులమై మీ యింటికి వచ్చితిమి" అనెను.

నృసింహశర్మ మనమ్ములో వగ్ని పర్వతములు పెటీలు మను చున్నవి. తాననవసరముగ నోరు జారినాఁడు. ఇప్పుడిక మహారాజు యజ్ఞదత్తునడుగుచో తానేమి చేయవలె ? దైవనిర్ణయ మెట్లున్నదో యను కొని— "ప్రభువు లిట్లనిన నేనేమనఁ గల వాడను ? మేము తమ పాల్య

వర్గములోనివారము. మాపై దమకు సర్వాధికారములున్నవి తమకు వలయు దానిని నిస్సంశయముగ గ్రహించవచ్చును. ఇచ్చట తమది కానిదేమున్నది ? మేమెల్లరము తమ యనుచర వర్గములోని వారము గద ?'' యనెను.

''అవును, కాని మాయవసరము విచిత్రమైనది. అది యమూల్యమయినది !''

''అంతటి యమూల్య వస్తువులు మాయింట నేమియున్నవి ప్రభూ ?''

''ఉన్నవి గనుకనే యంతదూరము నుండి వచ్చితిమి. సకలాంధ్రమున నెందును లభ్యముకాని యనర్ఘ రత్నము మీ యింట నున్నది ! అట్టిదాని కొఱకే మేమన్వేషించు చున్నాము.''

''మా యింటనా ప్రభూ ? మణిమాణిక్యములు మా గృహము లందెట్లుండును ?''

''అవునయ్యా ! మీయింటనే, మా యెదుటనే యున్నది. అది రత్నము లన్నిఁటివలె జడము కాదు. జీవవంతమైనది ! చలనశీలమైనది ! యజ్ఞ ఫలదాయకమైనది !''

''ప్రభూ ! తమ నుడువులు నాకవగతమగుటలేదు. చలనశీలమైన రత్నముల నేనెన్నఁడు వినియైన నుండలేదు. అట్టివి నా యింట నుండుటేమి ?''

''తాము పండిత శ్రేష్ఠులు. తమకుఁ దెలియకుండ నుండుటెట్లు ?''

# 14

‘‘నిక్కము వచించు చున్నాను ప్రభూ ! నాకుఁదెలియుటలేదు’’.

‘‘అయినచో మేము చెప్పునది శ్రద్ధగా నాలకింపుడు. ఆ రత్నము మీ యీ కుమారుఁడే ! మీ రీతని మాకు సమర్పించుడు. ఈతని నర్థించుటకే మేము స్వయముగ వచ్చినాము.’’

‘‘అదేమీ మహాప్రభూ ! నా యీ బిడ్డనితో తమకగునదేమున్నది? వీనికి యజ్ఞయాగాదులం దాధ్వర్యమును వహించు సామర్థ్యము లేదు. విద్వత్సభాంతరముల నింకను ప్రశస్తికెక్కలేదు. బాల్యమైనదాటని వాఁడు. వీఁడేమి చేయఁగలఁడు ? తామంతగ కోరినచో నేను వచ్చెదను.’’

‘‘మీరు చెప్పిన లక్షణములతో మాకు నిమిత్తము లేదు. మాకీతఁడే కావలయును. ఈతడు లేనిచో మాయజ్ఞమే విఘ్నమగును.’’

‘‘ప్రభూ ! ప్రభూ ! ఏమంటిరి ? యజ్ఞము విఘ్నమగునని యా ? అనిన తాము నా బిడ్డని యజ్ఞపశువుగఁ గొనిపోవచ్చినారన్నమాట !’’

‘‘మేము నరమేధముఁ జేయుచున్నటుల మీకుఁ దెలియును కద ! సర్వలక్షణ సంపన్నుఁడైన యువవటువు కావలె. ఆ లక్షణము లన్నియు నీతని యందు పూర్ణముగ భాసించుచున్నవి. అందులకే యీతని మా వెంటఁ గొనిపోవచ్చితిమి.’’

‘‘మహాప్రభూ ! తమకిది భావ్యమగునా ? ఈ బిడ్డఁడు నాకు లేక లేక కలిగిన సంతానము. వీనిపై నాసలు పెంచుకొని మనగల్గు

చున్నాను. ఈతనికి వివాహము సైతము నిశ్చయమైనది. తామీతని యజ్ఞపశువుగఁ గొంపోవుదు మనినచో మేమేమి కావలెను ?''

''జీవితాంతము మిమ్ము రాజసౌధముననుంచి కంటికి రెప్పవోలె కాపాడుకొందుము. మీరు కోరినన్ని గోవుల నొసఁగెదము. ధనరాసుల నిచ్చెదము. ఈతఁడు మాత్ర మనివార్యముగ మాకుఁగావలయును. ఇందులకు మీరంగీకరించవలయును.''

''మహాప్రభూ ! సత్సంతానమును మించి తాము నుడివిన యీ ధనకనక వస్తువాహనము లధికములందురా ! మేమేమి మహారాజులమా తమ యనుగ్రహమున మా జీవికలకు సరిపడు మాన్యములున్నవి. మాకెట్టి కొఱఁతయు లేదు. తమ చల్లని పాలనమున ప్రశాంతముగ బ్రదుకుచున్నాము. మా యెడ ననుగ్రహింపుడు. నా తనయుఁడు లేకున్న నేను జీవించలేను.''

''అయినచో యజ్ఞమేమి కావలె ?''

''మహాప్రభూ ! తమరాగ్రహింపకుండుచో నాదొక విన్నపము. తమరశ్వమేధములఁజేసినారు. రాజసూయములనొనర్చినారు. ఇంక నెన్నియో మహాధ్వరముల నిర్వహించినారు. తామీ నరమేధము నెందులకు తలపెట్టినట్లు ? ఏమి విశేష ప్రయోజనము నాశించి చేయుచున్నట్లు ?''

''యజ్ఞముఁ గూర్చి సర్వమును తెలిసిన మీరిట్లు మాట్లాడిన నెట్లు ? ఏ యజ్ఞ ఫలిత మా యజ్ఞమునకే యుండును గద.''

# 16

"ఈ నరమేధము పూర్వమెవ్వరును చేసినదికాదు."

'హరిశ్చంద్ర చక్రవర్తి చేసెనందురు !'

'ఏమిచేసెను ? విశ్వామిత్రుఁడా యాగ ఫలితము తన తపశ్శక్తిచే ఆయన కొనఁగెను. శునశ్శేపుని తన పుత్ర వర్గములోనికి తీసుకొనెను.

'అగుచో నింక నెవ్వరును చేయరాదవియా ? ఇంతకు మీ యీ పుత్రుని నాతో పంపెదరా లేదా ?'

ప్రభూ ! తామట్లనిన నేనేమనగల వాఁడను ? యజ్ఞపశువుగ నేరైనఁ దమకుమారునిత్తురా ?'

మాధవవర్మ మహారాజు కన్నుల నెఱ్ఱజీరలు తొంగిచూసెను.

'ఏమయ్యా ! మీరేయంటిరి గద ! మీరు మూపాల్య వర్గములోని వారమని ! మేము వాంఛించిన దానిని నిరాకరించుట న్యాయమా ?'

'తామనినది నిజమేకాని, యిది యేక పుత్రి విషయకము, తాము నా పుత్రు నాస్థాన విద్వాంసునిగ కొంపోవుచున్నారని సంతసింతునా ?'

'అదేమయ్యా ! మా సైన్యములో నెందరేకమాత్ర పుత్రులైన వారుందురందురు ? వారందరిట్లే యనినచో సైన్యసమీకరణ మెట్లు జరుగును ?'

'ప్రభూ ! తాము మమ్మనుగ్రహించుడు.'

'ఇది యజ్ఞ విషయము తామంగీకరించి తీరవలయును. ఇది రాజ శాసనము.'

'ప్రభూ ! ప్రభూ ! దయచూపుడు.'

మాకు సమయాతి క్రమణ మగుచున్నది. మీ కోరిక లెట్టివైన తీర్తుము. ఈ వటువు మాత్రము మాకు కావలసినదే !'

నృసింహశర్మ స్థాణుభూతుఁడై నిలచెను. అనుకున్నదంతయు జరుగుచున్నది. తానేమి యొనర్చియు కుమారుని యజ్ఞపశువగుట నుండి తప్పించలేని స్థితి సంభవించినది. తాను వలదనిన బలత్కారముగ నైన తీసుకొని పోయెదరు. తానేమి చేయఁగలఁడు ?

తండ్రిగారికిని మహారాజునకును మధ్యజరుగుచున్న వాదమును సాకల్యముగ నాలకించుచుండిన యజ్ఞదత్తుఁడిట్లనుకొనెను — 'అపును తామెల్లరు మహారాజు పాల్యవర్గములోనివారే, వారి యుప్పుతిని బ్రతుకుచున్నవారే. అవసరము వచ్చినప్పు డాఋణము నీగవలదా ? మహారాజు లనినట్లు సైన్యమునందలి వారందఱి బ్రదుకులు శాశ్వతములా ? యజ్ఞాంగముగా తానేగిన దోసగేమున్నది ? మహారాజు సధ్వరము, దైవ ప్రీతికరమైన కార్యము కలసి వచ్చినవి. తన తండ్రి యేలనో దుఃఖించుచున్నాడు,

యజ్ఞదత్తుఁడు తండ్రితో, 'నాయనగారూ ! మహాప్రభువుల కోర్కెను మన్నించుట మనకు విధి. నేను యజ్ఞపశువగుటకు సమ్మతించుచున్నా'ననెను.

'అదేమి బాబూ ! నీవు నంత నిష్ఠురుఁడవైతివి ! నీవు లేనిదో మేము బ్రతుకఁజాలుదుమా ?'

'అదికాదు నాన్నగారూ ! మీరిప్పుడంగీకరించ రేని, మహారాజ తిరస్కారము, యజ్ఞ తిరస్కారము చేసిన వారగుచున్నారు.'

మహారాజిట్లనెను— "పండితవరా ! మీ కుమారుని నుడువు లాలించినారు కద ! అతనిని నా వెంటఁ బంపుఁడు."

'అనుకంపావిరహితులై వార్ధకమున మాకాధారము కాదగిన యేకైక పుత్రుని యజ్ఞపశువుగఁ గొంపోజూచుచున్నారా ? మాకు పుత్ర శోకమును కల్పించుచున్నారు.'

'నాన్నగారూ ! అనవసరముగ మహారాజుల మనస్సునకు కష్టముఁ గలుగనీయకుఁడు. మీ పుత్రుఁడు యజ్ఞ పరిపూర్తిని గావించిన పుణ్యమును పొందుడు. మరణ మెన్నటికైన నున్నదే గద ! మన మొనర్చు సుకృత దుష్కృతముల ననుసరించియే మనకుఁ బరలోక గతులు కలుగుచున్నవి. ఎట్టి కృత్యములు లేకుండ నుత్తమ గతుల నవలీలగ పొందు నదృష్టము, రాజ ఋణమీగు నవకాశము, పినాక భట్టారకులకు ప్రీతి నొదవించు నవసరము సంపన్నముగా నున్నవి. మీ రను మతింపుడు.

మహారాజునకు తల తిరిగి పోవుచుండెను. ఇదేమి వటువు ! ఎవ్వఁడేని యిట్లను వాడుండునా ? తన యదృష్టము పండినది. ఈ వటువు తానై యంగీకరించు చున్నాడు. ఆయన తన యజ్ఞము సఫలమైనటులనే భావించెను. నృశింహశర్మ నిర్వాక్కుయ్యెను— ఇదియేమి ! తన కుమారుఁడిట్లు మాటాడునేమనుకొనెను. తానిప్పుడిఁక రాజుతో నేమనజాలును ? విధి బలీయమైనది. తన భార్య నూఱడించుటెట్లు ?

మహారాజు వటుని నామధేయ మడిగెను.

'యజ్ఞదత్తుఁడు ప్రభూ !'

'నీకు తగిన పేరు పెట్టినారయ్యా ! నీ తండ్రి ననుమతింపచేసి వచ్చినచో మనము వెళ్ళవచ్చును.'

'చిత్తము ప్రభూ !' అని యజ్ఞదత్తుఁడు తండ్రిని జేటి, 'నాన్నగారూ ! మీరనుమతింపక తీరదు. ఎట్టులైన వీరు నన్ను గొంపోక యెదరు. తామై పంపిన నా కామోదముగ నుండును గద' అనెను.

నృసింహశర్మ నయనము లశ్రుపూరితములయ్యెను. ఆయన కంఠము రుద్ధమయ్యెను. 'నాయనా ! యజ్ఞదత్తా ! నీవట్లన్నచో నేనేమి చేయఁగలను ? మీయమ్మను చూచిరమ్ము' అని నృసింహశర్మ యనెను.

యజ్ఞదత్తుఁడు లోనికేగి తల్లికిఁజెప్పగా ఆమె గోలుగోలున నేడ్చుచు మహారాజున్న గదిలోనికి వచ్చి— ''ఓ మహారాజా ! నాయొక్క బిడ్డను నాకుఁ గాకుండఁజేసి నాకుఁ గడుపుశోకము కల్గించుచున్నారు. మీకుఁ గూడ నిట్టిది సంభవించినప్పుడు గాని, మీకు నా దుఃఖము తెలియదు. ఇది నా శాపము' అని యజ్ఞదత్తుని కౌగిలించి ''నాయనా ! నేనెంతటి దురదృష్టవంతురాలనిరా ! దైవము నాకర్మ మిట్లు కాల్చినా దేమిరా ! నీకుఁ గూడ నిట్టి విపరీత బుద్ధి యేల కలిగినది తండ్రీ !'' అని వెక్కి వెక్కి గుండె బాదుకొనుచు దుఃఖించుచుండెను.

# 20

మాధవవర్మ మహారాజు పిచ్చివాడైపోయెను. ఆయన నృసింహశర్మ నుద్దేశించి, 'అయ్యా ! మీరు కూడ నన్ను శపించుడు. శాపము నా కొక్కనికి తగులునది. యజ్ఞము వేళమునను సంబంధించినది మీరెట్టి శాపము నొసగిన ననుభవింతును' అనెను.

నృసింహశర్మ నివ్వెరపోయి, 'మహాప్రభూ ! నేను తమను శపించను. నా తనయుడు రత్నమంటిరి కద ? 'రత్నహారీతు పార్థివః' అన్నట్లు మీరు వీనిని గొనిపోవుచున్నారు. అది వీనికిని నిష్టమైనది. నేను దీని కనుమతింపకుండుట సమంజసము కాదు. ఈ నా తనయుం డుత్తమ లోకముల కేగును. కాని నేనైె తమను శపించకపోయినను హృదయ దహ్నమైన నా దుఃఖమునకు హేతువైన తమకర్మ తమ్ము క్షమించదు. నేననుమతించుచున్నాను. తామింక వెళ్ళవచ్చును.' అనెను.

నృసింహశర్మ నిశ్చలముగా నిలిచిపోయెను. యజ్ఞదత్తుఁడు తండ్రికి ప్రదక్షిణించి తల్లిని కౌగలించుకొని యామె కన్నీరు తుడిచి — "అమ్మా ! మహారాజులను నిందింపవలదు, నేనై యజ్ఞపశువగుటకు పోవుచున్నాను. మీ కుమారుని మూలమున నొక క్రతువు సంపన్న మగుచోనది యెంతటి మహాదృష్టకరమైన విషయము ! అమ్మా ! దుఃఖింపకుము. పరుల కొఱకై త్యాగమొనర్చుట మహాపుణ్యప్రద మైనది. అందును మనయేలికయైన వానికై విశేషించి యజ్ఞార్థమై త్యాగ మొనర్చుటెంతటి యదృష్టమందువు ! ఇది దేవతా ప్రీతికరమైన కార్యము అడ్డుచెప్పక అనుమతించుము తల్లీ !" అని వేడుకొనెను.

ఆమె కన్నీరు తుడుచుకొనుచు, "కొడుకా ! ఏమని యాశీర్వ దించుదురా ? నూఱేండ్లు బ్రదుకమందునా ? లేక లేక బహువ్రతములు

నల్పిన తదుపరి జన్మించిన బిడ్డవు, కుల దీపకుఁడవగుదువని మేము మురిసిపోవుచుండ నీ విట్లు చేసితివి మమ్మెవరి కొప్పగించి పోయెదవు ?' అని రోదింపఁదొడఁగెను.

'అమ్మా ! మహారాజులు మిమ్ములను కంటికి రెప్పవోలె కాచు చుందురు. వారు దేవ బ్రాహ్మణ భక్తులు. వారి రాచరిక మెట్టిదో మన మనుభవించు చుంటిమి గద !'

'అవును అనుభవించుచునే యున్నాను ! తమ యజ్ఞ నిర్వాహణము నకై పరుల గర్భమునఁ జిచ్చురగుల్చుట చాల యుత్తమమైన పని ! తమకును పుత్ర సంతానమున్నది కద ! అందొక్కని బలిపశువుగ చేసి కొనరాదా ? నా కొడుకే కావలసివచ్చెనా ?'

'అమ్మా ! విషయము తెలియకుండ మాటాడకుము మహారాజు లకు స్వపర భేదము లేదమ్మా ! పనికి వచ్చుచో నవశ్యమట్లే చేసెడి వారు. వారి ధర్మతీవ్రత నిరుపమైనదమ్మా !'

'మాటలకేమిలే నాయనా : మాటలు వేఱు, చేతలు వేఱు'.

'అమ్మా ప్రభువు లట్లుకాదు. భవిష్యమున మీరే చూడఁగలరు. నన్ను పంపించుము తల్లీ ! ప్రభువులకు కాలాతిక్రమణము కారాదు'.

"నాయనా : నీకై నీవు నిన్నర్పించు కొనుచుండగ, నీ తండ్రి గారనుమతించుచుండఁగ నాదేమున్నది ! దేవతానుగ్రహమ్ముఁ బడయుము'.

## 22

ఆమె హస్త ద్వితయమున కన్నులు మూసికొని దుఃఖించుచుండెను. యజ్ఞదత్తుఁడు— "ప్రభూ ! బయలుదేరుదమా ?" అనెను.

మహారాజు యజ్ఞదత్తుని నిజాశ్వముపై నెక్కించుకొనెను. వారిరువురట్లు బయలుదేరిరి.

నృసింహశర్మ, ఆయన భార్య, గ్రామవాసులు సాశ్రునయనులై భీతచిత్తులై, శూన్యదృష్టులై, స్థాణుభూతులై అశ్వమేగిన దిక్కునకు చూచుచు, నిలచిపోయిరి.

— ० —

కాంచీపుర రాజ ప్రాసాదోపరి భాగమున మాలతీలతా మంటపము నం దిరువురు వ్యక్తులు సంభాషించుకొనుచుండిరి. వసంత సాయం సంధ్యానిలము సూత్నపల్లవ మనోజ్ఞములై రాగరంజితములై కామాక్షీ చరణ లాక్షారస భ్రాంతిని గల్పించు వృక్షసముదయములపైనుండి వీచుచు వారల చేలాంచలములఁ గదల్చుచుండెను. సాంధ్యకాలికములైన పూజా సమయ కృత కామాక్షీ దేవ్యాలయ ఘంటికా వినాదములు సుమధురముగ విన్పించు చుండెను. అస్తమయభానుని యరుణ కాంతులాయమె మోమున బర్వి యామె వసంతలక్ష్మివలె మెఱసిపోవు చుండెను. అతని మొగమున రాజసము బ్రహ్మతేజము రెండును కొట్టవచ్చుచు కన్పించుచున్నవి.

వారిరువురును పల్లవరాజైన మూఁడవ కుమార విష్ణు మహారాజ మనుమడు కుమారవిష్ణువును, మనుమరాలు త్రిలోచన పల్లవియు. వారిరువురు కొలదిమాసములై విష్ణుకుండిన మహారాజొనర్చిన నరమేధ యజ్ఞమున బాల్గొని వచ్చిరి. అట్టి యజ్ఞములు తమ తాత తండ్రులు సైతము నిర్వహించినారు. కాని, యంత వైభవాన్వితముగ జరిగినవా యను నాశంకఁ గల్గించు నట్లున్నది!

కృష్ణానదీ పులినభాగమంతయు జన సందోహనిబిడమై యిసుక వేసిన రాలనట్లుండెను. విష్ణుకుండిన రాజ్యము నందలి ప్రజలెంతటి యజ్ఞప్రియులు! నరమేధమును మహారాజు సంకల్పించగా తమ ఏకైక

పుత్రుని యజ్ఞ పశువుగ సమర్పించిన తలిదండ్రులున్నారు. వారి యజ్ఞ ప్రియత్వమున కంతకన్న నిదర్శనమేమి కావలెను! ఆహా! ఆ బ్రాహ్మణ వటు వెట్లున్నాఁడు? కంతు జయంతాదులఁ దిరస్కరించు సౌందర్యము కలవాడు. ఆతని కన్నులవి జ్యోతిస్రోతస్సులు! ఆతని చూపులు నిర్భీకములు! నంతర్లీనములు! విజయ వాటిక నుండి తిరిగి వచ్చిన చాల దినములవఱకు వాని చూపులే తన్ను వెంటాడినవి! నిద్దుర పట్టలేదు. అట్టి సుకుమార సుందరయువకుని బలిపెట్టుట చూడగా నామె మనస్సునందు కోపము పొంగులై వచ్చినది.

మహారాజు మాధవవర్మ సంతతిలో నొక రిద్దరు యజ్ఞదత్తుని పోలియుండిరి. బలి సమయమున మహారాజు వదనము కళావిహీనమై పోయినది. జనులెల్లరు హాహాకార ముఖరిత దిగంతులైనారు. యజ్ఞదత్తుఁడు మాత్రము నిర్వికారుఁడుగ నిశ్చలములైన చూపులు గలవాడై స్థిరుడై ధ్యానస్థిమితుఁడై యూపస్తంభమున కానుకొని నిలఁబడెను.

త్రిలోచనపల్లవి యా దృశ్యమును మఱువలేదు. ఆమె నయనము లశ్రుసిక్తములైనవి. తానేమి చేయఁగలదు? తమ పూర్వపురుషులు మహాయజ్ఞములఁ బెక్కింటిని జేసినారు. ఒక్కరేని యిట్టి నరమేధమును దలపెట్టలేదు. ఈ యజ్ఞము క్రూరమయినది. మాధవవర్మ దయావిహీనుఁడై యుండును. అట్టి క్రూరాత్ముని హింసించవలసినదే. అవని తాను చూచుకొనును!

మాధవవర్మ మహారాజు నాల్గవ కుమారుఁడు సునీతివర్మ అవివాహితుఁడు. వానియందు యజ్ఞదత్తుని లక్షణములన్నియుఁ గళ్ళకుఁ గట్టినట్లుండును. గోవిందవర్మ యువరాజు. ఆయన యందు నైతమాలక్షణ

ములు గోచరించును. వారిరువురు చంద్రావతీదేవి సంతానము. మిగిలిన ఇరువురు మలయవతీ సుభద్రల కుమారులు.

తన పథకము సఫలమగుటకు తాను యువరాజు సోదరుని పరిణయ మాడవలసి యున్నది. అది యంత సులభసాధ్యమైన విషయమా? విష్ణుకుండినులతో కదంబులతో పల్లవరాజులకు వైర మనాదిసిద్ధముగ మన్నది. ఆ కదంబులు విష్ణుకుండినులు చాలరన్నట్లు వాకాటక మహా కోసల ప్రభువులు తమ పుత్రికను వారలకిచ్చి వివాహములు గావించిరి. అందుచే నాల్గు రాజ్యము లేకమై యసమాన బలపరాక్రమముల, దులతూగుచు శత్రురాజులకు గుండెగాలమై వఱలినవి.

ఒకనాటి పల్లవరాజ్యము వీరిసందఱను శాసించినది. వీరకూర్చ కుమారవిష్ణువైన త్రిలోచన పల్లవరాజున కెదురొడ్డి నిల్వఁగల రాజమాత్రు లెవ్వరును లేని కాలమది! కాలవైపరీత్యము! ఈనాఁడు తాము పరిమిత మైన పల్లవరాజ్యమును పాలించుకొనుచున్నారు. తమ పితామహుఁడు కుమారవిష్ణుమహారాజు మాధవవర్మతో యుద్ధమొనర్చి పరాజితుఁడై నాఁడు ఆపరాభవమును తలపోసి సిగ్గిలి మనోవ్యథతో క్రుమ్మి చివికి జీర్ణించి యాయన పరమపదించినాడు.

మరణశయ్యపైనున్న తాతగారు తనను పిలువ నంపి యిట్లనిరి— "అమ్మా! త్రిలోచనా! విష్ణుకుండినుల వలననైన పరాభవాగ్ని నా మనస్సును రగిలించి రగిలించి చివరకు మరణాంతముగఁ బరిణమించి నది. మీ తండ్రి సైతము వారితోడి సంగ్రామమునసే వీరస్వర్గ మలంక రించినాడు. అమ్మా! పల్లవీ! నీవు మన కులదేవతయైన కామాక్షీ దేవి యవరావతారమవు! కుమార విష్ణువు శాంతికాముకుఁడు. నీవు చురుకు

దన మెక్కువ కలదానవు. నాకు నీచిన్నతనము నుండియు నీపై నాసల మెండుగనుండినవి. అందులకే నీకు నీ యన్నతో సమానముగ వీర చిత విద్యలు నేర్పించినది ! తల్లీ ! నీవు స్త్రీవి. స్త్రీ తలచుకొనినచో అందును నామె సమర్థురాలగుచో సాధింపలేని దేమియు నుండదు. 'స్త్రీ బుద్ధిః ప్రళయాంతకీ' అన్నట్లు, మహాసామ్రాజ్యములు లేచినను, కూలి నను నందు స్త్రీ ప్రధానముగ నుండితీరునమ్మా ! మహాభారత మంతయు పాంచాలీ ప్రధానమై యామె యాలంబముగ జరిగినది కద ! రామాయ ణము కూడ సీతాదేవ్యపహరణము కైకేయి వాంఛాప్రేరితము కద ! ఎచ్చటఁ గాంచినను స్త్రీ పాత్ర నాధారముఁ జేసికొని ప్రళయాంతకమైన యుద్ధములు సాగినవి. స్త్రీ పగకు పట్టు విడుపు లుండవు. అమ్మా ! పల్లవీ ! నీ నామధేయము మా తాతగారు, మనకులదేవత మన వంశ నామములు ముప్పేటగ మలచిపెట్టినాను. నీవు పల్లవ రాజ్యమునకుఁ జరి గిన యవమానమునకుఁ బ్రతీకారము చేయవలయును. మహిషాసుర మర్దనియైన దేవి నిన్నావహించును తల్లీ ! విష్ణుకుండిన వంశము నిర్వం శము గావలె. అది నీ కృతముగ జరుగవలెను. ఇది నా చరమవాంఛ ! తీర్చఁగలవా?" యని వారు.

ఆ వృద్ధుని కన్నులలోని తైక్ష్ణ్యమునకు త్రిలోచన చలించి పోయి నది. ఆయన వాంఛాతీవ్రతయంతయు వెలికి వచ్చినట్లున్న చూపులు, ఉచ్చారణ యందలి కార్కశ్యము నామెకు దిగ్భ్రాంతిని గలిగించినవి. తానా సహస్ర మాసజీవి కోర్కెను మన్నించకుండ నుండలేననుకొన్నది "తాతగారూ ! నేను విష్ణుకుండిన వంశవృక్షమును కూకటి వ్రేళ్ళతో పెల్లగించి వైచెదను. కామాక్షీదేవిపైనాన ! మీ పాదాబ్జములపై నానగ ుంకు మనశ్శాంతిని, లేనిచో నాత్మశాంతినైన కల్గించితీరెదను !" అనినది

అప్పుడాయన . "పల్లవీ : అది చాల క్లిష్టమయిన విషయము. ఆ ప్రయత్నమున నీ మానప్రాణములకు హైతము భంగము వాటిల్లవచ్చును. నీవు బంధితురాలవు కావచ్చును. ఏమైనఁ గావచ్చును." అనెను.

"తాతగారూ : మీరు చింతింపకుడు. నేను నా నిశ్చయము నెన్నటికిని మరల్చుకొనను. మీ వాంఛాపరిపూర్తిఁ గావించి తీరెదను."

"తల్లీ : నీ యుద్యమమున నీవు వారిచేజిక్కినచో వారు మాన భంగమునకైన వెనుదీయరు. ఏదియెట్లయినను మన పల్లవరాజ రక్తము కలుషితము కారాదు."

"అదియా మీభయము ? నే నన్ని ప్రయత్నములఁ జేసికొనియే రంగమున నడుగుపెట్టెదను. అవసరమగుచో విష్ణుకుండిన కుల వధువుగఁ బ్రవేశించియైన, నా వంశనాశిని నగుదును. మీరు నిశ్చింతముగ నుండుడు"

కుమారవిష్ణు నరపతి తృప్తిగ కనులు మూసెను.

నాటి ప్రతిజ్ఞాపాలనము తనయందున్నది. సంవత్సరము గతించినది. పల్లవికి నిన్నమొన్నటిది వలె నా దృశ్యము కన్నులకుఁ గట్టినట్లున్నది. విజయవాటికా ప్రయాణము దాని నింకను వచ్చిగ నిల్పినది !

కుమారవిష్ణువునకు తన చెల్లెలినిమౌనము సహింపరానిదిగనున్నది. అతఁడిట్లనెను "చెల్లీ, పల్లవీ ! ఏమంత దీర్ఘాలోచన జేయుచున్నావు మనము నరమేధము నుండి తిరిగివచ్చిన నాటనుండి నీలో నేదో మార్పు కనిపించుచున్నది. అదియేమో నాకర్థమగుటలేదు. నీలో నీవు గుడుసుళ్లు

పడి యోజించుటకన్న నాతో నైతము సంప్రదించరాదా నాచే నగున దేమైన నుండుచో నేనుకూడ యత్నింతును గద :"

త్రిలోచన నవ్వి— "అన్నా : నీకుఁ దెలియని దేమున్నది : నరమేధమును దర్శించిన పిమ్మట నాకు నిజముగ తలతిరిగిపోయిన దను కొనుము. నేను కూడ నరమేధమును చేయవలె ననుకొనుచున్నాను. పథక మాలోచించు చున్నాను." అన్నది.

"ఏమనుచున్నావు : నరమేధ మొనర్తునవియా ? నీ కట్టియర్హత లేదమ్మా !"

పల్లవి నవ్వి — "అది కాదన్నా : అడివ మాటఁ దప్పుట మన పల్లవరాజ వంశమున నున్నదా ! అన్నా ! ఈ త్రిలోచన యసమర్థు కొనుచున్నావా ? మరణశయ్యపై నుండిన తాతగారి కొనఁగిన వాగ్దాన మును నెఱవేర్పఁజాల దనుకొనుచున్నావా ? నెఱవేర్పలేనిచో నాకాశ్రయ త్నమున మరణమైన వరణీయమే యగును." అన్నది

నీ సామర్థ్యమును నేను శంకించుట లేదు చెల్లీ ! ఆ విష్ణుకుండిన మహారాజేమి యపరాధ మొనర్చినాడు ? తనపై దండెత్తి వచ్చిన శత్రు వును నిర్జించెను. అది రాజధర్మము : తానై యా ప్రభువు మన రాజ్యముపైకి దండెత్తి రాలేదు కద ! తాతగారు తానై యా మహా ప్రభువుతో తలపడి భంగపడినారు. ఇందా ప్రభువు దోషమేమున్నది ?

అది యంతయు నా కనవసరము. వారితో నైన యుద్ధమునందు మన తండ్రిగారు సంహరింపబడినారు. తాతగారోడి పోయినారు, అవి మనకవమాన హేతుకములైన విషయములు. అదిగాక విష్ణుకుండిన

వంశమును నాశనమొనర్తునని తాతగారికి వాగ్దాన మొసఁగినాను. ఇప్పుడిఁక నా వాగ్దానమును నిలబెట్టుకొన వలదందువా ?''

నే నట్లనను గాని తాతగా రొనర్చిన పని బాగుగ లేదందును. ఆయన పట్టుదలయే ప్రధానమని యెంచినారు కాని, నీ బాగోగు లాలోచించ లేదు. నీ బ్రదుకుపై నిప్పులు కురిపించినట్లున్నది !.''

'అన్నా ! తాతగారిని గూర్చి యట్లనకుము. ఆయన సర్వము నాతో సవిస్తరముగఁ జర్చించిన మీఁదటనే నా ప్రోద్బలము పైననే యట్లు ప్రవర్తించినారు. ఈ ప్రతిజ్ఞా నిర్వహణములో నా కెదురొ్కా నగు సర్వ విఘ్నములను, విపత్తులను వివరించి విశదముగఁ దెల్పియున్నాడు. నే నన్నిటికి సంసిద్ధురాల నంటిని !'

''ఇఁకనేమి ! తన హృదయగతమైన ప్రతీకారవాంఛ నీ మూలమున పల్లవించినది. ఫలింపఁజేయు భారము నాయన నీయందు నిల్పినారు. ఏమైనను మాధవవర్మ మహారాజు మర్యాదా పరమావధి ! రిపు వర్గమునకు జెందినవారమైనను మనలను యజ్ఞమున కాహ్వానించినారుగద! మనల నెంతగ గౌరవించినారు ! ఆయన యాషణ్మాత్రమయిన దోష మెన్నుటకు వీలులేని నడవడిక గలవాఁడు. నీ యుద్యమమును నా మన స్సంగీకరించుట లేదు.''

''అన్నా ! నీవనునది నిజమే, కాదనను. ఆయన కొనర్చిన 'గ్దానమును నేను నిలబెట్టుకొని తీర నేవలయును ఇంత యెందులకు ? మహాభారతము నందలి వీరుల ప్రతిజ్ఞ లన్నియు న్యాయ సమ్మతములా ? భీమసేనుని శపథమున కేమందువు ? ఊరుభంగ మొనర్చుట గదాయుద్ధ

మర్యాద కాదు. అర్జునుని ప్రతిజ్ఞా పాలనమునకై భగవానుఁడైన శ్రీ కృష్ణుఁడే సూర్యరశ్మిని తన సుదర్శనాయుధముతో నిరోధించెను. దుర్యోధనుని కొనర్చిన వాగ్దానమునకు ద్రోణాచార్యుఁడు అభిమన్యుని దొమ్మియుద్ధమున మడియించుట న్యాయమందువా? ఏమన్నా! మాటాడవు! వాగ్దానము నుల్లంఘించువా రంధతమో లోకములఁ బడిపోయెదరు, ఆడినమాటను వీడి స్వర్లోకవాసియైన తాతగారి యాత్మకు శాంతిని గల్పింపక నన్నధోలోకముఁ బడిపొమ్మందువా?"

"సోదరీ! ఎందులకంత యావేశముఁ జెందెదవు? నాకు దోచిన విషయమును యథాతథముగ నీకు వివరించితిని. అంతియెగాని విన్నాది తప్పు మమట లేదు. పల్లవ సామ్రాజ్యమునకు మహారాజ్ఞివి కాఁదగిన నీవు నీ జీవితమును విపత్తుల కెరఁజేసి యాత్మ సౌఖ్యమును త్యాగ మొనర్చు చున్నందులకు బాధఁ జెందుచున్నాను. ఈ మన పల్లవరాజ్యమును మనమిరువురమును చెరిసమముగఁ బరిపాలించునటుల తాతగారు నియమించినారు. మన రాజ్యమున నా మాట యెంతయో నీ మాటయు నంతియ. నేనెంతటి రాజునో నీవు నంతటి రాజ్ఞివి. నేను వయసుచే నీ కంటె పెద్దవాడను. నా చెల్లెలి జీవితమును సుఖమయముగఁ దీర్చి దిద్దవలసిన బాధ్యత నాయందుండగా నామె తన బ్రతుకు నర్థహీనముగ మలఁచుకొనుటకు యత్నించుచుండుట సహించలేక యట్లంటిని."

"అన్నా! నీకు నాపైఁగల యనురాగ మెంతటిదో తెలియనిదానను కాను. ఎల్లర జీవిత విధాన మొకేరీతిని సాగునా? అయిన నిఁక నీ సృష్టిలో నీ వైవిధ్యమేల? అనంతమైన ప్రకృతులు, భిన్న భిన్నములైన మనస్తత్వములు! ఇట్టి వైవిధ్యమే లేనిచో సృష్టిలో రామణీయకతకు తావేలేదు. నే నాబాల్యమును మిక్కిలి సాహసినని నీకు దెలియును.

అన్నా ! నీకు జ్ఞాపకమున్నదో లేదో మన మిర్వురము గుఱ్ఱపు స్వారీ చేయుచుంటిమి. మనకోట గోడపైనుండి కోటలోని కచ్చట నిలుపఁబడిన యశ్వముపై కురుకవలసియుండెను, ఆ ప్రయత్నమున మనము సున్నములోని కెముక మిగులకుండ నంతమొందవలసినదే ! నీవు కొంత వెనుకాడగా నేను ముందంజ వేసితిని. అప్పుడు తాతగారేమనినారు ? 'విష్ణూ ! చూడుము, పల్లవి యాడుపిల్ల కాదు, అదియంబ యపరావతారము. నీవు వెనుకంజవేయగా నీమె ముందున కుఱుకుచున్నది. సిగ్గు సిగ్గనినారు. నీవప్పుడిఁక ముందు వెనుకలు చూడకుండ క్రింది కుఱికి సూటిగ గుఱ్ఱముపైఁబడి కళ్ళెమును చేతిలోనికిఁ దీసికొంటివి. నాకా దృశ్యము నేటికిని కన్నులకుఁ గట్టినట్లున్నది. అన్నా ! అప్పుడు తాతగారేమి చేసినారో తెలియునా ? మనము క్రిందపడి పోవుదుమేమోనని వల తెప్పించి పటపించినారు. ఆయన మనకు యుద్ధప్రక్రియల నన్నింటిని నేర్పించినారు. మనల నిరువురఁ జెరియొక తొడపై నిడుకొని కనుపాపలట్లు లాలించెడివారు.

ఆ ప్రేమ లక్షణమును నేనెన్నటికిని మఱవలేను. "నీ మూలమున నేదో మహాకార్యము నిర్వహింపఁబడవలసియున్నదమ్మా !"యనెడివారు. ఆయన ప్రేమకు వెలకట్టలేము. నాకు జ్వరము వచ్చినది ఆయన పడిన వేదన నేమని చెప్పుదు ! నాలుగు దినములు నిద్రాహారములను కూడ విస్మరించినారు. కాంచీపురస్థ సర్వదేవతాయతనముల నిరంతరము ధారావాహికముగ నర్చనలు జరిపించినారు. అంతటి వాత్సల్యమయులైన తాతగారి కోర్కె నది యధర్మమైనదైనను తీర్చవలయుననియే నా యభిప్రాయము. ఇందిక న్యాయాన్యాయ విచారణ కెడము లేదు. అన్నా ! నీకొక రహస్యమును చెప్పుచున్నాను. పదేండ్లకు పూర్వముహస్తసాము

ద్రికుఁడొకఁడు మన కోటలోనికి వచ్చినాఁడు. అప్పటికి నాకెనిమిదేండ్ల వయసుండవచ్చును. ఆయన నా హస్తమును చూచి యేమనినాడో తెలియునా ? నా జీవితము కత్తిమీఁద సామనినాడు. నాకు మనశ్శాంతి యుండదనినాడు. సర్వసౌఖ్యములుండి కూడ దుఃఖపడుచుందునఁట ! నా జీవిత విధానమే చిత్రముగ మలఁగునఁట . దాని కిదియే నిదర్శనమేమో !

పల్లవీ ! నీ భీషణమైన మనఃప్రవృత్తి స్వరూపముఁ దెలియని వాడనుకాను. నీయభీష్టమును నిర్వహించుటలో నీకు వలయు సహకార మొనర్చుటకు నేను సర్వదా సంసిద్ధుఁడను. అటుపై నిఁక నీ యదృష్టము. కామాక్షీదేవి యనుగ్రహమున్నచో నసాధ్యమగునదేముండును ? ఆమె కడగంటి చూపుల వెన్నెలలో నీ బ్రతుకు వెల్లివిరియ వలెనని నా యభిలాష.''

"అన్నా ! నీ హృదయమెంత మృదువైనది ! నీ సౌందర్య మెంత గభీరము ! నేను నిజముగ నదృష్టవంతురాలను. నీ వాత్సల్యము, దేవి కృపతోడయిన నిఁక నీ త్రిలోచన కసాధ్యమనునదేముండ గలదు !''

"అవును సోదరీ ! నీ స్థిర సంకల్పమట్టిది !''

'అన్నా ! ఇఁకచూడుము. పల్లవి విష్ణుకుండిన వంశమునకు విషవల్లియై పల్లవించి పుష్పించి తన వాసనా పాగురల నా వంశమున నందఱను బంధించి విగతాసువులఁ జేయఁగలదు.'

'నిజమునకు నీ వంతటి ప్రజ్ఞాశాలినివే యగుదువు చెల్లీ !'

'అన్నా! నేనొకటి చెప్పుదును. ఈ పద్ధతి యీ నాటిదికాదు. శత్రువినాశనమునకై నయకోవిదులెల్లరు పూర్వమిట్టి ప్రక్రియలనే యవలంబించినారు. మౌర్యచంద్రగుప్తుని యమాత్యశేఖరుఁడైన యాచార్య చాణక్యుడేమి యొనర్చెను? విషకన్యా ప్రయోగమును చేసెను. గౌతమీ పుత్ర శాతకర్ణి శైలూషికల నియోగించి వారిసాయమున శత్రు నిబర్హణ కుద్యమించినాఁడు. వారెల్ల రితరులచే కార్యసాధన నొనర్చుకొనిరి. మనము రాజ సంతానమై స్వయముగ నట్టి బాధ్యతలను స్వీకరింపవలసి వచ్చుచున్నది!'

''పల్లవీ! నీవు ప్రాజ్ఞురాలవు. నీ యిష్టకామ్యసిద్ధికై భగవతిని వేడుకొందును.''

''అన్నా! నీవింక భయపడవలసిన యవసరము లేదు. దేవి భక్త వశంవద! ఆమె త్రిసంధ్యల నాభృకుటిస్థలి నర్తించుచుండును. నావాంఛా వల్లరుల నామెయే ప్రోదిసేయును. ఆమె నా తలవాకిట పీఠము పెట్టుకొని కూర్చున్నది! సర్వము సంపన్నము కాఁగలదు.''

కామాక్షీ దేవ్యాలయ పూజావసాన వేళాకృత ఘంటికా నినాదములు వాయుతరంగముల హత్తుకొనుచు మంద్ర మంద్రములై సుశ్రావ్యములై విన్పించసాగెను. రాత్రి ప్రొద్దుపోయినది. యామికుల తొలి యామావసాన సూచి హెచ్చరికలు విన్పించసాగెను. అన్నా చెల్లెండ్రిరువురు నాశ్చర్యముఁ జెందిరి. వివక్షలేకుండ తామెంత సమయము గడపినారో! ఇరువురు లేచి పరివారికలు ముందు నడువగా నంతఃపురాభిముఖులై చనిరి.

నాట రాత్రి యిరువురును భోజనము చేయలేదు. ఇరువురును తమ
తమ సౌధముల కేగిరి.

త్రిలోచన పల్లవి నులివెచ్చని నీట శిరఃస్నానమాచరించి, రక్తాం
బర ధారిణులై దేవీ మందిరమున కేగి ధ్యానస్తిమిత నేత్రయుగళలై దేవి
ప్రోల పద్మాసనమున నుపవిష్టయయ్యెను.

పల్లవి, కామాక్షీ దేవ్యంశమున జన్మించినదని రాజకుటుంబమున
నందఱకు విశ్వాసము. ఆమె దేవ్యుపాసకురాలు. దేవి యామెనుఁబిలచిన
పలుకును. నిష్ఠతో దేవి నారాధించి యామె యెన్నియో కార్యము
సాధించుకొనును.

పల్లవికొఱకు రాజ ప్రాసాదమున కామాక్షీదేవి మందిరము ప్రత్యే
కముగ నిర్మింపబడినది. అందలి దేవీమూర్తి కామాక్షీ దేవాలయము
నందలి విగ్రహమునకుఁ బ్రతికృతిగ ప్రతిష్ఠింపఁబడినది. ఆలయము
నందలి దేవికన్న నీమందిరము నందలి దేవికి భోగములధికము. వత్సర
ఋతు, మాస, వార, వాసర క్రమముల కనుగుణముగ నామె యలం
కారములు, వస్త్రాభరణములు, పూజా విధానములు మారుచుండును.

దేవి రక్తాంబరమును పీత కంచులికను ధరించి ముక్తాభరణ భూషి
తయై వజ్ర నిర్మితమైన చంద్రవంకను శిరముపైఁదాల్చి రవ్వల ముంగా
మురారితో జగన్మోహినిగ వెలిగిపోవుచుండెను! మల్లీ సుమమాలలు
దాల్చి వసంత సుందరియై మెఱసిపోవుచుండెను! సర్వకాలముల యం
దును దేవి మల్లికా స్రజములచే నలంకరింపఁబడ వలసినదే!

త్రిలోచన తన యుద్యానవనమున నా సుమ సంతతులను సర్వ
ఋతువులందును పూయించును. ఆమె యుద్యానమున నన్నియు సుగంధ

బంధురములైన పుష్పములే ! కొలకులన్నియు పద్మసుందరములు, నీలో త్పలాలంకృతములు ;

పల్లవి పుష్పప్రియ ! ఆమె దేవీ మందిరమున ప్రవేశించుచునే అమ్మవారిని పూవులలో ముంచి వేయును. దేవీ మందిర మెల్లప్పుడు సుగంధి పుష్ప పూజాద్రవ్య పరిమళముల సమాహారమై, గోఘృత దీపా లంకృతమై, నాసా చక్షుః పరితోషకమై మనః ప్రశాంతి కాకరమై యుం డును. జగన్మాతయైన కామాక్షీదేవి దరస్మిత వదనారవిందయై, కృపా మృత రోచిస్సుల వెలార్చు కడగంటి చూపులు గలదై యభయముద్ర దాల్చి దర్శన మొసఁగును.

ద్వితీయ యామావసానమును సూచించు యామికుల హెచ్చరికలు వినిపించు వేళకు త్రిలోచన నిద్దుర చాలమి నరుణలోచనయై లేచి దేవికి నమస్కరించి నిర్మాల్యమైన మల్లెచెండును శిరమున ధరించి విశ్రాంతి మందిరమున కేగెను.

తల్పముపై తల్పముగ నమర్పఁబడిన హంసాకృతిగల పర్యంక ముపై నామె శయనించెను. గవాక్షములగుండ లోనికి సుగంధితములైన మలయ పవనములు చొచ్చుకొని వచ్చుచుండెను. వెన్నెల పాలవానయై కురియుచుండెను.

త్రిలోచన పల్లవికి కన్నులు మూఁతపడుటలేదు. ఆలోచనా ఘూర్ణితమైన యామె మనస్సునకు విశ్రాంతి యనునది లేకుండ నున్నది. తాను తలపెట్టిన యజ్ఞము తుదముట్ట నెఱవేరునా ! అన్న తన్నేమియు ననలేక యూరకుండుటేగాని యాతనికీ ప్రతిజ్ఞా నిర్వహణము కొత్తుగ నిష్టము లేదు. అది యసామాన్యము, ననన్య సాధ్యమునైనది. ఒక రీతిగఁ

జూచినచో మిగుల నసహ్యకరమైనది కూడ! సృష్టిలో నెవ్వరు విని నను హర్షించనిది. అది యితరుల విషయమునైన దానను మోదింపఁ జాలనిది! కాని, తానేమి చేయఁగలదు! తనకు తానై యీ వాగురలో చిక్కుకొనినది. "బుద్ధిః కర్మానుసారిణీ" యన్నట్లు తన కర్మ మిట్లున్నది కాబోలు!

ఇంతకు తాను విష్ణుకుండిన రాజ్యమున బ్రవేశించుటెట్లు? మున్ను తామిరువు రచ్చటికి యజ్ఞార్థమై యాహూతులుగ వెళ్ళి యుండిరి. ఇప్పుడిఁక తానుగ నచ్చటి కేగిన బాగుండునా? రాజదుహితయై తానట్లరుగ వచ్చునా? అచ్చటి వారెల్లరు తన్ను చిన్నచూపు చూడవచ్చును. తాను వచ్చిన పని నేమని చెప్పికొనును? నాడు నరమేధమున కేగినప్పుడు యువరాజు సోదరుడైన సునీతవర్మకు తనపై ప్రేమభావ మున్నట్లనిపించెను. తానచ్చట నుండినంతసే పాతఁడు తనపైఁ బ్రేమదృక్కులఁ బఱపుచునే యుండెను. ప్రీతి స్నిగ్ధములైన యాతని క్రీగంటి ప్రసారములు తన మనస్సు నాహరించినవి. తలఁచుకొన్నచో సునీతివర్మను తాను తన కొనగోటిపై నాడింప గలదు. కాని, ఆతనితో సమాగమ మెచ్చట జరుగవలెను? జరుగుటెట్లు? అదియే తన మనస్సున రూపు కట్టుట లేదు. తమ రాజ్యమున కాహ్వానించిన వారు వత్తురా? వచ్చినను సునీతి వర్మయే రావలెనని యేమున్నది? తన యోచనలన్నియు సునీతి వర్మను చుట్టుకొనియే గద పరిభ్రమించు చున్నవి?

సునీతి వర్మను మోహపెట్టి వలలో వైచుకొని యాతని బరిణయమాడి విష్ణుకుండిన అంతఃపురమున నడుగుమోపవలె, అప్పుడు గాని తన పథకము నెఱవేరుటకు వీలు లేదు. తమ వంశము బ్రాహ్మణవంశము! విష్ణుకుండినులు క్షత్రియులు, తానెంతకు దిగజారనున్నది! ఏమి చేయ

వలయును ? చంద్రగుప్త చక్రవర్తి యవనకన్య యైన హెలీనాను వివాహమాడలేదా ! రాజనీతియం దిదియొక యెత్తు !

తాను సంతానవతియై యుభయ వంశములఁ దరింపఁజేయబోవుట లేదు కద ! తన పితామహునికి వారియెడల గల పగ సాధించుటకైన సాధనము మాత్రమే యది. దౌహిత్రుని గాంచి సంతసించుటకు తన తండ్రి లేనే లేడు. విష్ణుకుండిన మహారాజునకు తానట్టి సుఖమును కలుగ నీయదు. "స్త్రీషు దుష్టాసు వార్ష్ణేయ జాయతే వర్ణసంకరః" అని కదా శ్రీకృష్ణ భగవానుని ప్రవచనము ! తాను దుష్టురాలు కాబోవుచున్నది. కాని వర్ణసంకరమును గానిచ్చుట లేదు. తాను శిలాటువు వలె నిలచి పోవును. నిర్గంధ సుమమువలె రాలిపోవును. తనకు తానే శిక్ష విధించు కొనును. అప్పుడిక నీ యుద్వాహమున సంభవించగల దోషమే మున్నది ! -

ప్రథమముగ తాను విజయవాటికలో ప్రవేశించి యెటులో సునీత వర్మ మనస్సున కెక్కవలెను ! తానున్నరీతిగఁ బోజాలదు. కుహనా వేషమున నేగవలయును. మున్ముందుగ తన చారుల నటకు బంపి విజయవాటిక యందలి పరిస్థితుల నవగాహ మొనర్చుకొనవలసి యున్నది విమకొండ, అమరావతి, ధాన్యకటకము నగరములందు సైతము తాను చారచక్షువై మసలవలయును. తన యీ మంత్రాంగము నెవ్వరేని పసి గట్టినచో తన ప్రాణములు బొందిలోనుండవు. అందులకు సైతము తాను సంసిద్ధురాలై యరుగవలసి యున్నది.

తన కపరిచితములైన యుద్ధ ప్రక్రియలు లేవు. తనకు వ్యూహ రచనలన్నియు క్షుణ్ణముగఁ దెలియును. ప్రాణావసర సమయమున

బంధీయైన వేళల క్లిష్ట పరిస్థితు లడ్డిన యపసున తప్పించుకొనిపోవు నెత్తుల నెఱుఁగును. స్త్రీ జనోచితమైన సర్వవిద్య [illegible] గరతలా మలకములు !

సునీతి వర్మపై త్రిలోచన పల్లవి హృదయాంతరమున నొక సుకుమార భావ ముదయించినది. తన నీతి ఫలించుచో నాతనిపట్ల యను రాగభావము నుపసంహరించు కొనగలదా ! అయినను యిప్పుడెందులకు ? అంతదనుక వచ్చినప్పు డాలోచించుకొన వచ్చును. కాంచీపురము వీడి చనినచో తిరిగివచ్చు టెన్నటికో ! మరల వచ్చుటనున దుండునా యని? ఏది యెట్లు జరుగవలసి యున్నదో అది యట్లే జరిగితీరును. "యత్నే కృతే యది న సిధ్యతి కోఽత్ర దోషః !" తాను త్రికరణ శుద్ధిగ యత్నించును. మృత్యుదేవతయై తాను విష్ణుకుండిన వంశాంకురములను బీజదశయందే తుడిచివేయును. మాధవవర్మ తరువాత నిఁక విష్ణుకుండిన వంశము సాగరాదు, తాను సాగనీయదు ! తాను భగవతి చండీరూపము నారాధింపవలెను. తనకిఁక నసాధ్యమగున దేమున్నది?

నాల్గవజాము ప్రవేశించినది. కోడికూతలు వినిపించుచున్నవి. కామాక్షీ దేవాలయ ధ్వజస్తంభమునందలి చిఱుగంటలనుండి ప్రాతరాయాత సమీర లాలితములైన మృదుమధుర నిస్వనము లుద్గమించు చుండెను, త్రిలోచన కన్నులు మూతవడెను.

నరమేధము పూర్తియై యెంతోకాలమైనది. మాధవవర్మ మహారాజునకు క్రతువు సాకల్యముగ నెఱవేఱిన దమతృప్తి కలుగలేదు. ఏదో వెలితి బాధించుచున్నది. ఆ యజ్ఞదత్తుఁ డెట్లున్నాఁడు! నిరీహుఁడై నిర్మముఁడై అంతర్ముఖుఁడై యున్నాడు. యూప స్తంభమునకు బిగించి కట్టగా నే విధమైన ప్రాతికూల్యమును ప్రదర్శింపక స్థిరుఁడై నిలచెను. బలిపశువు లెంత గింజుకొనును! స్వేచ్ఛమై వచ్చిన యజ్ఞదత్తుఁ డెందులకు ప్రతిఘటించును?

మరణము అనివార్యమని తెలిసియు మానవుఁడు మృత్యు భయమును జెందుచున్నాడు. మరి యీ బ్రాహ్మణ వటుఁడంత మమతా రహితుఁడగుట యేమి? శునశ్శేపు సంతతివాఁడు వరుణదేవుని ప్రార్థించి ప్రాణముల నిల్పుకొనెనే! "శరీర మాద్యం ఖలు ధర్మసాధనమ్" అనినట్లు శరీర మున్ననే కద సర్వధర్మములు పాపపుణ్యములును! శరీరమే లేనప్పు డేమియు నుండదు. అట్టి దేహత్యాగ మొక ధర్మమును పురస్కరించుకొని జరుగునప్పుడు విచారమే ముండును?

నరమేధ సమయమున నాతని వదనము నిర్వికారముగ నున్నది. ఆతని కన్నులు ప్రశాంత భావములను విరజిమ్ము చున్నట్లుండెను. ఒకానొక తిరస్కారము, ఒక గర్వరేఖ, ఒక తృప్తి రకరకములుగ వెలిగి పోయినవి! ఆకర్ణాంతములైన యాతని నేత్రములం దగాధ జలరాసులు ప్రళయవహ్నిచ్ఛటలు ప్రతిఫలించినవి. తనకు భయమొదవినది, తాను

జడతఁ జెందినాడు. యజ్ఞదత్తుఁడొక మహానుభావుఁడు. అతని యజ్ఞాంగముగ జేయు టనుచిత మనిపించెను.

ఆ నృసింహశర్మ, శ్రీవతు లెంత దుఃఖము ననుభవించుచున్నారో, తా నుడుగరలను బంప తిరస్కరించినారు. గర్భశోకమును భరించుట, అందును నేకపుత్రవిషయక మైనప్పుడు మఱియు దుర్భరము. యజ్ఞదత్తుని తల్లి యేడ్పు పెలుఁగు హృదయ విదారకమై యిప్పటికిని తన శ్రవోరంధ్రముల మార్మ్రోగు చున్నది. తన మనస్సునకు శాంతి లేకున్నది.

చంద్రావతి దేవికి పైతపటులే యున్నది. యజ్ఞసమయమున నామె యించుమించు స్మృతి విరహితయై కూర్చున్న దనియే చెప్పవలెను. యజ్ఞదత్తుఁడామె మనస్సునంత పట్టి నిల్పినాడు. అతఁడామెకు స్వీయ సంతానము వలె ననిపించెను. ఇప్పటికి నామె యనుక్షణము వానిని దలంచి కంటనీరు పెట్టుచునే యున్నది. అతని, బలి పశువుగ పట్టు వేళ యజ్ఞ దిదృక్షాగతులైన సర్వరాజ నికరము, జన సందోహము, హాహాకారము లొనర్చిరి. నిశ్చలముగ నున్నది తాను, యజ్ఞదత్తుఁడు, పినాక భట్టారకుఁడు ముగ్గురే!

ప్రజలెల్లరు యజ్ఞదత్తుని సుందరాకారమును జూచి తమ మహారాజిట్టి బాలుని యజ్ఞపశువును జేయుట బాగుగలేదని, ఇది మహారాజున కేదైనఁ గీడొనరించునేమో యని, దేశమునకే విపత్కర పరిస్థితులు సంభవింప వచ్చునేమోయని పరిపరి విధముల గుసగుసలు పోయిరట!

మాధవవర్మ మహారాజేకాంత మందిరమున హంసతూలికా తల్పమున బరుండి యుండెను. ఆయనకాలోచన లెంతకును తెమలుట లేదు.

ఆ నరమేధము మొదలు తుదలందు తనకు గుండె బరువై కూర్చున్నది తానేదెస, జూచినను ఆబ్రాహ్మణ వటువి కన్నులు తన్ను వెన్నాడుచున్న ట్లుండును. మణిదీపపు మిలమిలలో నాతని కన్నుల కదలికలు దీప కళికలలో నాతని నేత్రాంశువుల, దాను తట్టుకొనలేకుండెను. తన జీవితము విశ్రాంతి నెఱుఁగకుండ సాగుచున్నది. తాను గద్దె నెక్కిన తొలి దినములలో మూఁడవ కుమార విష్ణువుతోడి సంగ్రామము సంభవించినది అనుభవ హీనుఁడైన తననుండి రాజ్యమున, గొన్నిభాగములు జారి పోయినవి. తాను మరల కుమార విష్ణునోడించి వానిని చేజిక్కించు కొనెను కళింగులతోడి సమరము, మహాకోసలాధిపతితో పోరు, తత్ఫలితముగ చంద్రావతీదేవి కల్యాణము సమకూడినవి.

ఒకవంక సంగ్రామములు, వేరొక దెస యజ్ఞ యాగాదులు, రాజ్యవిస్తరణ కాంక్ష, ధర్మ కర్మాచరణ బుద్ధిగ తనబ్రదుకు ద్విపథ రీతుల నడచుచున్నది. తనకు ప్రాయము పడమరకు తిరుగుచున్నది. విశ్రాంతి తన కెంతేని యవసరము. యువరాజుపై రాజ్యభారమునునిల్పి తాను నిశ్చింతగ నుండి పోవచ్చుననిన నాతవి కట్టి సామర్ధ్యమున్నట్లు కానరాదు.

యువరాజు లలితమైన చిత్తవృత్తి కలవాడు. చిత్రలేఖనము, సంగీతము, నాట్యము మొదలైన లలితకళల యందున్న యభిరుచి యుద్ధము, రాజనీతి, పరిపాలనము నందున్నట్లు కానరాదు. తన రాణులలో నొకతెయైన మలయపతి కదంబరాజదుహిత. ఆమె కాభిజాత్యము మెండు. తాను బ్రాహ్మణవంశమున జన్మించినదఁట. తనపుత్రుఁ డింద్ర వర్మ రాజుకావలె నన్నట్లు మాటాడును. సుభద్రను కదలించినచో ఆమె తానే రాజమాత కాదగినదన్నట్లు చరించును. యువరాజు మాతయైన

చంద్రావతీదేవి యేమియు ననదు. ఆమె రాజకేవి వెలార్చదు. ఆమె మితభాషిణి. తనకోర్కెల వెలిబుచ్చదు. రాజునందును, ఆయనయొనర్చు కార్యకలాపము లందును నామె కనన్యమైన ప్రత్యయతాబుద్ధి యున్నది. ఆయన యేది చేసిన నది న్యాయ మని విశ్వసించును. ఆమె సాన్ని ధ్యము తనకు చంద్రికాతప స్నానమువలె శీతల మలయ సమీర మృదు స్పర్శ వలె కర్పూర పరాగాభిషేచనము వలె హాయిఁ గొల్పును. ఆమె వీణావాదనము నాలకించు నంతసేపును మహారాజునకు నాకలిదప్పు లుం డవు. ఆయన యా వీణానిక్వణమున లీనతను భజించును.

యువరాజు తమ్ముడు సుపీతివర్మయందు శౌర్యధైర్యములు మెండు. కాని యతనికి లోకానుభవము చాలదు. ఇంద్రవర్మ దేవవర్మలు భోగ లాలసులు, పశ్చిమ చాళుక్యరాజు పులకేశి తమపై నెత్తివచ్చుట కుద్య మించుచున్నాడఁట. కుమారవిష్ణు మహారాజు పరలోక గతుఁడగుటతో సమర్థుఁడైన పరిపాలకుఁడు లేమి పల్లవుల యెద్దడి తగ్గినది. తన నర మేధ యజ్ఞమునకు పల్లవరాకుమారుఁడును, రాకుమార్తెయు విచ్చేసిరి. వారు సాధువర్తనులవలె నున్నారు. ఆ రాజ దుహిత నామధేయము త్రిలోచన పల్లవియఁట. ఆమె సౌందర్యరాశి, చిదిపి దీపము పెట్టవచ్చు నన్నట్లున్నది! ఆమె పురుషోచితములైన ధైర్యస్థైర్యములు గల పోటు మానవియఁట।

విష్ణుకుండిన వంశముతో కదంబులు, వాకాటకులు, గుప్తులు తమ తమ కన్యల నొసఁగి సంబంధముల నేర్పరచుకొనిరి. పల్లవ రాజకన్య కూడ తమ అంతఃపురమున నడుగిడిన నిఁక నాంధ్రములఁగన్నెత్తి చూడఁ గలవాఁడుండఁడు. ఆ రాకుమారి తన కుమార వధువైనచో నెంత

ముచ్చటగ నుండును ? సునీతివర్మ యామెను మెచ్చుకనుల నీక్షించెను. అతఁడామెను మనసా వరించినట్లున్నది. ఆమె తన సౌధముల నడుగిడిన నిఁక లేనిదేమున్నది ?

ఇట్టి యాలోచనలు చేయుచున్న మహారాజునకు వామనేత్రము స్పందించినది. ఈ యనుబంధము శ్రీగిరి మల్లికార్జునస్వామి కభిమతము కాదా ! త్రిలోచన కామాక్షీదేవి యనుగ్రహమున నామె యంశమున జనించిన బిడ్డ యందురు ! భగవతి భ్రమరాంబిక, దుర్గాదేవి, కామాక్షీదేవి వీరందఱొక్కటియే గద ! మహాదేవుఁడు తన బిడ్డను మన్నించదా ! పల్లవ రాజ్యముతో సైతము పొత్తు కుదిరిన గాని విష్ణుకుండిన వంశమునకు తగినంత దీప్తిరాదు.

మాధవవర్మ మహారాజునకు సమయము దొర్లిపోవుచున్నదను సూహయే కల్గుటలేదు. సాయంతన శివారాధన సమయము మించిపోవుచున్నది. ఇంద్ర కీలాద్రిపై వేంచేసియున్న శ్రీ దుర్గామల్లికార్జునస్వామి యాలయము నందలి భక్తవరులచే మ్రోగింపఁబడిన ఘంటల గణ గణ ధ్వనులు మెల్లగ కృష్ణవేణీ చిఱుతరంగములపైఁ బాఱాడుచువచ్చి రాజాంతఃపుర సౌధములఁ జొచ్చుకొను చుండెను. ఆ ధ్వనులచే నులిక్కిపడి ప్రభువులేచి త్వరితగతి నిజమందిరమున కేగెను.

పట్టపురాణి సౌధము నుండి వీణానాదము శ్రవణ గోచరమగుచుండెను. రాగము చక్రవాకము వలె నున్నది. అది మిగుల నార్తిమంతమయిన రాగము. దుఃఖాభిభూతుఁడైన జీవుఁడు తన వేదనను నివేదించుకొనుటకా రాగము హృదయపులోతులఁ జొచ్చుకొనుచు మనస్సును

ద్రవింపఁజేయును. మహారాజ్ఞి వీణావాదనమునకు మహారాజు మోహితుఁడగును.

చంద్రావతీదేవి గుప్తరాజ వంశమునందు మాత్రమే పోషింపఁబడుచున్న యొకానొక సూక్ష్మ సూక్ష్మ స్వరసంపుటుల మేళవింపుచేనైన చిత్ర విచిత్రములైన రాగచ్ఛాయల నాలపించును. గుప్తవంశమునందలి పూర్వమహాపురుషులలో నొకఁడయిన సముద్రగుప్త చక్రవర్తి గొప్ప వైణికుఁడు. సముద్రగుప్తోపజ్ఞకములైన కొన్ని రాగములున్నవి. అవి యన్నియు నా వంశమునందు మాత్రమే ప్రచారమునందున్నవి. అట్టి రాగముల నన్నింటిని చంద్రావతీదేవి యాలపించును. మహారాజు పరవశించి పోవును.

నరమేధము నాఁటి నుండి మహారాజు మనస్సు చింతాజడమై పోయెను. ఆమె నిరంతరము నివారదీనయై గంభీరముగ నుండును. ఆరాధన వేళల నార్తిమంతములైన రాగముల నాలపించును. వాని యందు లీనమగుచున్నట్లుండును. ఆమె తిరిగి స్వస్థురాలగుటెట్లో మహారాజున కవగతమగుటలేదు. చక్రవాకరాగముచే ప్రబోధితుఁడై మహారాజు చంద్రావతీ సౌధముల కేగెను. అట్టి సమయమున దయచేసిన మహారాజును గాంచి యంతఃపుర పరిచారికలు సభయచకితులై త్వరితగతి దేవి యొద్దకేగి యావార్త నామెకు నివేదించగా నామె సంభ్రమాన్వితయై లేచి మహారాజున కభిముఖముగ నేగి యానంద బాష్పముల నాయన పాదములు కడిగి తన సరిగంచు చేలాంచలముతో తుడిచి కన్నులకద్దుకొని యాయన నాసీనునిగావించి ఆయనపార్శ్వదేశమున నిలచెను రాజామె వినయ శీలమునకు ముగ్ధుఁడయ్యెను. ఆయన రాణులందింకెవ్వరి యందును మర్యాదారీతులింత మృదువుగనుండవు. మహారాజునకు చంద్రా

వతీదేవి యెడల గౌరవాన్వితమైన ప్రేమభావము. ఆయన యామెతోనిట్లనెను— "చంద్రా ! ఇది దేవతామందిరము. ఇచ్చట మనమిరువురము నొకటిమే, ఈ మర్యాదల కిట ప్రసక్తిలేదు. మన మిరువురమును చేరి స్వామి మల్లికార్జును నర్చింతము !

ఆ రాజ దంపతులు మందిరాభ్యంతరమునకేగి స్వామి పాద దేశమునందు మోకరిల్లిరి. సహస్ర ఫణములతో పరివేష్టించిన శేషాహి యలంకారముగ గలవాఁడై వజ్రములతో నమర్చిన విభూతిరేఖలతో, త్రినేత్రముగ నమర్చిన నీలమణిద్యుతులతో మల్లికా స్వచ్ఛధావళ్యమును వెలార్చు స్ఫాటికాలింగము పుష్పమాలాలంకృతమై మెఱసిపోవుచుండెను.

చంద్రావతీ దేవి శివ భక్తురాలు. ఆమె నిత్యము నేకాదశ రుద్రాభిషేకముల జేయించును. ద్విసంధ్యల శివసహస్ర నామార్చన చేయును. ఆమె పూజామందిరము కైలాససదృశముగ నుండును : పూజా సమయమునందామె కాషాయాంబరమును దాల్చి స్ఫాటికభూషణముల ధరించును. నిత్యశిరఃస్నానము చేయును. పరిమితాభరణములతో ఫాల భాగమున విభూతిపైఁ దీర్చిన కుంకుమతో, కనుతుదలదాక సాగిన కజ్జల రేఖలతో, పుష్పమాలికాలంకృతమైన కేశబంధముతో నామె లింగార్చన మొనర్చునప్పు డచ్చముగ హిమగిరి కన్యగా కన్పించును.

ఆమె దర్శన మాత్రముననే మహారాజు తన్మయుఁడగును. అచ్చమైన వారి యనురాగము నందు మోహమునకు తావుండదు. చంద్రావతీ దేవి మహారాజునకు హృదయహారిణియైన ధర్మపత్ని. తక్కిన భార్య లున్నారు. వారు కేవలము రాజనీతిని పాలించుటకై తత్కాల

జనిత మోహావనయనమునకైనవాడు. వాడు మహారాజు మనస్సును పాన ఖాన విలాస నృత్యగీతాదులచే రంజింపఁజేయగలరు కాని, హృదయమున ప్రవేశింపలేరు. తన యాత్మకు శాంతిని చేకూర్పఁజాలదు మహారాజు ప్రాణములు తనకే తెలియని రీతిని చంద్రావతీదేవి యందు ప్రతిష్ఠితములై యున్నవి.

ఆమె సాన్నిధ్యము నాయన యెక్కువుగ భరించలేడు. అనారతము రాజకార్యవ్యగ్ర బుద్ధియైన మహారాజు లౌకిక చిత్తవృత్తి నిరంతర మహేశ్వర ధ్యానైకపరాయణమయిన యామె మనోలక్షణమును పట్టుకొనలేదు. రాచకార్యములచే విసిగిన మనశ్శరీరములకు విశ్రాంతి కావలసిన వేళ చంద్రావతీదేవి సౌధములాయనకు గమ్యస్థానములు. ఆయమ వీణావాదన మాయనకు హృదయ తాపహారి. ఫుల్లసరోజ సదృశమైన యామె వదనము విచార రేఖను సైతము తాను దర్శింపఁ జాలఁడు తానేమి చేయఁగలఁడు ? ఏమి యొనర్చిన నామె వదనము పరిఫుల్ల నవమల్లికా మనోజ్ఞతను వెలార్చును ?

నరమేధమామె నెంత చేసినది ! యజ్ఞమొక హేతువై యజ్ఞాంగముగ నరమేధము జరుగుట, అందు కోటకా బ్రాహ్మణ వటువును చెచ్చుట జరిగి అది హృదయమునకు బాధయై కూర్చున్నది. కాని, సృష్ట్యాదినుండి జరుగుచు వచ్చుచున్న నీ నరమేధమున కంతున్నదా ? అనంత కాలము మీఁద లెక్కలేనన్ని మహాసామ్రాజ్యములుజ్జ్వలములై వెలిగినవి. కాంతి హీనములై చల్లారినవి. ఎన్నెన్ని మహాసంగ్రామముల నెంతెంత నరమేధము జరుగక పోయినచో మహాసామ్రాజ్యములు వివి లగుపెట్టు ?

మహాభారత సంగ్రామమున జరిగినంత నరమేధము వేటొకట కనిపించదు. తాను సైతము సమరాంగణముల శతసహస్రాధికము వైరివీరుల శిరఃకర్తన మొనరించిన వేళలున్నవి. అది యంతయు నరమేధము కాదా! నరమేధమనిన మానవత్వమును నశింపజేయుట యనిపించును. అధికుడైన వాడు, అధికారము నందున్నవాడు, తన క్రింది వారలందరి అధికబుద్ధిని, శక్తిని, శాస్త్రజ్ఞతను ఒకటనియేమి, సర్వ విషయము లందలి యాధిక్యమును దమననీతిచే నణచివేయుట యంతయు నరమేధమనిపించుకొనదా!

ఇట్టివి సార్వకాలికములు. భగవంతుని సృష్టికి సమాంతరముగ నీ నరమేధము కూడ సాగివచ్చుచున్నది. అధికారము, అహంకారము, దురభిమానము, మాత్సర్యము, మోహము, మదము ననునీ గుణములు ప్రధానముగ నరమేధము ప్రవృద్ధమగుచున్నది. హిరణ్యాక్షహిరణ్యకశిపు రావణ దుర్యోధన శిశుపాలాది మహావీరులందరు నిట్టిగుణముల సమాహార రూపులే. ఇది యంతయు లోక సామాన్యముగ, జరుగుచున్నట్లని పించుచు నీ నరమేధక్రతువునందలి యజ్ఞదత్తుని మరణమే తన మనస్సును బాధించుటేమి? జగన్మోహన మూర్తులైన రాజపుత్రు లెందరు రణరంగమున విహతులు కాలేదు? తన కిట్లనిపింపలేదే! యజ్ఞదత్తు డాత్మార్పణ మొనర్చుటచే కల్గిన శ్లాఘనీయమైన ప్రవర్తనచే నాచ్ఛాదితమైన మనస్సు నుండి సముద్భవించిన యనుకంపాగుణ ప్రాకట్యమా యిది! ఎంత యోచించినను తన మనస్సు సమాధానపడుటలేదు. పినాక భట్టారకుల యొద్ద తన సంశయనివృత్తి కావించుకొనవలెను.

నాటిరేయి మహారాజు చంద్రావతీదేవి యంతఃపురమునందే విశ్రమించెను. మరునాడు మలయవలయ ప్రాసాదమునకు రావలసినదిగ

పినాక భట్టారకునికి మహారాజు కబురుపెట్టెను. భట్టారకుఁడు వచ్చువేళకు మహారాజు వలయాకారపు చంద్రకాంతశిలావేదికపై నమర్చిన హంస తూలికా తల్పమున వామహస్తమాలంబముగ నాలోచనాముద్రలో శేషాహి తల్పముపై శ్రీ మహావిష్ణువువలె దర్శనమొసఁగెను. మహారాజు మేనిపై నాచ్ఛాదనము లేదు. కేవలమొక ప్రావారకమున్నది. ఏదియో ఆలోచనా వ్యగ్రతచే నలసియున్నట్లాయన మొగమున ప్రస్ఫుటముగ కానవచ్చుచున్నది.

మహారాజునట్లు చూడగనే భట్టారకుని మనస్సు చలించినది, మేరుధీరుఁడగు మహారాజు వదనమున నీదైన్యరేఖలు తారాడునేమి ! మాధవవర్మ మహారాజు కాని నాఁడు తన చెలికాఁడు యువరాజైనాఁడు తానాయన స్నేహితుఁడు. మహారాజైనాఁడు పురోహితుఁడు, నర్మసచివుఁడు. తానాయనకు కానిదేమున్నది ! మహారాజమృతాంతఃకరణుఁడు. భావ తీవ్రత కలవాఁడు. ఏ విషయమునైనను జొచ్చుకొనిపోయి దానిని సాంతము పరిశీలించి గాని విడువని లక్షణమున్నవాఁడు. ఆ మహా ప్రభువంతటి సునిశిత సూక్ష్మ విచారణశీలిగావుననే ఆంధ్ర సామ్రాజ్యము మూఁడు పూవు లారు కాయలుగ నడచిపోవుచున్నది. ప్రజలెల్లరు సుఖ శాంతులతో తులతూగు చున్నారు. ఆ ప్రభువు నూరేండ్లు వర్ధిల్లవలె!

భట్టారకుఁడు మహారాజు ముందు నిలచి "ప్రభూ ! తాము నాకు వార్త పెట్టినారు" అనెను మాధవవర్మ యుల్కిపడి లేచి," మీరు వచ్చి యెంత సేపైనది ? నిలచియేయుందురేమి ? మేమెన్ని మారులు చెప్పితిమి కాదు ! ఆ బాల్యస్నేహితులమైన మన యిరువుర కేకాంతమున రాచరికపు మర్యాదలడ్డురాకూడదని !' అనుచు తానై ప్రభువు భట్టారకు నాసనముపై గూర్చుండఁబెట్టి తాను తన తల్పముపై నాసీనుఁడయ్యెను.

"ప్రభూ! బాగున్నది. ఏకాంతమున నున్నప్పుడు మాత్రము తాము ప్రభువులుకారా? అప్పుడు రాజ్యపాలనా లక్షణము తమ యందుండదా? భార్య సరసన లేనంత మాత్రమున నవివాహితుని క్రింద లెక్కయా? యజ్ఞమొనర్చి యజ్ఞకర్త యగుచున్నాఁడు. వివాహమాడి వివాహితుఁ డగుచున్నాడు. అట్లే రాజ్యపాలన మొనర్చుచు రాజగుచున్నాడు. తాము రాజ్యస్వీకారము చేసిన వెంటనే మహారాజులైనారు. మేము పాల్యవర్గములోని వారమైనాము. తాము మాకష్టసుఖములు విచారించి న్యాయ్యముగ పరిపాలించ వలసి యున్నారు."

"మంచివాడవు! నేవనిన యొక్క మాటకిన్ని చదివితివి!"

"తాము మరల నేమైన యజ్ఞమును దలపెట్టినారా?"

"ఎవరనినారు?"

"ఎవరు ననలేదు. సాధారణముగ తామై నన్ను పిలువనంపుట యన్న యజ్ఞార్థమే యనుకొంటిని. తఱచుగ నట్లే జరుగుచుండును గద!"

"నిజమే, మేమిప్పుడు మిమ్ముల రానించిన దందులకు కాదు. మాకు కొన్ని సందియములు కలిగినవి. వాని నివృత్తి కలిగించుకొనుటకై మీకు వార్త పెట్టితిమి."

"నా వలన దీరఁదగిన వైనచో నట్లే నివేదింతును."

"నా సందియములు మీవల్లనే తీరవలయును. నరమేధ మన్నచో మాకు స్పష్టార్థము గోచరించుటలేదు. సృష్ట్యాది నుండి సంగ్రామములు జరుగుచున్నవి. అసంఖ్యాకముగ జనులు నిహతులగు చున్నారు. అది

నరమేధమే యగునేమో! దేవ-దానవ, రామ-రావణ, కురు-పాండవ మహాహవముల నెంత నరమేధము జరిగినది! ధర్మస్మృతుల ననుసరించి ప్రభువు లపరాధులకు శిక్ష విధించుచున్నారు. ఉరిశిక్ష వేయుచున్నారు. అదికూడ నరమేధమేనా? అవి యన్నియు సృష్టిసహజమైన నీసరిమము ప్రత్యేకముగ చేయవలసిన యవసరమేమి? ఇన్ని మహా సంగ్రామము లందు జనులపారము సంహరింపఁబడుట చూచుచున్నాము, వింపుచున్నాము. అట్టివేళల మా మనస్సున బాధాలేశము కలుగకపోగా నుత్సాహమే దీపించెడిది! నిందితుల శిరః కర్తనమున నానందము జనించును. కాని నాటి యధ్వరమున యజ్ఞదత్తుఁడు బలిపశువై మరణించుచుండ నా మనస్సు కరలి పోయినది. యజ్ఞ సమాప్త మైనదాది నేటివఱకు నా మనస్సాయువసుని విస్మరింప లేకున్నది. బాధఁజెందు చున్నది. దీనికిఁ గారణమే మందురు? ఎంత విచారించినను నా మనస్సునకు సమాధానము కుదురకున్నది. మీరు వివరించి చెప్పినచో జ్ఞాతార్థులమై సంతసింతుము."

"చిక్కు ప్రశ్ననే వైచినారు. తమ సందియము లన్నియు నొక విధముగ సముచితముగనే యున్నది. కాని వీనిలో భేదము లున్నవి. ప్రభూ! మనము వైదికులము. అనగా వేదములను ప్రధానముగ మన్నించువారము. సనాతనధర్మమున శ్రుతి స్మృతి పురాణేతిహాసములఁ జెప్పఁబడిన ధర్మకర్మల నాచరించెడివారము. మనధర్మ మౌపనిషదము. మన నాగరికత వైయ్యాసికి, పారాశర్య మహర్షి తీర్చిదిద్దిన నాగరికతను మనము పోషించుకొను చున్నాము. ఉపనిషత్తులలోను, బ్రాహ్మణము లందును యజ్ఞయాగాదులు సమృద్ధిగఁ బ్రవచింపఁ బడినవి. అష్టాదశ పురాణముల విరచించిన కృష్ణద్వైపాయనుఁడు యజ్ఞయాగాదుల ప్రాముఖ్యమును గూర్చి నొక్కి వక్కాణించెను.

యజ్ఞమున జీవహింస జరుగుచున్నది. సంగ్రామముననుజీవ హింస జరుగుచున్నది. యజ్ఞమునందు హింసింపఁబడిన జీవి స్వర్లోక వాసి యగుచున్నాడు. సమరమున నసువులు వీఁడిన వీరవరుఁడును స్వర్లోకమున కరుగుచున్నాడు. అది మన విశ్వాసము. క్రతువు లొనర్చు వారు స్వర్లోకవాసము నభిలషించుచున్నారు. 'స్వర్లోకామోయజేత', యజ్ఞాంగమైన పశువునకు త్రిదశాలయ ప్రాప్తి యొదవుచున్నది. ఆహవ మొనర్చు రాజునకు స్వర్గవాంఛ గాక రాజ్యవిస్తరణాకాంక్ష, ఇహలోక వైభవ పిపాస ప్రధానములగుచున్నవి.

యుద్ధమునందు మృతిజెందు యోధులున్నారు. సేనాపతులున్నారు. వారెల్లరు జీతబత్తెములఁ గైకొని తమతమ కుటుంబ పోషణార్థము కొలువు చేయుచున్నారు. యుద్ధమొనర్చుట వారికి వృత్తి ధర్మమైనది, అది నరమేధ మనిపించుకొనదు. యజ్ఞదత్తుఁడు బలి పశువుగ తాము నరమేధమును నిర్వహించినారు. బలియైన యజ్ఞదత్తుఁడు స్వేచ్ఛాను వర్తన శీలుఁడై యజ్ఞాంగముగఁ దన్నుతాను సమర్పించుకొనినాఁడు. అతఁడు తమ నుండి యేమియు నాసించలేదు. తామర్థించినారు, అతఁడు యజ్ఞప్రియుఁడు, యజ్ఞవిఘ్నము నోర్వలేడు. కావుననే తాను వచ్చి నాడు. తాము యజ్ఞదీక్షితులరై యంగీకరించినారు. యుద్ధమున మడియు సైనికులకు యజ్ఞపశువుగ వచ్చిన నీ యువకునికి నెంతో భేదమున్నది. జీవి ప్రారబ్ధము ననుభవించుటకై జన్మించుచున్నాఁడు. జీవిత పరిధిలో కొంత ప్రారబ్ధ మనుభూతమై పోవ మరల క్రొత్తలు పుట్టుచుండును. అట్టి ప్రారబ్ధము ననుభవించనీయకుండ యజ్ఞదత్తుని మనము యజ్ఞ పశువును జేసినాము. వాని ప్రారబ్ధమల్లే మిగిలిపోయినది కద. దాని కాతఁడు పునర్జన్మమెత్తవలెను."

"యజ్ఞము దేవతాప్రీతికరమైనది. స్వర్లోకవాస హేతుకము మోక్షదాయి కద ! ఆ స్వర్లోకవాసావధి కాగానే పునఃమర్త్యలోకమున జన్మింపవలసినదే ! "అయ్యా ! అట్లయిన నీ యజ్ఞకర్త పరలోక సుఖముల నర్థించి చేయు యాగము లధికతర విషయవాంఛా దూషితము లగుటలేదా ! అధికాధిక ఫలముల నాశించి నరమేధ అశ్వమేధాది యజ్ఞము లొనర్చుట ధర్మమగునా ?"

"ప్రభూ ! తాము నన్ను పరీక్షింపనెంచుచున్నారా ? లేక మరెందులకో విచిత్రముగ మాటాడుచున్నారు. కాకున్నచో యజ్ఞయాగాది క్రతువుల ప్రాశస్త్యము, అసంఖ్యాకములైన యజ్ఞముల నొనర్చి పూత చరిత్రమైనది తమ వంశము ! తమకు యజ్ఞ స్వరూపము తెలియదని నేనెట్లు భావింతును ! మీ ముత్తాత తాతగారైన మొదటి మాధవవర్మ మహారాజు నిర్వహించని యజ్ఞము లేదు. ఆయన నరమేధము సైత మొనరించి నారని చెప్పుకొందురు. ఆయన తమ వంశమునకు కీర్తి పతాకవంటి వాడు. రెండవ మాధవవర్మ సైతము బహు యజ్ఞముల నొనర్చి మించిన పుణ్య పురుషుఁడు. ఆయన అమరావతిని శైవక్షేత్రముగ తీర్చిదిద్దిన పరమేశ్వర భక్తుఁడు. తాము సైత మా యిరువురి వంటి వారే. తాము రాజసూయమును జేసినారు. సంకల్పించి యొరు లెవ్వరు సంపూర్తి చేయఁజాలని నరమేధమును సాకల్యముగ నిర్వహించిన తమకు నేనేమని చెప్పఁగలను !"

"ఔను భట్టారకా ! మీరన్నవన్నియు నిజమే, యజ్ఞమింక కామ్య కర్మయగు చున్నది. నిష్కామ కర్మ గొప్పదను చున్నారు గద !"

"మహారాజా ! ఆశ్రమ ధర్మములున్నవి. నిష్కామకర్మ మెవరికి ? సంసారమును త్యజించి సన్యాసులై మహాటవులందు కేవ

లము లోకకల్యాణమునకై తపించువారికి. నగరములలో ప్రజాపాలకులై గృహమేధులైన తమ బోంట్లుకాదు. తమ రధిక విషయ వాంఛా దూషితులై యజ్ఞములఁ జేయుటలేదు. దేవతా ప్రీతికై చేయుచున్నారు. వారు సంప్రీతులై ప్రతిఫలముల నొసఁగుచున్నారు. వాని వలన స్వర్లోక భూలోకములు సుఖశాంతుల వెల్లివిరియుచున్నవి.''

'అయినచో నా యజ్ఞదత్తుని స్వార్థమిందేమున్నది ?'

''ప్రభూ ! అతఁడొక మహాపురుషుఁడు కాఁదగినవాఁడు ! పారావత మునకై తనమేని కండరములను కోసియిచ్చిన శిబిచక్రవర్తి దేవేంద్రునికై తన వెన్నెముక నొసంగిన దధీచి, తన వైరి తండ్రియే తన వినాశము నభిలషించి యర్థింపవచ్చెనని తెలిసియు త్రిదివాధిపతికి వెనుక ముందాలోచింపక స్వీయదేహమునుండి సహజ కవచకుండలములను జీల్చి యొసఁగిన కర్ణుని వంటివాఁడు ! అట్టి మహాపురుషు లరుదుగ ప్రభవింతురు. యజ్ఞదత్తుఁ డాకోవకు జెందిన మహాత్యాగ పురుషుఁడు ! అతని విఁక విస్మరింపుఁడు ప్రభూ !

''అది చాల కష్టముగ నున్నది. అతని తల్లి రోదనము మా శ్రవో రంధ్రముల నింకను ప్రతిధ్వనించుచున్నది. నృసింహశర్మ శోక సంతప్తారుణ వదనము నా కనుల ముందింకను నర్తించుచున్నది !''

''మహాప్రభూ ! నేనొక రహస్యమును జెప్పుచున్నాను, మన్నించవలయును. తమ మనఃప్రవృత్తి సర్వదాద్వివిధముగనుండును. లౌకికముగ రాజకీయముగ స్వీయ పరివార విషయమున సైతము తమ తీర్పు లప్రతిహతములు, శిక్షాతీవ్రములు, ధర్మప్రధాను సంధాయకములు, వలసిన తావులందు కాఠిన్యము తమయందు తత్కాల సముద్భూతమగును.

ఎంతటి మహాక్లిష్టస్థితులనైన నిష్ఠె యవలీలగ పరిష్కరింతుడు. ఇదం తయు లౌకికమైన ప్రవృత్తి, తప హార్దికవృత్తి చంద్రచూడాహారమైనది. అతసీకుసుమ పేశలము. అది అమృత స్యందిని. బుద్ధిచే కఠినమైన నిశ్చయములఁజేసి వృత్తిచే వానిని నిర్వహించి వ్యాసయ ధర్మముచే వ్యధితమనస్కులగు చుందురు. అందువలన తమకు మనశ్శాంతి దూర మగుచున్నది ప్రభూ ! జగత్ప్రభువైన శ్రీమల్లికార్జునస్వామి యందు చిత్తమును నిల్పి ధ్యానించుచుండుట వినా చేయఁగగినది లేదు.''

''భట్టారకా ! యథార్థము వచించితిరి, అది యొక్కఁడే మార్గము. మరియొక సందియమును దీర్పుఁడు.''

''నా యెఱిఁగిన నంతలో నట్లే చెయుదును.''

''మహాకాలుఁడు క్రతుధ్వంసి కదా ! మన మా పరమేశ్వరు పదారాధనులమై యాయన కనిష్టమయిన క్రతువులొనర్చుటలోని సామంజస్యమవగతమగుట లేదు. ఎంత కాలమునుండియో యీ సందేహము నా మనస్సున కసమాధేయముగ నిలచిపోయినది.''

''ప్రభూ ! నిజమే, పరమశివుఁడు క్రతుధ్వంసియే, కాని యా క్రతు వెట్టిది ? దక్షాధ్వరము. ఆయన దక్షాధ్వరధ్వంసి. ఆయన సర్వక్రతు ధ్వంసియగుచో మీరనినట్లే భావించవచ్చును. కర్మ మార్గము క్రతు సంబంధి. పరమేశ్వరుఁడచ్ఛమైన వెలుఁగు. జ్ఞానమార్గమాయన కత్యంత ప్రియమైనది, 'నహి జ్ఞానేన సదృశం పవిత్రమిహ విద్యతే' మహాతప స్సంపన్నులైన వీతరాగులు జ్ఞానమార్గావలంబులై కైవల్యముఁ జెందినారు. అయినను జ్ఞానమార్గము విశేషించి యాశ్రమవాసులైన మహర్షుల కుపాదేయమయినది. తమవంటి ప్రభువులకు కర్మమార్గమే యనుసరణీ

యోగ్యమైనది. జనక మహారాజు మొదలైన వారెందరో కర్మనిష్ఠు లయ్యు రాజర్షులైనారు. అట్టిదే తమకు నుచితమయినదిగ తోచుచున్నది. ధర్మేతరమయిన దానిని పరిత్యజించి నిష్కామ మార్గమున వ్యవహ రించు వారలకు ఫలితముతో నిమిత్తము లేదు; ''కర్మణ్యేవాధి కారస్తే మాఫలేషు కదాచన'' అని కదా శ్రీకృష్ణపరమాత్మ యుపదేశము ! సత్సంప్రదాయ నిబద్ధమై ఆర్షధర్మోచితమై వేదవిహితమైన కార్యముల నాచరించుట మనకు ప్రధానము. తాము తద్భిన్నముగ రేఖా మాత్రమైన నడచుటలేదు !'' పినాక భట్టారకుఁడు తన ప్రసంగమును ముగించెను.

మహారాజునకు మనస్సు తేలికపడినట్లుండెను.

మాధవవర్మ పినాక భట్టారకు లిద్దరును తమతమ యగ్నివేశ్మ ముల కేగిరి.

-0-

మహారణ్య సీమ ఆదిత్యాంశువులు సైతము చొరరానట్లున్న ఘనాంధకార నిబిడ ప్రదేశము: క్రూర వన్యమృగ యూధముల విహార ప్రదేశము. విచ్చిన పూల కన్నులతో నాకసమువంక విచిత్రముగఁ జూచు ముగ్ధ బాలికలవలె యరణ్య భూములన్నియు విరియఁబూచి పకపక నగుచున్నట్లుండెను. మట్ట మధ్యాహ్నపు మండు టెండలో సూర్యోదయ చిఱుతెలికాంతులు వృక్షలతా గుల్మాదుల యాకుల సందుల నుండి చొచ్చుకొని వచ్చి వెన్నెలల వలె ప్రకాశించుచుండెను.

వేటకాండ్ర యఱపులతోఁ జాగిలములచే తరుమబడుచు వన్య వరాహము లొనర్చు ఘుర్ఘురారవములతో వృక్షశాఖలపై ద్విజ సంతతు లొనర్చు విచిత్రానేక ధ్వనులతో, ఇతరానేకారణ్య మృగాళి యొనర్చు భయంకర గర్జారావములతో నా విపినసీమ యంతయు భయావహముగ నుండెను.

ఇరువురాశ్వికు లాయరణ్యము గుండ పయనమొనర్చు చుండిరి. వారిరువురును బహుదూర ప్రయాణముచే మిగుల నలసిపోయి నట్లున్నారు. వారి మొగములు వాడియున్నవి. నూనూగు మీసములు సైతమంకురించని చిఱుత ప్రాయమున నున్న బాలురు వారి మోములందు పట్టుదల, కన్నులందు తైక్ష్ణ్యము కొట్టవచ్చుచున్నట్లున్నవి. ఇరువురు విల్లు నమ్ములతో నడుమున వ్రేలాడు ఖడ్గములతో మహావీరులట్లు దర్శనీయముగ నుండిరి.

వారలకు క్రూరసత్త్వములన్న వెఱపులేనట్లున్నది. అరణ్యము లందలి యా భీకరధ్వనులకు పిఱికి వారగుచో గుండెలు వ్రీలి చావవలసినదే! ఆ యువకు లిరువు రచట పరిచితపూర్వములైన జనపదము లందువలె నిర్భీకముగ సంచరించుచుండిరి.

అశ్వములఁ జిత్రచిత్రగతుల దూకించుకొనుచు నెకసక్కెము లాడుకొనుచు, గమ్యస్థానమును చేరుకొనుటకై త్వరపడు చుండిరి. వారి సమ్ముఖమున లేడి పిండులు తమ యంతులేని కోర్కెలట్లు క్రేళ్ళు రుకుచు పరుగిడుచుండెను. అరణ్య మంతయు గగ్గోలుగ నుండుటచే మృగ సమూహమంతయు భయకంపితమై చిందరవందరగ పరువెత్త సాగెను.

ఆ వీరులయం దొక్కఁడు తన ప్రావారకము నొక హరిణ శాబకము వైపునకు విసరి దానిని చేజిక్కించుకొని తన గుఱ్ఱముపై బంధించి యుంచెను. అచ్చటకు సమీపమందున్న యొక సరోవరము నొద్దున తమ యశ్వముల నవరోహించి వాటిని నీరు త్రావించి తాము దాహముఁ దీర్చుకొని కొంత తడవు విశ్రమింపఁ దలచిరి. కాని యంతలో నెవరి చేతనో దవ్వులనుండి తరుమఁబడుచు మిగుల బడలిపోయి కోపముతో మండిపడుచున్న కన్నులతో నొక వనవరాహము దిక్కులు పిక్కటిల్లునట్లు, బొబ్బలిడుచు వారిపై కుఱికెను.

వారి యందొక వీరుఁడు వర్మమునుండి ఖడ్గమును దూసి యొడుపుగ నా వరాహము కంఠము నుత్తరించుటయు, నంతలో నొక బాణము రివ్వున దూసికొనివచ్చి దాని యుదరమున నాటుకొనుటయు నా వరాహము గిరగిర తిరుగుచు గిలగిల కొట్టుకొనుచు మడియుటయు, నొకే

క్షణమున జరిగిపోయెను. రెండవయతఁ డాశ్చర్యముఁ జెంది యీబాణ మెట్లు వచ్చినదని దిక్కులు చూడసాగెను. అంతలో నొక వెపునుండి గుఱ్ఱపు డెక్కల ధ్వని వినిపించెను.

యువకు లిద్దరు కన్నులింతలు చేసికొని ఆ యశ్వమును చూడ సాగిరి. ఎదురుగ నశ్వారూఢుఁడైన రాకుమారుని వలె నున్న సుందరాకారుఁడైన యువకుఁడు కనిపించెను. అతఁడు సూటిగ నా వరాహము పడియున్న తావును సమీపించి యచట నున్న యువవీరులఁ గాంచి మను స్వనకంఠమున పైకిట్లనెను — "యువకులారా! మీరెవరు? నేను వేటాడుచున్న మృగమును వెద్పతీయుటకు మీకేమి యవసరము వచ్చినది? అది న్యాయముగ నా వేటగద!

ఇరువురు యువకులలో ఖడ్గపాతమొనర్చిన యతఁడు — "బాగున్నది మీన్యాయము! వరాహము మాపైఁ గవిసినది. ప్రాణరక్షణమునకై దీనిని వధించితిని. ఆత్మరక్షణ మొనర్చుకొనుట దోషము కాదుగద! నిజమునకీ వేట నాది. నేను దీని కంఠము నుత్తరించితిని." అనెను.

"నేనుదయవేళ నుండి దీనిని తఱుముచు తిరుగుచున్నాను. అంది నట్లందుచు తప్పించుకొనుచు వచ్చినది. దీని యంతు దేల్పవలెనని పట్టుదలతో వెంటఁ బడినాను. ఇది నా బాణపాతమున నీల్గినది." "అని రాకుమారుఁ డనెను.

యువకుఁడు నవ్వి — "ప్రత్యక్షముగ నా ఖడ్గహతిచే కూలినట్లు కన్పించుచుండగా మీ బాణముచే నందురేమి? నా కత్తివ్రేటునకు దీని కంఠనాళములు తెగి పడిపోవగా నంతలో మీ బాణము దీని యుదరమున గ్రుచ్చుకొనినది. కనిపించుట లేదా? చూచుకొనుడు" అని వాక్రుచ్చెను.

రాజపుత్రుఁడు గుఱ్ఱముపై నుండి దిగి యా వరాహమును దగ్గరి పరికించి వల పరీక్షించి —"వీరుఁడా! నీ వన్నది నిజమే. నా బాణము కన్న మున్నే నీ ఖడ్గఘాతమైనది. మిక్కిలి సాహసికుఁడ వగుదువు! ఇంత చిన్న వయస్సున మీరీ ఘోరాటవిఁ బడి యెచటి కేగుచున్నారు? మీ యిరువురిట్లు వచ్చు టపాయకరము గాదా" యని ప్రశ్నించెను.

"మేము సమర్థుల మగుదుమో కామో మీరిప్పుడే చూచినారు గద. ఘోరాటవులు మాకు విహారభూములు. వేట మా కత్యంత ప్రియమైనది. భయమను మాట మే మెఱుఁగనిది!"

"కావచ్చును, మీ రే రాజకుటుంబమునకుఁ జెందినవారు? ఎచ్చటి కరుగుచున్నారు?"

"మేము కాంచీపురమునుండి వచ్చుచున్నాము. విజయవాటికకు బోవలెనని బయలుదేరినాము."

"విజయవాటికకా? అచ్చట మీకుఁ గావలసిన పనులేమున్నవి?"

"కృష్ణాస్నాన మొనర్చి దుర్గాదేవి నారాధించి, మల్లికార్జున స్వామి వారిని సేవించుకొందమని బయలు దేరినాము."

"ఇంత చిన్నవయస్సున నెంతటి భక్తిప్రపత్తులు! చిత్రముగ నున్నది! మీ కాంచీపురమునందు కామాక్షీదేవి యున్నది కద!"

"భక్తికి వయస్సుతో సంబంధ మేమున్నది? ప్రహ్లాదుఁడును ధృవుఁడును మఱియు పసిబాలురు కద!"

"మీ సమాధానము రమ్యముగ నున్నది. మీ పల్లవులకును విష్ణు కుండినులకును ప్రబల విరోధము లున్నవని మీకుఁ దెలియదా ?"

"ఎందుకు తెలియదు ? కాని యా వైరము లిప్పుడు సమసిపోయి నవి కద !"

"అదెట్లు ?"

"'మరణాంతాని వైరాణి' యని వినలేదా? మాధవవర్మ మహా రాజునకు పరమ శత్రువైన కుమార విష్ణు మహారాజు మరణించినాఁడు. ఆ మహారాజు నరమేధమున కాహ్వానము పంపగా కుమార విష్ణుప్రభువు మనుమఁడును మనుమరాలును విజయవాటికకు వచ్చిరి గద !"

"ఔను నిజమే. మీరు కాంచీపురమున నేమి చేయుచుందురు ?"

"మేము మహారాజు పరివారముతో నుందుము."

"అనిన మీ కంతిపురమున నుద్యోగమా ?"

"మంచివారు ! అంతఃపురమున మా బోంట్ల నుంచెదరా ? మేము నగర రక్షక భట సైన్యమున పనిచేయుదుము."

"మీ మహారాజు సోదరి త్రిలోచన పల్లవీదేవిని మీరెఱుఁగుదురా?

"చాల తడవలు చూచినాము. మా యక్కఁగారామె శిష్య సఖి. ఆమెకు మీ రెప్పుడైనఁ జూచినారా ?"

"మా నగరమున నరమేధమునకు వచ్చినప్పుడు చూచినాము."

"ఇంతకు మీరెవ్వరో తెలియఁ జేయనే లేదు !"

"నీవు మంచి గడుసు వాడవు వలె నున్నావు ! మీ రాకుమార్తె మిక్కిలి యందగత్తెయఁట గద !"

"ఏమండీ ! చమత్కారముగ మాటాడెదరు ! మీరు చూచితి మంటిరి గద ! మరి మమ్మడిగెదరేమి ?"

"అంత కోపమెందులకు ? మేము దూరమునుండి చూచితిమి. మీ రట్లు కాదుగద ! పోనిండు. మీ రిరువురు మా వెంట మా రాజధానికి వచ్చెదరా ?"

"ఇంతకు మీరెవరో తెల్పితిరి కాదు !"

"మేము రాకుమారుల మనుకొనుము !"

"మహారాజులకు కుమారులు నల్వురఁట ! వారిలో మీరెవ్వరు?"

"సునీతివర్మ యనుకొనుము."

"తప్పక వచ్చెదము. మీ ప్రాపు మాకు కొండంత ధైర్యమును సమకూర్చినది. మమ్ము మీ కొలువున జేర్చుకొందురా ?"

"ప్రయత్నింతుము !"

"మీరు నిజముగ సునీతివర్మయే యగుచో మమ్ము మీ కొలువున నిల్పి స్వీయసైన్యమున జేర్చుకొనరాదా ?"

"తప్పక, మేము మిమ్ముల నాప్తమిత్రులుగ స్వీకరింతుము."

“ధన్యులము !”

ఇంతలో రాజకుమారుని వెదకుచు వచ్చిన పరిజన మచ్చటికిఁ జేరినది. అందఱును రాజధానికి పయనమైరి.

విజయవాటికలో సునీతివర్మ సౌధము రాచనగరున కర్ధగవ్యూతి దూరమున నున్నది. కృష్ణానదీ తీరమున నొక విస్తారమైన నారికేళ వనాభ్యంతరమున నున్న యా భవనము సుధాధవళితమై గోపురములతో సమున్నతమై యా మనోజ్ఞమగు నారికేళతరుశాఖలలోనుండ సాగర గర్భము నుండి వెలికివచ్చు రాకేందు బింబము వలె కను విందొనర్చు చుండెను.

సునీతివర్మ యా వీర యువకుల నిద్దఱను తన సౌధమునకుఁ గొంపోయి యచ్చటనే యున్న వేఱొక భవనమున వారికి వసతి నేర్పఱచి వలసిన సదుపాయముల నొనర్చుటకు భటులను నియోగించెను.

రోజులు గడుచుచున్నవి. మహారాజుతో నీ వీరవరులను గూర్చి యెట్లు చెప్పవలయును ? సునీతివర్మకు తండ్రిగారనిన గౌరవాన్విత మయిన భయము. తానై స్వతంత్రించి వారికి తన సౌధమునఁ బ్రవేశ మీవచ్చునో లేదో ! ఆ యువకు లిరువురు సౌందర్యవంతులు. వారి యందొకఁడు మరియు సుందరుఁడు ! పరిశీలించిన నాతని సౌందర్యము యువతీ జనోచితమైన దనిపించును ! పరమశివుని మోహపెట్టుటకై వచ్చిన జగన్మోహిని పురుషాకృతిలో వచ్చినట్లుండెను ! కత్తి పట్టి కొన్నచో నాతని సమక్షమున నెంతటి యోధుఁడైనను దీలుపడి పోవలసినదే ! ధనువునందు కొనినచో నెంతటి దవ్వున నున్న లక్ష్యమునైన నవలీలగ భేదించఁగలఁడు ! వ్యూహరచన లాతని యొద్ద నభ్యసించ

వలసినదే ! అతఁడెల్ల వేళల యుద్ధ ప్రక్రియలఁ గూర్చియే ప్రసంగించును. ఒక్కొకతరి కంఠమెత్తి రాగాలాప మొనర్చును. అది గానము కాదు, గాంధర్వము ! రాలుకరఁగునా యనిపించును !

అతని నడకయే నాట్యమును తలపించుచుండును. తన యక్కగారితో పాటు నాట్య విద్య నభ్యసించినాడఁట ! అన్వర్థమైన నామము ! అతని నయన సౌందర్యము నాస్యతో దర్శనీయము. ఆ కర్ణాంతములైన యాతని నేత్రములు తడియాఁబని తమ్మిపూరేకులు ! రెండవ యాతఁడెల్ల వేళల చారులోచనుని వెనువెంటఁ దిరుగును. అతని యాజ్ఞల నిర్వర్తించును. అతఁడును సందకాడేయనఁజెల్లును. కాని చారులోచనునిది దేవతా దుర్లభమైన సౌందర్యము. తన మనస్సాతని సౌందర్యానలములో తపించిపోవునట్లున్నది !

ఆ యువకుఁ డసామాన్యునివలె నున్నాఁడు తన కాతఁడు సమీపస్థుఁడైనప్పుడాతని శరీరాంచల స్పర్శ తన్నెదో లోకములకుఁ గొంపోవుచున్నట్లుండును. తన తనువెల్ల పులకించి పోవునట్లు తానెదో సుఖానుభూతిని పొందుచున్నట్లానందించును. తన కాతని కౌగలింపవలెననిపించును. రక్త పాండురములై మృదువులై దర్పణ ప్రతికాశములై శ్మశ్రురహితములైన యాతని కపోలము లచుంబించవలెననిపించును. ఆ భావమే పరిహాస భాజనముగ నున్నది ! అట్టిదేమైన పొఱపాటున జరిగినచో నాతఁడు తన్నేమిగ తలంచునో ! అతని సాన్నిధ్యము తన్ను వేచుచున్నది. అతని నుండి దూరముగ నుండలేదు తాను,

సాయంవేళల కృష్ణానది యందు నీలమండల లోతుగల ప్రవాహమున నస్తమయభానుని యరుణకాంతులు మిలమిలలాడుచుండ సంధ్యా

శీతలానిలములు ఫాలభాగమున యలకంబు కదలించుచుండ చారులోచ నుఁడు గానమొనర్చుట సునీతివర్మ యానందించుటలుగ గడచును. ప్రభాత వేళల నుదయభానుని యరుణాంశువులు నదీనీరములఁ బర్వి రక్తభ్రాంతిని గల్గించుచుండ సైకతస్థలిపై గల్పించుకొనిన రంగస్థలమున వారలిరువురకు ఖడ్గ విద్యాభ్యాసములు, గుఱ్ఱపుస్వారులుగ గడచిపోవును. మధ్యాహ్నవేళల వీరగాథలు వ్యూహరచనములు గ్రంథ పఠనములుగ నెలలకు నెలలు గడచిపోవుచున్నవి.

సునీతివర్మ ఆ వీరయువకులను తన తండ్రిగారి కెఱిఁగింపవలెనను తన యభిలాష నడచుకొనజాలకుండెను. ఆ యువపీఠిని కౌగలించుకొనక తాను నిలవలేదు. ఆతని నయనయుగ్మమును చుంబించనిచో తన జీవితమే నిష్ప్రయోజనము. అతఁడు యువతి యగుచో తానెంత యదృష్టవంతుఁడయ్యేడి వాఁడు! మరుక్షణమున పరిణయమాడి మన్మథ సామ్రాజ్య పట్టమహిషినిగ రూపొందించెడివాఁడు.

సునీతివర్మ మనస్సులో రగిలిపోవుచుండెను. ఎవరితో చెప్పికొనుటకు వీలులేనిది, అనుభవించకుండ నుండఁజాలనిది యయిన నా విచిత్ర వ్యాధియై కూర్చున్నది నల్వురు రాజకుమారులలో చివరివాఁడు. అందఱతనిని పసివాడుగఁ జూతురు. తల్లి యొద్దనే కాని తండ్రి యొద్ద నంతగ చనవులేనివాఁడు, అన్నగారును యువరాజునైన గోవింద వర్మ యొద్ద కొంతచేరిక యున్నది. ఆయనతోనే విషయమును ప్రస్తావించుటెట్లు? ఎవరితో మాత్రము చెప్పుటెట్లు? అన్నగారి కొకసారి చారులోచనుని చూపించవలయును. సునీతివర్మ యూహలిట్లు సాగుచుండెను.

త్రిలోచన పల్లవి యాలోచనాపరంపరల కంతు లేకుండెను. తామిరువురు కాంచీపురము వీడి నెలలు గడచినవి. విజయవాడలో తాము సురక్షితముగనున్నారు. సునీతివర్మ తమ్మిరువురను శిరోధార్యముగ గౌరవించుచున్నాఁడు. అతని చేష్టితములు, సంభాషణ, తమయెడల నాతని ప్రవర్తన, సర్వము తన పథకమున కనుకూలములుగ నున్నవి. అతనికి తనయందు తెలియరాని వలపున్నది! తన తనూస్పర్శకతఁడు లవలీకిసాలము వలె చలించిపోవును. తన శరీర సంధానమున కతఁడచ్చెరువందును. తృష్ణాగాఢములైన నేత్రముల నాతఁడు తనలో నేదో వెదకికొనును. ఖడ్గ విద్యాభ్యసన వేళల కత్తిపిడు లొడసిపట్టు సమయములఁనైన యంగుళి స్పర్శలచే పులకితుఁడై ఖడ్గమును జారవిడిచి అతఁడట్టె నిలచిపోవును! కలువరేకుల వంటి కన్నుల తన్నదే దృష్టిగ తిలకించుచుండును. తన నిజస్వరూపము తెలియుచో తనకు నివాళులెత్తును. అట్టి సమయమింకను రాలేదు! తానిఁక మహారాజు, మహారాజ్ఞి రాజపరివారముల మన స్తత్వములఁ దెలిసికొనవలెను.

త్రిలోచన పల్లవి యందకత్తియయఁట, ఆమె గొప్ప ఖడ్గవిద్యావేత్రి. కాంచీపురమున నామె సర్వాధికారములు వెలయించునఁట! ఆయమ యన్నగారామె నల్లారుముద్దుగ జూచుకొనుచు రాజతంత్ర మంతయు నామె చేతనే నడిపించునఁట! ఆమె వివాహ మెందుకు చేసికొనలేదో! సునీతివర్మ యంతులేనన్ని ప్రశ్నలు వేయుచుండును. ఏదియెట్లయినను సునీతివర్మ మనస్సు తనయం దాబద్ధమయినది! తన పథకము కొనసాగుట కది ముఖ్యాంశము. కాలమనుకూలముగనే యున్నట్లున్నది. కామాక్షీదేవి తనయందు ప్రసన్నురాలు. తన ప్రతిజ్ఞ తప్పక నెఱవేఱ గలదు.

నాడు సునీతివర్మ యేదియో కార్యాంతరమున విష్ణుకుండిన పుర మునకు (వినుకొండకు) పోయెను. త్రిలోచన తన చెలికత్తె నందినితో ముచ్చటించుచుండెను. నందికా! మనము విజయవాటికకు వచ్చిన తరు వాత నిన్నిట్లింత దనుక సంబోధించ లేదనుకొందును!''

''రాజకుమారీ! ఇచ్చటికి వచ్చినప్పటినుండి మనమాడువార మను మాటనే మఱచినట్లున్నాము, తోటలో నెన్నిజాతుల పుష్పములు విరియఁ బూచి యున్నవో చూడుడు. నా చేతులతో మిమ్మలలంకరించి యెన్నో యుగము లైనట్లున్నది!''

''నిజమే. మల్లీసుమముల కొంత్రమములఁ బ్రశస్తి యెక్కువ. మన కాంచీపురము నందలి పూవులకన్న నీ కృష్ణానదీ పీర వర్ధితములైన పూవు లతిశయ సువాసనాభరితములై మనోహరముగ నున్నవి!''

''మన యత్నములు ఫలోన్ముఖము లగుట కా వసవరాహము, ఎంత తోడ్పడినట్లయినది! ఆ ఘట్టమీ ప్రతిజ్ఞా నిర్వహణము నందు ప్రథమాంకము.''

త్రిలోచన నవ్వుచు ననినది— ''అంతేకాదు. ఈ బాలహరిణము నుత్తరీయమున బంధించలేదా! ఇది నాచేఁ జిక్కినది.''

ఆమె యా హరిణశాబకమును దగ్గఱకుఁ దీసికొని శరపీర ముకు శములఁ దినిపింప సాగెను.

''బాగుగ సెలవిచ్చినారు. ఈ హరిణ శాబకమా రాకుమారుఁడే! మీరాయనకుఁ దెలియకున్నను ఆయన మిమ్ము మనసార ప్రేమించు

చున్నారు. మీ నామము నాలకించినంత మాత్రమున నుల్కిపడుచున్నారు. పాపమాయన యాతనఁ జూడలేకున్నాను.''

''నందికా! అట్లందునేమి? ఆతని దచ్ఛమైన ప్రేమ. మనవలె కైతవమును నెఱపుట లేదు కద! ఒక్కొక సమయమున సునీతివర్మను తిలకించిన బాధ యొదవుచుండును. ఆతని ప్రేమ వెల్లువను తట్టుకొన లేక మనోవ్యధ నుపసయింపలేక నిస్సహాయురాల నగుచున్నాను.''

''అయినచో మీరాతని .... !''

''దోసమేమున్నది? అంతటి ప్రేమైకజీవి, మృదు మధుర హృదయుఁడు. నిగర్వి. లలితమైన మనః ప్రవృత్తి కలవాఁడెవ్వతెకు వరణీయుఁడుకాఁడు!''

''అమ్మో! విషయము చాలవఱకు వచ్చినదే!''

''నీ పరిహాసముఁ జాలింపుము. అట్టిస్థితి యొదవవలెననియే కద మన యత్నమంతయు!''

''నవ్వుల కంటిని, క్షమించుఁడు. మీ ప్రతిజ్ఞయే లేకున్నచో మీ యిర్వుర దాంపత్యము జగన్మోహనముగ నుండును కదమ్మా!''

''ప్రతిజ్ఞకేమి! ప్రతిజ్ఞవేఱు, వ్యవహారము వేఱు. మనమిఁక నెంతకాల మీ పురుష వేషముల మసల వలయునో! నాకు చాల కష్ట మనిపించుచున్నది!''

''మహారాజ్ఞిని, యువరాజ్ఞి సుదర్శనాదేవిని కలియవలెనంటిరిగద'

„నిజమే, కావి వారి నీ వేషములతో దర్శింపలేముంద ! ఎటులో యాలోచించవలయును,''

„మీరు స్థిర సంకల్పులు. మీరాలోచించుటనగా నిర్వహించు టనియే యర్థము.'

„కొలది దినములలో నీవాక పర్యాయము చంద్రావతీ దేవి యంతఃపురమున కేగవలసి యున్నది.''

„తమ యాజ్ఞ !''

„సునీతి వర్మగా రెప్పుడు తిరిగి వత్తురో ! అంతదనుక మన మూరక కాలము గడుపుటయా లేక .... ''

„ఏమి చేయమందురు ?''

„నీవు నేడే కోటలోనికిఁ బ్రవేశము కలిగించుకుని మహారాజ్ఞి దర్శనము చేసి పల్లవరాజ దుహిత పంపినదని మన యొద్దనున్న రత్న ములను, నీలమణులను నాయమగారి కుపానముగ నొసఁగి నేనిచ్చెడి లేఖ నామె కందిచ్చి యామె మనః ప్రవృత్తి నాకళింపు చేసికొని వచ్చి నచో బాగుండును !''

„చిత్తమటులే చేయుదును.''

„ఎంతో జాగ్రతతో సంచరించవలెను. మనకిచ్చటి యాచార వ్యవహారములు కట్టుబాట్లు చాల క్రొత్తగ నుండును. మన కవి యేమియు

దెలియవవియే చెప్ప వలయును. అడుగు తీసి యడుగు వేయవలెననిన వేయి యాలోచించ వలసి యుండును.''

''ధన్యురాలను. అటులే యొన రును.''

సునీతివర్మ వచ్చెదనవిన గడువు దాటి పోయినది. నందిక కోట లోవికేగి మూఁడు దినము లయినది. ఆమె యింకను తిరిగి రాలేదు. విపరీతము లేమైన సంభవించి యుండునా! తా నొంటరియై పోయినది. ఆమెకేమి చేయుటకును పాలుపోవుటలేదు

సునీతివర్మ యింకను రాదేలనో! విష్ణుకుండిన పురము వీరి ప్రముఖ నగరములలో నొకటి కాబోలును. ఆయన యచ్చట నిర్వహింప వలసిన రాచకార్యము లేమైన నున్నవేమో! కాంచీపురమున సకల రాజభోగముల ననుభవించుచు రాజ్ఞియై సంచరించు తానీనాడు విజయవాటిక యందేకాకిగగడవని కాలముతో నిముసములు లెక్కిడుకొనుచు కూర్చుండ వలసిన దుస్థితి కల్గినదని చింతించును.

త్రిలోచన యొంటరితనమును భరింపలేక పోవుచున్నది. చంద్రావతీదేవి నందిక నాదరించినదో లేదో! ఆమె తన లేఖ నెట్లర్థము చేసికొన్నదో!

నాల్గవదినమున సునీతివర్మ వచ్చెను ఆయన చారులోచనుని చూచి సుశీలు(దేమయ్యెనని యడిగెను. అతఁడు నగరమును చూచుట

కును, ఉండవల్లి గుహను దర్శించుటకును వెళ్ళియుండవచ్చునవి చారు లోచనుడు పల్కెను.

"అయినచో మరి నీవేల వెళ్ళలేదు ?"

"క్షేత్ర దర్శనాదులందు నాకంత యాభిముఖ్యములేదు. అదిగాక మా పల్లవ రాజ్యమున నున్నంత శిల్ప నైపుణిని వేఱొకచో చూపించుడు".

"ఉండవల్లిలో అనంతపద్మనాభస్వామి విగ్రహమున్నది. అది ఏక శిలపై మలచిన మహా శిల్పము !"

'దక్షిణాపథమందు విరచింపఁబడినంత శిల్పమాంధ్రముల నంత రింపఁబడలేదనిపి చు చున్నది. మధుర, కాళహస్తి, కంచి చిదంబరములందు శిల్పాభిరామములైన దేవతాయతనము లున్నవి. అంత దనుక నెందులకు ? ఇచ్చట దుర్గాదేవ్యాలయమున్నది. అందేమి శిల్పమున్నది ? కేవలమమ్మవారున్నది. మీరేమైన ననుడు. ఆలయ శిల్పము మా రాజ్యమునఁ బరిణతమైనంతగా వేరెచ్చటను కాలేదనియే చెప్పవలయును"

'అంగీకరించినాము. పోనిమ్ము మీ రాజ్యముననే శిల్పము సమృద్ధిగ వర్ధిల్లినది !' 'విషయమును చెప్పితి నంతియకావి వేరుగాదు.'

"నేను మాత్రమనినదేమి ? పల్లవ సార్వభౌముల యశము ఘనీభవించి సాకారమై మహాబలిపురమున వేల సంవత్సరములుగ విస్తరిల్లను."

"ఇచ్చట సైతము శ్రీ దుర్గాదేవి ఇంద్రకీలాద్రి పైనుండి తన కృపాపాంగ వీక్షణముల తెలుఁగు నేలను పండించు చున్నది కద !"

"సత్యముఁ బల్కితివి. ఆమె మా యిల వేలుపు !"

"విష్ణుకుండిన పురము మీ నగరరాజములలో నొకటెగద ! అది సైతమీ విజయవాటిక యంత యందముగ నుండునా ?"

"దేనియందము దానిది, అచ్చట విష్ణుకుంఠపను చిన్న ప్రవాహ మున్నది. అది పేరునకు నదియే కాని, దానియందు జలము చాల తక్కువగా యుండును. వర్షాసమయము లందొక్కొక్కప్పుడు వరద వచ్చి పరిసర గ్రామములను ముంచియెత్తును. అప్పుడా నదీమతల్లి భద్రకాళియై నర్తించుచున్నట్లుండును; కృష్ణా తరంగిణి యటులగాక మందగతుల సుందరముగ సాగిపోవును. ఇది జీవ నది. సర్వకాలముల మనోహారిణియై దర్శన మొసఁగుచుండును."

"మీరు గొప్ప భావుకులవలె నున్నారు."

"అదికాదు. భావమును వివరించు పైఖరిలో నందముండును. అసలందమనుమాటయే చిత్రమయినది. దానిని నిర్ణయించుట కష్టము !"

"కష్టమేమున్నది ! కంటి కింపుగతోచిన నందమైన దందము !"

అవునది చూచెడి వారి మనోలక్షణమును బట్టి కద నిర్ణయమగు నది ! క్రొత్తగా పటుసమును విడిచిన తెల్లత్రాఁచందముగ నుండును. ప్రకృతిలో సుందరము కానిదేమియు లేదు. భిన్న భిన్న కోణముల

నుండి చూచిన సర్వమును మనోహరముగనే యుండును. అంతదాఁక నెందులకు ? నీవున్నావు, నీ వందగాడవే కద !''

,,చారులోచనుఁడు సిగ్గుపడి— ,,బాగున్నది ! పరిహాసమునకిఁక నేనే దొరికితినా !'' అనెను.

,,నిజము చెప్పుచున్నాను. నీవు నమ్మెదవో లేదో ! నీవు చాల సందముగ నున్నావు. నిన్ను జూచిన మరుక్షణము నుండి నన్నొక కోర్కె బలీయముగ వేధించుచున్నది.''

,,ఏమది ? ''

,,నిన్నొక్కసారి యాలింగన మొనర్చుకొనవలెనని ; నీ కపో లములఁ జుంబించవలెనని''

చారులోచనుఁడు విరుగఁబడి నవ్వుచు— ,,సుశీలుఁడిచ్చట లేడు గనుక సరిపోయినది. అతఁడిటనున్న నీ వేళ నెంత పరిహాసము చేసెడివాడో !''

,,ఇందు పరిహాసమున కేమున్నది ? నా మనస్సున కట్లనిపించి నది. ఆ కోర్కె నన్నుఁ బట్టి వల్లార్చుచున్నది. నీతనూ స్పర్శ నాకు ఉత్తేజనము కలిగించును. నేనేమి చేయుదును !''

,,మీ కోర్కె లోక విరుద్ధముగ నున్నది !''

,,అయిన నేమందువు ?''

,,ఇట్టి వాంఛ సాధారణముగ స్త్రీ పురుషుల మధ్య యేర్పడు చుండును. స్త్రీ యందు స్త్రీకి పురుషునియందు పురుషునికి నిట్టి వాంఛ పరిహాస భాజనముగ నుండును.''

,,అందులకే మే మనినది. తీవ్రమైన యుత్కంఠను నిగ్రహించు కొనుచు వచ్చుచున్నాను. సుశీలుఁడుండుటచే నెన్నఁడీ మాట నీతో ననలేదు. అందుచే నిప్పుడు నామనోభావమును నీకు వెల్లడించితిని. ఒకసారి యనుమతించుము.

,,మీ కోరిక చాల విచిత్రముగ నున్నది.''

,,సునీతివర్మ వాపోవుచు— ,,అయినచో నీ వంగీకరించవన్న మాట. నీ సమక్షమున దినము క్షణముగ వేగించుటకు నా మనస్సురకలు వెట్టును. నీ సౌందర్యము స్త్రీ జనోచితమై లోభనీయముగ నున్నది, నీవు స్త్రీ వైనచో నెంత బాగుండెడిది !" అనెను.

"స్త్రీ నైనచో నేమి చేసెదరు ?"

"నిన్ను వివాహమాడి నా జన్మను సార్థకమొనర్చుకొందును."

"నాపై మీకింత ప్రేమ యున్నదన్న మాట !"

"అదివేర సుడువవలయునా ! నిన్నాయరణ్యమున చూచిన క్షణ మున నే నా మనస్సు నీయందు లగ్నమైనది. నా హృదయపు లోతు లలో, నేదో యవ్యక్త భావము నీవు యువతివని చెప్పునట్లుండును నీ కన్నులు నీయపాంగ వీక్షణములు తనూ విన్యాసము పదచాలనము

శరీరాంచలములు ఫాలభాగము ఒకటని యేమి సర్వాంగములు స్త్రీ సంబంధులట్లనిపించును !"

చారులోచనుఁడు నవ్వుచు — "అయిన నన్నిఁక స్త్రీ యే యనుకొనరాదా ?" అనెను "అనుకొనుచునే యున్నాను. కాని నీ ఖడ్గ విద్యా పాటవము, అశ్వలంఘన చాతుర్యము ఆరితేరిన పోటుమానిసితనమును తలపింపజేయును. నీ గానము గాంధర్వమై నీ కంఠస్వరము మధుర పంచమ శ్రుతి మనోహరమై తారస్థాయి నందుకొనుచు స్త్రీ లక్షణములను తెలియఁజేయుచుండును. నా కంతయు నేమోయద్భుతముగ నున్నది !"

మీకు సర్వ విద్యలందును ప్రవేశముందన్నమాట. సంగీతమును గూర్చి మీరెంతగనో మాటాడుదురు."

"మాయమ్మగారు చంద్రావతీదేవి సంగీత సరస్వతి. మా యన్న గోవిందవర్మ యచ్చముగ తల్లిగారి సంగీతమును పుణికి పుచ్చుకొని జన్మించినాడు. ఆయన వీణ వాయించుచో నెంత సంగీత విద్వాంసుఁడైనను శిరమువంచి నమస్కరించవలసినదే. ఆయన చిత్ర లేఖనము నందు సైతము సిద్ధహస్తుఁడు."

"ఆయన స్త్రీ జనోచితమైన విద్యల నంతయభిమానించు నెందులకో ! యువరాజు గద ! ఇట్టి విద్యల నభ్యసించుచు కూర్చుండుటకు తీరికయుండునా ?"

"నాయనగారు యుద్ధవిద్యల నభ్యసించుమందురు. అన్నగారికి లలితకళల యందున్నంత ప్రీతి యుద్ధ విద్యలందు లేదు. ఆయనకు ధర్మ

ప్రవణత మా నాయనగారి నుండియు, సంగీత సాహిత్యములు అమ్మగారి నుండియు వారసత్వముగ సంక్రమించినవి."

"చాల విచిత్రమైన విషయము ! మరియు యువరాజులు యుద్ధ రంగమునకేగరా ?"

"ఎందుకేగరు ? మహారాజుగారి తృప్తికై యేగెదరు"

"మీరు పూర్తిగా మీ యన్నగారినుండి భిన్నమైన మనస్తత్వము గలవారు. మీరు యుద్ధప్రక్రియలయందు నిష్ణాతులు."

"నాకు లలితకళలనిన నభిమానమేగాని, వాని నభ్యసించు నభిలాషలేదు."

"నాకు మీ యన్నగారిని దర్శించవలెనని యున్నది."

"నీవు యువతియైనఁ గాకపోయితివి !"

"పోనిండు, ఆడవేషమున పోవచ్చును గద !"

"అది వేషమేయగును గద. నిజము బయటపడుచో ప్రాణములపై నాన వదలుకొనవలసినదే !"

"అట్టి యవసరములు కల్గుచో నా విద్యలన్నియుఁ బ్రకాశించును!"

"అది యంత సమంజసమైన విషయము కాదుగద !"

"ఊరక యట్లంటిని. నేను తొలుత వాస్తవముగ నాడపిల్లనే"

సునీతివర్మ కన్నులింతలుచేసుకొని— "నిజమా ! నీ వాడ పిల్లవా ! నేను మొదటి నుండియు ననుకొనుచునేయున్నాను." అనుచు నాశ్చర్యముగ్ధుఁడయ్యెను.

"కాని యిప్పుడు నేనట్లుకాదు !"

"మరల నదేమి ?"

"అది యంతే ?"

"పెండ్లి పేరంటములు చేసుకొనవా ?"

"నాకు యుక్తమని తోఁచి నా మనస్సునకు నచ్చిన వరుఁడు లభించుచో తప్పక వివాహమాడుదును."

"లేనిచో !"

"ఇట్లేయుండి పోయెదను."

"నాకిట్టి యదృష్టమున కర్హతకలదా ?"

చారులోచనుఁడతని పరిదీనవదనము నాలోకించి పులకించి— "అంతకు మించి యేయువతికేని పట్టఁదగిన యదృష్టమేముండగలదు ?" అనెను.

సునీతివర్మ పరమానందభరితగద్గద కంఠుఁడై— "అయినచో నీవు యువతివి కమ్మా." అనెను.

అది యంత సులువైన విషయము కాదు. ఒకవేళ కష్టపడి నన్నిట్లు చేసిన యోగి పుంగవు నర్థించి యథాస్థితిని పొందుదునే యను కొనుడు. అప్పుడీ సామాన్య యువతిని వివాహమాడుటకు మహారాజు లంగీకరింతురా ? నన్నుద్వాహమాడు నతఁడు నా యభిలషితము నను సరించి నడచుకొనవలసి యుండును."

నీ కిష్టమయిన విషయములు నా కనిష్టము లెట్లగును ? నీ యభిల షితము ననుసరించియే ప్రవర్తింతును."

"సంతోషము. మహారాజానేమి చేసెదరు ? చంద్రావతీదేవి గారంగీకరింతురని నమ్మకమున్నదా ?"

"అవి యన్నియు నేను చూచుకొందును. ప్రథమముగ నీవు యువతివి కావలె గద ! నీ మూలమున విఘ్నకుండిన వంశమున జయంత కంతు లుదయించగలరు !"

"మీరితః పూర్వము నన్నెచ్చటనైన జూచినారా ?"

"అట్లనుటలో నీ యభిప్రాయము ?"

"అరణ్యమునందు మనకు పరిచయ మేర్పడని నాటిమాట !"

సుప్రీతివర్మ చారులోచనుని కన్నులలోనికి నిశితముగ దృష్టి సారించి — "చూచితినవిపించినది. నాయనగారి నరమేధయజ్ఞమున నిశ్చయముగ నిట్టి కనులనే చూచితిని. కాని, యవి పల్లవరాజ దుహిత,

త్రిలోచన పల్లవి కన్నులు. ఆమెకును నీకును పోలికలు చాల కలిసినవి. ఆడరూపమున నీవచ్చముగ నామెయే యగుదు'' వనెను.

''బాగున్నది ఆ త్రిలోచనయే నీవన్నారు గాదు !'' పాపము మీకు త్రిలోచనపై మిక్కిలి మక్కువవలె నున్నది.''

''ఆమెనొకసారి చూచిన వారిక నామెను మఱచిపోలేరు. ఆమె కన్నులలో నేదో యాకర్షణ పట్టిలాగు చుండును.''

''మనస్సునందు త్రిలోచన పల్లవిని భావించుచు నామె సుదుర్లభ యగుటచే నా యందు ప్రేమను నిల్పుచున్నారా !''

''నీవెట్లయిన భావించుము. నీవు నాకు కావలెను.

''మేమీ నగరమునకు వచ్చి మూఁడు నెలలైనది. మేమెచ్చటికిని పోరాదు. మా విద్యకు ప్రకాశము లేదు. కాంచీపురమున విచ్చలవిడిగ స్వచ్ఛందముగ విహరించు మాకీ నిర్బంధమేమి ?''

''మీకుఁ గావలసిన వసతులన్నియుఁ గల్పించెదము. కోటలో మీ విద్యా ప్రదర్శనమునకు వలయు నేర్పాట్లు చేయించెదము మా వదిన సుదర్శనాదేవిగారు సాలంకాయనుల యాడపడుచు ఆమె కీ విద్యలయందు పరిమితానురాగము కలదు. నీ నీరత్వము రాజధాని యందంతటను మాఱ్ఱోగునట్లు చేయించెదము. మహారాజా నిన్నభినందించును. కాని నీవు నా కోర్కెను దీర్పవలయును.''

"తొలుత మీ వాగ్దానమును పూర్తి గావింపుడు. నా చేతిలోని విష యమునను సందేహమెందులకు ?"

"అటులే కానిమ్ము, నీ వాడిన మాటను తప్పరాదు సుమా !"

"అదుగో సుశీలుఁడు రానే వచ్చినాడు !"

"మంచిది. ఇఁక మీరిరువురు మాటాడుకొనుచుండుడు. నేను కోట లోనికి పోవలసియున్నది."

సునీతివర్మ అచ్చట నుండి వెడలిపోయెను.

త్రిలోచన నందిని నుద్దేశించి— నందికా ! ఇన్ని దినములుంటి వేమి ? మనలను గూర్చి మహారాజ్ఞి యభిప్రాయ మెట్లున్నది ?" అని ప్రశ్నించెను.

"రాకుమారీ ! సర్వము ఫలోన్ముఖముగ నున్నది. మొదట నన్ను కావలి వారడ్డి విలచిరి. నేను మీ నామమును పేర్కొనగా వారు నన్ను విడచిపుచ్చిరి. చంద్రావతిదేవి గారు నన్నెంతో సాదరముగ సంభావించినారు. యువరాజ్ఞి సుదర్శనాదేవిగా రచ్చటనే యున్నారు. ఆమె సూక్ష్మగ్రాహిణి. వారిరువు రక్కాచెల్లెండ్ర వలె నున్నారు ! అత్తాకోడండ్రనిపించరు ! మీ పేరు వినినంతనే మహారాజ్ఞి మురిసిపోయినారు. మీ లేఖను చదువుకొని వెంటనే మీ కాంధములకాహ్వానముఁ బెలియఁజేసినారు, యజ్ఞవీర నాయకు మిమ్ముఁ జూచినారఁట. ఏమేమో చెప్పినారు. ఆమెకు మీ యెడల సద్భావమున్నది. మాటల మధ్య సునీతి

వర్మగారికి మీపై ననురాగమున్నట్లు మాటాడినారు. మాధవవర్మ మహారాజునకుఁ గూడ మీ యెడల మిక్కిలి యభిమానమఁట ! అచ్చటి పరిస్థితులన్నియు విష్ణుకుండిన వంశము పల్లవరాజ దుహితను తనదానినిగ చేసికొనుట కభిలషించు చున్నట్లున్నది.''

"బాగు బాగు ! మన మార్గము సుగమమగు చున్నది. ఇఁక చూడుము. త్రిలోచన పల్లవి ప్రతిజ్ఞ నెరవేరినట్లే యనుకొనుము. అట్టిది మనమిచ్చటకు బయలుదేరిన నాఁడే సిద్ధించినది !

"సునీతీ ! చాల దినములైనది. ఈ మధ్య బొత్తిగ నా యొద్దకు వచ్చుటయే మానివేసితివి !

"ఏమియులేదు. రావలయు ననుకొనుచునే యున్నాను. ఆలస్యము జరుగుచు వచ్చుచున్నది. విష్ణుకుండిన నగరమునకు వెళ్ళవలసి వచ్చినది"

"ఎన్ని నగరముల కేగినను, ఏమిచేసినను నా యొద్దకు వచ్చుటకు జాగుచేసెడి వాఁడవుకావు. ఏదో బలీయమైన కారణముండి యుండ వలెను. నాకుఁ జెప్పదగినదైనచో వినవలతును."

అన్నగారట్లనిన నేనేమనగలను ? నాకు మీతో చెప్పరాని కార ణము లుండునా ?"

"అయినచో చెప్పుము. నీవు రాజధాని యందే యుంటివా ? మీ వదినగారు కూడ చాల తడవులుగ నిన్ను గూర్చి యడిగినారు. ఆమెకు నీపై నీవు పసిమరదివని వాత్సల్యము !

"అదృష్టవంతుఁడను వదినగారు నన్ను చిన్న తమ్మునివలె మన్నింతురు. కొన్ని నెలల క్రిందటి విషయము. నేనప్పుడు వేటకు బోయితిని. అరణ్యములో నా కిరువురు యువవీరులతో పరచయ మేర్పడి నది. వారిరువురు గొప్ప ఖడ్గ విద్యావేత్తలు. వారి యందొకని పేరు

చారులోచనుఁడు. ఆతఁడుద్దండుడు. నేను దినమంతయు శ్రమపడి వెంటాడుచున్న వరాహము నాతఁడు కత్తిఁవేటున గూల్చినాడు. అతడు చాలసాహసి. రెండవయాతఁడు సైతమతనికిఁదీసి పోవువాఁడు గాఁడు. వారిరువురును కాంచీపురము నుండి వచ్చుచుండిరఁట. మన రాజధానికి వచ్చుచు మార్గమున నన్ను గలసికొనుట తటస్థించినది. వారలు నా యాశ్రయము నర్థించిరి. నేను వారిని నా వెంటఁ దీసికొని వచ్చితిని. నేనును వారును గలసి ఖడ్గ విద్యయందు క్రొత్త మెలకువలు, ఒడుపులు నభ్యసించుచున్నాము. వారినట్లు కొనితెచ్చి నా యొద్ద నిలుపుటలోని ప్రయోజనమేమున్నది ! వారి విద్యా పాటవము పదిమందికిఁ దెలిసి నప్పుడు కద, విద్య నేర్చినందుకు సాఫల్యము ? తమ విద్యా ప్రదర్శ నము నేర్పాటు చేయించుఁడని యర్థించుచున్నారు. నే నిన్నినెలలుగ నుపేక్షసేయుచు వచ్చుచున్నాను. ఎప్పటికప్పుడే మీకీ విషయమును తెలియఁజేయుదమని........

"దీనికింత యాలోచన కావలెనా ? నా దగ్గఱ నీ కభిమాన మెందులకు ? అవశ్యమట్లే చేయుదము. ప్రథమముగ మన కోటలోనే వినోదముగ వారి ప్రదర్శనము నేర్పాటు చేయింప వచ్చును."

"ధన్యుఁడను. ఇన్నినాళ్ళును అన్నగారేమందురో యని మన సుతో గుడుసుళ్ళు పడుచున్నాను. నేటికి నా మనస్సున కూరట కల్గినది."

"అదేమి సునీతీ ! ఇంత చిన్న విషయమున కింతటి ప్రాము ఖ్యము నిచ్చి మనస్సునందు బాధఁజెందుటెందులకు ? నీ వింతకుఁ బూర్వమే చెప్పియుండిన వారిరువురి నీ నరికి మన సైన్యమున నగ్ర స్థానమున నిల్పి యుండెడి వారము".

"నేనెదో బాధ్యతా రహితముగ జీవితమును క్రీడగ గడుపుటయే కాని యిట్టి ప్రముఖమైన వ్యవహారముల మున్నెన్నఁడు పట్టించుకొనలేదు కద ! అందువలననేనై స్వతంత్రించి యిట్టి పనులు చేయవచ్చునో రాదో యను శంక: నాయనగారే మందురో యను భయము. అన్నియుఁ జేరి నా మనస్సునకుఁ దెలుపి లేకుండఁ జేసినవి."

"సునీతి ! ఎంత పొరబడితివి ! నీవేమి తప్పుచేసినావని ! ఇందు నాయనగారనుట కేమున్నది ? మీదు మిక్కిలి నీ వింతటివాడవైతివని సంతోషించెడినారు.

"అన్నా ! నా కిప్పుడు చాల ధైర్యముగ నున్నది. ప్రదర్శనము నెప్పుడేర్పాటు గావింతము ?"

"ఈవేళ జ్యేష్ట శుద్ధ పాడ్యమి పూర్ణిమనాఁడు సుదర్శన జన్మ దినము. ఆనాడైనచో సముచితముగ నుండునని నా యభిప్రాయము"

"అవునదియే సముచితమైన సమయము"

సునీతివర్మ అన్నగారి సెలవు తీసికొని వెడలిపోయెను.

చారులోచనని కిష్టమైన పనులు చేసిన నాతఁడు సంతసించును. తరువాత నాతఁడిక తన మాట నిలబెట్టుకొనవలెగద ! అప్పుడిఁక తన్ను మించిన యదృష్టవంతుఁడుండడు. ఆమె యభౌమమయిన గాన మాధురికి తాను తనిసిపోవును. చాంద్రీ సుకుమార, స్నిగ్ధమైన యామె వపుఃకాంతులలో తాను స్నానమాడును తానిఁక చారులోచనా దివ్య దీర్ఘాపాంగ వీక్షణములలో కరగిపోవును. అతఁడేమనునో చూడవలసి

యున్నది. సునీతివర్మ చారులోచనా మధురమధుర ప్రణయలీలా విలాసముల నూహించుకొనుచు నొక విధమైన తృప్తిఁజెందు చుండెను,

ఖడ్గవిద్యా ప్రదర్శనము నేర్పాటు గావించినందులకు చారులోచనుఁ డెంతగనో యానందించెను. "ఎటులైనను సునీతివర్మ యాడిన మాటను నిలబెట్టుకొనినా" రనెను.

"అయినచో నేమైనట్లు? నీవాగ్దానమును పాలించవలెగద!"

"వాగ్దాన పాలనము నా జీవితమునకు ప్రధాన లక్షణము! తప్పక పాలింతును. అంతకుమించి నాకుఁగావలసిన దేమున్నది?"

"ధన్యుఁడను. ఇఁక ప్రదర్శనమునకు పదమూఁడు దినములే వ్యవధి యున్నది. చాలుననుకొందును."

"ఈ క్షణమున ప్రదర్శనము జరుగవలసి యున్నను మేము సంసిద్ధులమే. మాకావిద్య యంతగ సిద్ధించినది. నా జీవితము కత్తిమీఁది సాము వంటిది అందుచే నేనా విద్యా విషయమున సర్వదా జాగరూకుఁడనై యుందును. ఖడ్గవిద్య నాకుచ్ఛ్వాస ప్రాయము. మీకెట్టి యాశాభంగమును కలుగనీయను. మీరు మిక్కిలి మీ వారెల్లఁ బ్రశంసించు రీతిగఁ బ్రవర్తింతును."

"నీ వంతటివాఁడ వగుదువు. నీశక్తి సామర్థ్యములపై నా కమేయమైన విశ్వాసమున్నది. మాయన్న గోవింద వర్మగారు శాస్త్ర విషయమున క్షుణ్ణముగఁ దెలిసినవారు. నీవాయనను నీ విద్యా ప్రాగల్భ్యముచే మెప్పించ వలయును. ఆయన ప్రశంసల నందుకొన గల్గుచో మన తొట్టె విరిగి నేతిలో బడినట్లే!"

"మీరే చూడగలరు కద ! మీకుఁ దెలియని దేమున్నది ? యువ రాజు మనస్సు నరికట్టి మరీ మాటాడెదను !"

"నీవంతటివాడవే ! నాకుఁదెలియును. కాని ముందు జాగ్రతకై యట్లనినాను. మాయమ్మ చంద్రావతీదేవిగారు, నాయనగారు, మా పిన తల్లులు సుభద్రా మలయవతీదేవులు, అన్నగార్లు ఇంద్రవర్మ దేవవర్మలు వదినగార్లు సుగంధి మోహినీ దేవులు, ఒకరనియేమి రాజకుటుంబ మం తయు నానాఁడు సమావేశమగును. యువరాజ్ఞి జన్మదినము మహావైభవ ముగ జరుగును. సుదర్శనా దేవిగారనిన నందఱకుఁ దలలోని నాల్కయనుకొనుము. ఆమె సౌశీల్యము, మతి విభవము నందఱ మనస్సుల నాకర్షించుకొన్నవి. ఆమెకృతముగ నేమిజరిగినను అందరు నొక్కచోఁ జేరుదురు."

"సుదర్శనాదేవి దూరాలోచనా పరురాలువలె నున్నారు. చాలా ప్రాజ్ఞురాలై యుండవలయును ! తాను యువరాజ్ఞియై యందఱి మానస ముల నలరింపఁజేయుచున్నదనిన నామె దూరదర్శితయు సూక్ష్మవిషయ పరిశీలనా వివేచనయు సాటిలేవి వనవలసి యున్నది !"

"నిజమే ! ఆమె చాల చిత్రమైన వ్యక్తి, వ్యక్తులను చూచుచునే వారి మనస్సు లోతులందలి యూహలను చదివివేయఁ గలదు !"

"ఆమె బుద్ధినైశిత్య మమోఘ మనవలెను. తాను భవిష్యన్మహా రాజ్ఞి యగును. ఆ విషయము దృష్టియందుంచుకొని నేటినుండియే పరి వారము నంతను చమత్కారముగ నాకట్టు కొనుచున్నది"

"అట్టిదేమియు లేదు. ఆమె సహజముగ సౌమ్యురాలు. నీ వన్నిం టికిని విపరీత వ్యాఖ్యానములు చేయుదువు."

"పోనిండు. కుటుంబము నందలి పరిస్థితుల ననుసరించి మాటాడి తివి. కానిమ్మటులనే యనుకొందము. నీ తెలివి వదినగారి తెలివిని మించినది!"

"రాకుమారా! భవిష్యన్మహా రాజ్ఞియగు సుదర్శనాదేవిగారికిని నాబోటి సామాన్య యువకునికిని సామ్యముం జెప్పరాదు."

"నీవు నిజముగ నట్టియగుచో తప్పే యగును. కాని విష్ణు కుండిన రాజపుత్రుండు సునీతి వర్మకు కులపాలిక కాంబోపు యువతితో పోల్చుటలో తప్పు లేదుకద!"

చారులోచనుండు కిలకిల నవ్వి— "అయిన నిక మీ పట్టుదలను వీడరన్నమాట! ఒకవేళ తిరిగి నేను యువతిగ మారినను మీతో వివా హము సానుకూలమగునా!" యనెను.

"సందేహము వలదు. తప్పక మన వివాహము జరిగి తీరును."

"సంతోషము! వ్యవధి చాల యున్నదికద! ముందీ విద్యా ప్రదర్శనము జరుగనిండు. రాజ పరివారము నందు మా పేరు ప్రతిష్ఠలు పెరుగవలెను. అందఱకు మాపై సదభిప్రాయ మేర్పడవలెను."

"అటులే, నీ కొఱ కెంతకాలమైన వేచియుండగలను. వేచియుం డుటలోగూడ నొక యానందము తృప్తియు నున్నవి."

''యధార్థము వాకొంటిరి. నిరీక్షణలో నున్న యానందము అనుభవములో నేమున్నది ?

''మన యిరువురి మనస్సు లొకటియగుచో నిఁక లేనిదేమున్నది.'

'నేను చాల యదృష్టవంతురాల నగుదును. మీ వంటి నిర్మలాంతఃకరణముగల వ్యక్తి భర్తగ లభించుటకన్న నేకన్యకకైన నభిలషించఁదగినది వేరేమి యుండును !''

సునీతివర్మ చారులోచనుని మాటలకు పొంగిపోయి — 'చూచితివా ! నీ వెంత మగవాడ వైనను, అది కృతక మగుటచే నిసర్గమైన స్త్రీలక్షణమే నీయందు దీపించును.' అనెను.

'స్వభావో దురతిక్రమః !' నాకుఁదగిన భర్త లభించి నప్పుడు నేనేల మగవాడుగ నుండవలె ! అంగనా సహజమగు కోర్కెలు నా నుండి పైదొలఁగినవా ?'

'కృతార్థుఁడను ! నేనిఁక పోయివచ్చెదను.'

'అటులనే'.

సునీతివర్మ వెడలిపోయెను. త్రిలోచన యొంటిగ నుండెను.

'సుశీలుఁడెచ్చటి కేగెనో ! ఇంకనురాలేదు. సునీతివర్మ ప్రేమమయ హృదయ సౌకుమార్యమునకు పల్లవి లోలోన మురిసి పోవు చుండెను. ఏమి రాకుమారుఁడు ! పరమ సుగుణ మూర్తి ! అయనకు

తాను రాజకుమారుఁడనను గర్వ మావంతయు లేదు. కేవలము స్నేహ మును బురస్కరించుకొని తమ్మిరుపుర నెంతగ గౌరవించు చున్నాఁడు! తమకొరకు నెన్ని ప్రయత్నములు చేయుచున్నాడు! ఆయన మనస్సు మార్ధ్యమును వీడలేదు. కానిచో తనపై నట్టి విపరీతపు కామన యేమి! తా నగుటచే సరిపోయినది! వేఱొకఁడైన తనకోర్కె యేమయ్యెడిది!'

'వాస్తవమునకు మోహమెంత చెడ్డది! తనపైఁగల గ్రుడ్డివ్యామోహముచే సునీతివర్మ తనగీచిన గీటు దాటకుండ నడచుకొనుచున్నాఁడు. రాచనగరులో తనకట్లు సాగదు, అచ్చట మొగలిముల్లుల వోని దృక్ప్రసారములతో నఖశిఖాపర్యంతము నిశితనిశితముగఁ బరిశీలింతురు వారి పరీక్షలకు పట్టువడరాదు. ఖడ్గవిద్యను వెలయించి వారల రంజిల్లఁజేయు టొకయెత్తు. వారలకుఁ దాను యువతియను ననుమాన లేశముకూడ కల్గుటకు తావియకుండ మసలుకొను టొకయెత్తు!'

'సుదర్శన యసామాన్యురాలివలె నున్నది! నందిక సైతమటులేయున్నది. ఆమెనొక కంట కనిపెట్టుచు సంచరించవలెను. సునీతివర్మ సోదరుఁలెట్టివారో! వారిభార్యలు తల్లులు నందఱు తన కపరిచితులే. తనకు మహారాజ్ఞి నుండి యాహ్వానము వెళ్ళినది. కాంచీపురమునుండి యావార్త తనకు చారులు మోసికొనివత్తురు తన యన్న గారాశ్చర్యముఁ జెందును. తన చెల్లెలి కార్యకౌశలమునకు మిక్కిలి సంతసించును, తన వంచనా నాటకము నందు ప్రథమాంక మారంభమగుచున్నది. ఆ పై భగవతి యిచ్ఛ!

త్రిలోచన కాలోచనా పరంపరలతో దినములు దొర్లిపోవుచున్నవి సునీతివర్మ యనుదినము తన యొద్దకువచ్చి తాను తీసికొనవలసిన జాగ్ర

తలను గూర్చి హెచ్చరిక చేయుచుండును. కవచము లిట్లుండవలెను, ఈ ఖడ్గములు మిపుల బలిష్ఠము లైనవి ఈ శిరస్త్రాణమును నీకై ప్రత్యేకముగ చేయించితిని. ఇట్టివే విశేషములను తెలియఁ జేయు చుండును. తన యవసరముల నాయన శ్రద్ధగ గుర్తించును. ఆయన అనురాగ స్రవంతి వెల్లువయందు తాను స్నానమాడు చున్నది. దినదిన మున కాయనపై తనకేదో మమతార మేర్పడు చున్నది. అదెట్లు పరిణ మించునో! కర్తవ్య నిష్ఠురాలైన తానిట్లు మెత్తని చిత్త వృత్తిని పోషించుకొనరాదు! మనస్సు నదుపులో నుంచుకొనుటకై ధ్యానమగ్నురాలగును. నందికతో ఖడ్గ విద్యా రహస్యములఁ గూర్చి చర్చించు చుండును.

ఆ దినము రేపను రోజు వచ్చినది. నాదు జ్యేష్ఠ శుద్ధ చతుర్దశి. వెన్నెలను కృష్ణవేణీ తరంగములపై నాట్యమాడుచు క్రొత్తగ సానబట్టిన కత్తివాదలను పరిహసించు నట్లున్నవి!

చూచుచుండగ నింతలో నాకసమంతయు మేఘావృత మయినది నుఱుములు, మెఱుపులు విజృంభించినవి. క్షణములో సాంద్రమైన వెన్నెలలు మరుక్షణమున నంధకారమున విద్యుద్విలసనములు! ఈ విద్యుత్ప్రభలు క్షణికములయ్యు వెలిగిపోవును. అతి పవిత్రమైనవి! లోక మంతటికి చక్షుః ప్రీతికరములుగ నుండును. సృష్టిలో కొన్నిటి యునికి యట్లేయుండును. అవి స్వార్థరహితములు. పరుల సుఖమునకై తమ్ము తాము వ్యయమొనర్చుకొనును. మానవులు మాత్రమే స్వార్థమునకై యితరుల వినాశమొనర్చుటకు నైతము వెనుదీయరు. తాను - నిర్వహించ బోవు కార్యమట్టిదియే కద!

తన పితామహుని యాత్మశాంతి లక్ష్యముగ నొక రాజవంశమునే నిర్మూలించ దలచు టవిన నట్టిదే కద : ఛీ: ఈ మనుష్య జన్మ మెంత స్వార్థాశ్రయ మైనది : తానెట్లును తన జీవితమును నరమేధమున కంకితము చేసికొన్నది. మాధవవర్మ మహారాజొనర్చిన నరమేధమేమి నరమేధము ! ఈ నరమేధమున బలిపశువు లసంఖ్యాకములుగ నుందురు. మహాభారత సంగ్రామమున నశ్వత్థామ యొనర్చిన నరమేధము వంటిది తాను చేయవలెను. గర్భస్థ శిశువుల రూపు మాపవలయును. సునీతివర్మ యనిన దేమి ? తన్ను పెండ్లాడిన విష్ణుకుండిన వంశమున కంతు జయంతులు ప్రభవింతు రనినాఁడు. పాప మాతని కేమి తెలియును; తాను వట్టి శలాటువని : ఈ నరక క్షేత్ర తుల్య యని :

ఆ సునీతివర్మను తలఁచుకొనిన జాలి యొదవుచున్నది. నందిక తన స్నేహమునకై యిల్లువాకిలి వీడి తనవెంట వచ్చినది : తాను తనకై యామెను స్వజనదూరురాలినిగావించినది. నందిక తనను ప్రాణాధికముగఁ బ్రేమించును తానువినా లోకములేనిది ! ఆమె నెటులైన కాంచీపురమునకు బంపిన బాగుండును. తనయన్నగారు కుమారవిష్ణువు తన్నింతకాలమెన్నఁడును వదలియుండిన వాఁడుకాఁడు. తనయెడబాటాతనికి దుస్సహముగ నుండియుండును తన కాతని జూఁడవలయునను కోర్కె ప్రబలముగ నున్నది. మరుసటి దినము గడచినచో ప్రథమగండము తప్పినట్లే :

త్రిలోచన పల్లవి యాలోచనల కవధి లేకుండెను. యువరాజు గోవిందవర్మ స్వభావమెట్టిదో : తనపదకమున నాత నిముడ్చుకొన్నచో కార్యము కొంత సానుకూలము గావచ్చును.

సుదర్శన సాలంకాయనుల యాడపడుచు. ఆమెనుకూడ చేర దీయవలెను. వాఅందరును మరువాడు తాను చూడబోవు చున్నది. జ్యేష్ఠ మాసపు టర్ధరాత్రివైన చల్లగాలులు వెన్నెలలు, నదీ నీరములు, సైకత స్థలులు సర్వము మనోహరములుగ నుండెను. ప్రకృతి సౌందర్యము నెంత యనుభవించినను తనివితీరుట లేదు. తెల్లవారిన పరీక్షాదినము !

నందికకు త్రిలోచనపల్లవి యెచ్చటికేగినట్లో తెలియుట లేదు. ఆమె యుద్యానవనమునఁ జూచినది. పల్లవి జాడలేదు. అనవసర మని పించినను సునీతివర్మ మందిరారామ భూమి యందంతటను వెదకినది. ఫలితము శూన్యము. నందికను భయమొదవినది. తన్నంత మొద్దు నిద్దుర యేల యావేశించవలె ! తన రాకుమారి కెట్టి యాపదయు సంభ వించ లేదు కద ! శత్రుకూటమున నడుగుమోపి సింహపు సటలతో నాడుకొను సాహసురాలైన యామె కాపదరాకూడదు కద ! ఆమె మరి యెచ్చటి కేగి నట్లు ? కృష్ణాతరంగిణి కేమైన వెళ్ళియుండు నేమో !

ఆంధ్రములకు వచ్చినదాది యామె కృష్ణా శైవలినీ ప్రియురాలై పోయినది. కాంచీపురమునందు సైతమామె వెన్నెలరేల నుద్యానముల క్రీడాసరస్సుల చెంగట నిద్రారహితముగ కాలము గడపెడిది. నందిక నదీతీరమునకుఁ బోయి చూచెను. ఆమెకు సంతోషము రూపుగొన్నట్లు జ్యోత్స్నాపులకిత నిబిడ నిశీధి నచ్చరవోలె త్రిలోచన నదీతీరముల పాదములుంచి దీర్ఘాలోచనా తత్పరమతియై కనిపించెను.

నందిక చర చరపోయి వెనుకనుండి త్రిలోచన కన్నులను మూసెను త్రిలోచన యుల్కిపడి తేరుకుని — "నందికా ! నీ వింకను నిద్రపోలేదా ?" అనెను.

"మీరు కన్పించక పోవుటచే నేను కళవళ పడుచున్నాను. మాయ నిద్దుర నన్నెట్లావేశించినదో : కను తెఱచునంతకు మీరు కన్పించలేదు. తోటయంతయు వెదకి వచ్చితిని."

"మంచిపని చేసితివి. సునీతివర్మగారి మందిరోద్యానమున సైతము వెదకితివా !"

"మీరు చక్కగ నూహ చేసినారు. నేను నిజముగ నాయన యుద్యానమున కేగితిని !"

"ఎంత పిచ్చిపని చేసితివి ! నీవు త్రిలోచన నర్థము చేసికొననే లేదు. పోనిమ్ము. నేనేమైపోయెదనని యెంచి యీ యన్వేషణము నారంభించితిని ? విన్నిచ్చట విడచి కాంచీపురమున కరిగితి నను కొంటివా ?"

"అదికాదు; మనము శత్రుస్థావరమునందున్నాము కద !"

త్రిలోచన పక పక నగి— "బాగున్నదే నీ భయము ! పల్లవ రాజ తనయ శత్రువులకు భయపడునా ? స్వప్నమేమైనా గాంచితివా ? అదిగాక యిప్పుడిచట మనకు శత్రువులెవరు ? సునీతివర్మగారిని శత్రు వనుకొన వచ్చునా ? మనయంతఃకరణములే మనకు శత్రువు"లనెను.

"రాకుమారీ ! మీరేదో మాటాడెదరు. తాతగారు మీకు దుఃఖ కరమైన కార్యమును కల్పించినారు."

"ఆయన కల్పించుటేమి ? నీ పిచ్చిగాని సర్వము భగవన్నిర్ణ యము ననుసరించి సాగుచుండును. మనమూరక హేతువులు కల్పించు కొందుము. మన మెవ్వరము ? ఏదో యదృశ్యమైన యొక తేజస్సుచే ప్రభావితులమై మనమేదో చేసినట్లనుకొనుచుందుము."

"మీరు వేదాంతము మాటాడుచున్నారు."

"నీ కర్థము కాదులే, పోనిమ్ము. రేపు నాతో ఖడ్గ యుద్ధ మొనర్తువా ?"

'మీతో చేయఁగల్పునంతటి విద్యాప్రాగల్భ్యము నాయందున్నదా?'

"అది నేను చూచుకొందును నీ వూరక నా ప్రహారముల నాడ్డు కొను చుండిన చాలును."

"చిత్తము. రాకుమారులలో నెవరైన సిద్ధపడెదరేమో !"

"అంతటి ధీరులిచ్చట లేరు లెమ్ము."

"సునీతివర్మగారున్నారు కద !"

"ఆయన తలపడరు. మనము సామాన్యులము. మనలనెదుర్కొ నుట వారి రాచఠీవికి భంగము !"

"మీరు సామాన్యులా ? అయిన నదివారికెట్లు తెలియును ? పొద్దుపోయినది. మనమిక మన సౌధమున కేగుదుము."

"అటులనే పద పోవుదము."

ఇరువురును లేచి యారామమార్గ సోపానములఁగడచి తమ మందిరమున కేగిరి.

యువరాజు గోవిందవర్మ సౌధము నామకొని యొక విశాలమైన యారామమున్నది అచ్చట ఖడ్గ విద్యాప్రదర్శనమున కనువుగ రంగస్థల నిర్మాణము జరిగినది రంగస్థలమున కెదురుగ మహారాజు, గోవిందవర్మ, ఇంద్రవర్మ దేవవర్మలు, దక్షిణ పార్శ్వమున మహారాజ్ఞి చంద్రావతీదేవి, మలయవతీ సుభద్రా దేవులు, సుదర్శనా సుగంధి మోహినులు, వామపార్శ్వమున రాజబంధువులు సరివార నుపవిష్టులైరి.

చారులోచనుఁడును, సుశీలుఁడును కవచ శిరస్త్రాణముల ధరించి యుద్ధమున కనువైన దుస్తులతో రంగస్థలమునఁ బ్రవేశించి సభా నమస్కార మొనర్చిరి. తదుపరి స్నేహ సూచకమైన ఖడ్గప్రహారములఁ గావించిరి. అటుపై ప్రదర్శనారంభమయినది. చారులోచనుఁడు తన ఖడ్గమును చిత్ర చిత్ర గతుల ఘుళిపించుచు నహితుండి కుఁడు కోదెత్రాచు నాడెంచు నట్లాడించుచుండెను. అతఁడొంటనుండి ఖడ్గమును దూయుటచ్చముగ వల్మీకము నుండి నాగుబాము బుసకొట్టుచు పైకి లేచుచున్నట్లుండెను. అతఁడు నటరకములైన కరవాలములఁ గొనివచ్చెను వలచగ నుండి గాలిలో నాట్యముఁ జేయుచున్నట్లుండెడివి. పట్టాకత్తులు, చంద్రహాసములు, చురికలు మొదలైన వాని నన్నిఁటి నుపయోగించి వానివానిఁ బ్రయోగించుట యందాతనికిఁ గల యభివేశ ప్రాచుర్యమును వెలార్చెను. చారులోచనుఁడు ప్రహార మొన

ర్పుట, సుశీలుఁడు పట్టుకొనుటలుగ ప్రదర్శనము సాగెను. అంతలో చారులోచనుఁడొక విచిత్ర చంక్రమణ మొనర్చెను. అతఁడు తన ఖడ్గము నెట్లు పరిభ్రమింపజేసెనో తెలియుటలేదు. కాని యాపరివేష ణానే కనిపించలేదు, ఖడ్గమే కనిపించలేదు. ఏదో సుడిగాలి పరిఢవిల్లి నట్లుండెను. ఆయదనున నెందఱాతని నెదుర్కొనిను తుత్తునియలు కావలసినదే ! రెండు చేతులందును ఖడ్గములఁబూని అతఁడు సుశీలుని చేతి యందలి ఖడ్గమును పది గజముల దూరమున కెగురగొట్టెను.

చారులోచనుఁడంతట రాజపరివారమునందు ఖడ్గ విద్యా నిపుణులైన యోధవరులతో మోహరించెను. వారందఱిలో శివనాగుఁ డారితేరిన జోదు. సాధారణముగ రాజాస్థానమున కెవ్వరేని యోధులు విద్యా ప్రదర్శన నిమిత్తమేతెంచిన ముందువారీ శివనాగుని పరీక్షకాగి నిల్వవలెను.

శివనాగుఁడంతఃపుర రక్షకుఁడు. సుదర్శనాదేవి యంతిపురము నందలి పరిచారకులందఱపై నధికారి. ఖడ్గవిద్యా చతురుఁడు. అతఁడు సైతము చారులోచనుని ఖడ్గాఘాతములను నిలువరించుకొనజాల కుండెను. అతఁడుపయోగించు నాయుధములు' ప్రయోగించు పద్ధతులన్నియు నూత్ననూత్నములుగ తోచుచుండెను. అతని యొడుపుల నెదుర్కొనఁ జాలిన ప్రతి యొడుపులు శివనాగుని యొద్ద కానరాకుండెను. చారులోచనుఁడు బఱిమీఁది త్రాచుపామువలె మెలికలు తిరుగుచు శివనాగునకు కాలునిలువ ద్రొక్కుకొనుటకు వీలులేకుండఁజేసెను. శివనాగుఁడు దిగ్భ్రాంతుఁడై యా విద్యయందనభిజ్ఞుని వలె నిలచిపోయెను. నిలచి పోయిన యాతని చుట్టును చారులోచనుఁడు సహస్రాధికములైన ఖడ్గములు వలయములై క్రమ్మినటుల వేయుంచుల సుదర్శనాయుధమును

దలపించుచు పరివేషమును సృజించెను. చూపరులెల్లరకు శివనాగుఁడు తెగిపోయె ననిపించెను. చారులోచనుఁడు శివనాగుని కోలగగ్గెరగ రంగస్థలముపైఁ బడవైచెను. అతఁడు లజ్జితుఁడై లేచి నిలబడెను. మిగిలిన వారి సంగతి లెక్కలోనికే రాలేదు.

చారులోచనుని ఖడ్గవిద్యా చాతుర్యమెల్లరకు నాశ్చర్య హేతువయ్యెను.

మాధవవర్మ మహారాజా యువవీరుని యద్భుత ప్రక్రియలకు వెఱగంది అట్టి వీరులున్న రాజ్యమునకు లేనిదేమున్నదను కొనెను. తనకును కుమారులున్నారు. నలుగురు నాలుగు రకములు. ఈ మహావీరుని కత్తి యుద్ధము నందలి కొన్ని మెలకువలు తెలిసినను గోవిందవర్మ యువరాజ పదవిని సక్రమముగ నిర్వహింపగలఁడని ధైర్యముండెడిది. శాస్త్రవిషయమున సమర్థుఁడే. అయిన నేమి ప్రయోజనము ! ప్రయోగ దక్షతలేమి యేమియు రానట్లే యుండును యువరాజును గూర్చి మొదటి నుండియు తనకదియే మనశ్శల్యము. ఇంద్రవర్మ దేవవర్మలు వట్టి భోగ పరాయణులు. రాజ్యవిషయములకును వారికిని నెట్టి సంబంధములేదు. వారికి కాంతాకాంచనములు దక్క వేరేమియు నక్కరలేదు. ఇఁక సునీతి వర్మ యున్నాఁడు అతఁడు కొంత సమర్థుఁడే గాని నిలుకడలేనివాఁడు. ఈ వీరుల సాంగత్యముచే నొరపిడి పొందిన రాణించునేమో . ఈ యువకులను తన నగరమున నిలుపుకొనవలెను.

చంద్రావతీదేవికి చారులోచనుని చూడగనే యాతని నెక్కడనో చూచి నట్లనిపించినది. నరమేధమునకు వచ్చిన పల్లవ రాజకుమారుఁడు కుమార విష్ణువునకు నీతనికేమైన దగ్గఱ సంబంధమున్నదా ! కుఱవాఁడు

పరమ సౌందర్యవంతుఁడు. ఇంత స్వల్ప వయస్సుననే యింత గడి తేరినాఁడు. విద్యాభ్యాస తీవ్రత యెట్టిదో! మా సునీతి సైతమిట్లు తయారగుచో నెంత బాగుండును! గోవిందుఁడెట్లును యుద్ధ విద్యా విముఖుఁడు. సునీతియైన నీ విద్యలందారితేరుచో వారిరువురు సూర్య చంద్రులై రాజ్యపాలనమును తీర్చిదిద్దగలరు.

మలయవతీ సుభద్రలు తమ కుమారుల తలఁచుకొని వారు చారులోచనునుగామి మిగుల వగచిరి. సుగంధి మోహినులు చారులోచనుని సౌందర్యమును యెడద లోతులలో ప్రశంసించిరి. సుదర్శన చారులోచనుని సుశీలుని చూచినప్పటినుండియు నిశితదృష్టిగ వారలఁ బరిశీలింపఁ దొడఁగెను. ఆమె వారి కదలికల, తనూ విన్యాసముల, అవయవ చాలనముల, నేత్ర నిమీలనోన్మీలనముల, నిలచు వైఖరుల, లంఘనముల ప్రత్యేకమైన శ్రద్ధతో గమనించుచుండెను. ఆమె కేదో భావము తీలగ తోచి చిఱుహాసరేఖ యొకఁడామె యధరమునందగించినది.

యుద్ధ మొనర్చుచునే చారులోచనుడామె భావమును చదివివైచెను. ప్రదర్శనము జరుగుచున్నంతసేపును నీ ప్రహారము నిట్లొడ్డుకొనినచో బాగుండును, ఈ ప్రయోగము నిట్లు చేయవలయును. ఈ చంక్రమణ మీ వైపునుండి జరుగవలెను ఈ ప్రత్యేక ప్రక్రియకు చురిక నుపయోగించవలయును, ఆ దెబ్బ నెదుర్కొనుటకు చంద్రహాసము కావలెను. అశ్వఖండనమునకు పట్టాకత్తియే పనికి వచ్చును అనుచు గోవిందవర్మ సునీతివర్మకు చెప్పుచునే యుండెను. అట్లు చెప్పుచున్నంతసేపు నొకా నొక తృప్తి ఒకానొక యహంకారము నాయన నేత్రములయందు వెల్లి విరియుచుండెను. తాను యువరాజునను గర్వమాయనకున్నదనుటకు వీలులేదు. కాని తనకు విద్యా ప్రావీణ్యమున్నదను గర్వరేఖ మాత్రము

కొట్టవచ్చినట్లాయన కన్నులందు స్పష్టముగ కానవగుచుండెను. ప్రదర్శ నము జరుగుచునే యుండెను. ప్రేక్షకుల ముఖకవళికల ననుసరించి చారులోచనుఁడు వారెల్లర మనోభావముల నవగత మొనర్చుకొనుచునే యుండెను.

సునీతివర్మ రాజపరివారము నంతను కలయఁజూచును. వారెల్ల రును తనచే గొనిరాబడిన వీరుల నెట్లభినందించు చున్నారో చూచి యానం దించెను చారులోచనుఁడీనాఁడు ఖడ్గ విద్యా ప్రదర్శనము నమోఘముగ వెలయించుచున్నాఁడు, తనకుఁదెలియని తనకీవర కెన్నడును చూపించని కొన్ని ప్రక్రియల నాతఁడు చేసి చూపించెను. సులోచనుని కింక నెన్ని మెలకువలు తెలియునో! అతఁడు మిక్కిలి గడుసువాఁడనుకొనును. చారులోచనుఁడు సునీతివర్మ ముఖమై ఖరులఁ దిలకించి తృప్తిఁ జెందెను.

రూపొందిన బ్రహ్మతేజమువలె తన కెట్టయెదుట మహారాజునకు కొలదిదూరమున నుత్తమాసనమునం దుపవిష్టుఁడై తన దెసకు తదేక దృష్టిగఁ జూచుచున్న పినాకభట్టారకుని కన్నులలో నాతని యాత్మ ప్రతి బింబించు చుండెను. ఆయన మేధా విభవము, పరిశీలనా నైశిత్యము తన్ను పట్టియిచ్చునేమో యనునంత యనుమానస్పదముగనున్నది.

ప్రదర్శన మైదారు ఘడియలు జరిగినది. రాజపరివారము నందె ల్లరును మిక్కిలి యానందించిరి. మహారాజా యువవీరుల కమూల్యమైన కానుకల నొసఁగెను. ఇరువురను తమ యాస్థానమున నిలిచిపొండనెను.

ప్రదర్శనము ముగిసినది. చారులోచన సుశీలురు తమతమ నెల వుల కేగిరి.

నాఁటిరాత్రి గోవిందవర్మ సౌధమున నెవరి ముఖమున నాలకించి నను నాయువ వీరుల ప్రసంసలే. గోవిందవర్మ యేకాంతమున సుదర్శనా దేవితో నిట్లనెను — "సుదర్శనా ! చూచితివి కదా ! ఆ వీరుల విద్యా ప్రదర్శన మెట్లున్నదందువు ?

"ప్రదర్శనమునకేమి వారు ........

"ఆగిపోయితివేమి .... వారు ........ ఏమిటి ?"

"వారు మగవారు కారు !"

"అదేమి చిత్రముగ మాట్లాడెదవు ?"

"నిజము ప్రభూ ! నేను ప్రదర్శనవేళ వారిని నిశితముగ పరిశీ లించితిని. వారి కదలికలు, శరీరనిర్మితి, అవయవ గోపనము సర్వము వారిని నాకుఁ బట్టి యిచ్చినవి."

"అగుచో నాశ్చర్యముగనే యున్నది."

"వాస్తవముగ నాశ్చర్యకరమైన విషయమే ! యువతులయ్యు వారంతటి విద్యావైభవోపేతలై ధేశముకాని దేశమున, అంతనిర్భీకముగ సంచరించుచున్నారనిన నాశ్చర్యము గాదా !"

"ఈ విషయము తమ్మునికిఁ గూడ తెలియునందువా ?"

సుదర్శన నవ్వి— "మా వసిమఱందికా ? ఆతనికిఁ దెలియుంతరు ఒక్కటి మాత్రము చెప్పగలను. వారి నుండి యాతఁడేదో యాశించుచున్నాఁడు ''

''సోదరునికి వారితో గావలసిన పనులేముండును ?"

"అవన్నియు మనకు తెలియునా ? ఆ చారులోచనుఁడేదో మాయఁజేసినాడు. మీ తమ్ముఁడు మాయామోహితుఁడైనాడు ''

''చాలు నీ పరిహాసము ! సుదర్శనా ! వారు నిజముగ స్త్రీ లందువా ?''

''సత్యముఁ దెలిసికొననెంచుచో వారలఁ బరీక్షింపఁజేయుఁడు. ఆ చారులోచనములు మగవారి వెన్నఁడును కానేరవు ఎంతదాచుకొన్నను దాగని జగన్మోహనా పాంగ వీక్షణములు హృదయ స్పందనము గలిగించు చున్నవి. తాము గమనించితిరో లేదో, కాని వారెంతకుఁ దమ శిరస్త్రాణముల భద్రపరచుకొనుటలో నెంతో జాగరూకులై యున్నారు. వారేదో మహాకార్యసాధన నర్థించి మనరాజ్యమున బ్రవేశించి యుండ వచ్చునవిపించుచున్నది."

"నీవు చెప్పిన వన్నియు సత్యములని ఋజువైనచో నీకు మంచి బహుమాన మొసఁగెదము.''

''అనుగ్రహీతురాలను !''

నాటిరాత్రి త్రిలోచన పల్లవి నందికతో — "నందీ ! నీ వన్నట్లు సుదర్శన మిక్కిలి తెలివిగలదివలె నున్నది. ఆమె యెంతసేపును మనలనేదో యనుమానముగఁ జూచినట్లనిపించినది. ఆమె మన ఖడ్గ విద్యను మించి, మన ముంజేతులు, అంగుళులు, వెన్నడుములు, మీగాలులు, పాలములు. నేత్రములు, చిబుక ప్రాంతములు ఒకటనియేమి సర్వాంగములఁ బరీక్షించి నట్లనిపించినది. చివరకామె వదనమున చిఱు హాస రేఖలు పరువులెత్తినవి. ఆమెను చూడగనే నా కవగతమైనది. ఆమె మన కుహనా యువకత్వమును పసిగట్టినది. నేడో రేపో మనలను పరీక్షకు నిల్పవచ్చును. సమయానుకూలముగ మనమే నిజరూపముల బయల్పడవలసి వచ్చునేమో !"

"సునీతివర్మ గారెట్లును మి మ్మోడువారు కమ్మనుచున్నారు కద !

"పిచ్చిదానా ! అట్టిది మనకు సాకెన్నఁడును కానేరదు. సునీతివర్మ మోహావిష్టుఁడు గాన మనము చెప్పినదెల్ల వేదమనుకొనుచున్నాఁడు భావనామయమధురూహాలలో కల్పిత స్వర్లోకముల విహరించు చున్నాఁడు అదియొక యున్మాదము వంటిది. కనుక అతనినుండి మనకెట్టి యాపదయునుండదు. రేపు భార్య పనుపున గోవిందవర్మ మన యొద్దకు రావచ్చును. అతని నెలయించుట కష్టము."

"అయిన నింక కర్తవ్యమేమి ?"

"సమయమున కదియే స్ఫురించగలదు. మాధవవర్మ మహారాజు మనలను తమ యాస్థానమున నుండిపొమ్మనినారు గద ! మనకొక నిలుకడ కలిగినది ఇఁకచూడు మీ త్రిలోచనాపల్లవి తంత్రము !"

"మీరేమైనఁ జేయఁగలరు !"

"ఇఁకనేమి, నీవు నిశ్చింతముగ నుండుము. ముందు జరుగవలసి నది చాల యున్నది. నన్ను కొంచెము విశ్రాంతి తీసుకొననిమ్ము"

ఇరువురు నిశ్శబ్దముగ నుండిపోయిరి.

దూరమున నాకసమున పైడిగంట్లు కువకువ లాడినవి !

ఆంధ్ర రాజధానియైన విజయవాటిక యంతయు చారులోచన సుశీలుర వీరగాథయై ధ్వనించి పోవుచున్నది. రాజధానిలో పలు ప్రముఖ స్థానములందు వారు విద్యా ప్రదర్శనము లిచ్చుట జరిగెను. ఒక ప్రదర్శనముకన్న వేరొక ప్రదర్శనము ప్రేక్షకుల మనస్సుల నాకట్టుకొనుట వారు ప్రశంసాముఖరిత వదనులై చనుటలుగ సాగుచుండెను. రాజధానియందు వారల నెఱుఁగని వారలు లేరు. వారిప్పుడాస్థానమునందున్నారు. ప్రధానోద్యోగులు, అమాత్యులు, ధనిక వైశ్యులు, సేనాపతులు అందఱు వారిని తమతమ గృహముల కాహ్వానించి మర్యాదలు చేయుదురు. ఎల్లరు వారిని యువవీరులని ముద్దుగఁ జూతురు రామ లక్ష్మణులవలె, నకుల సహదేవులవలె, నశ్వినీ దేవతలవలె నున్నారని ముచ్చట పడుదురు. వారికి ప్రతిదినమును విందు భోజనములే. ఈనాడు సేనాపతి యింట, రేపు మంత్రి గృహమున, ఇంకొక దినమున వేఱొకరి సౌధమున కాల మిట్టె గడచిపోవుచున్నది.

యువరాజు సదనమున ప్రదర్శనము నిచ్చిన నాటినుండి ప్రతిక్షణము చారులోచనుఁడు తన్నెవరో గూఢముగ పరీక్షించు చున్నటులను తా మెచ్చట ప్రదర్శనము లిచ్చిన నచ్చటనెల్ల రెండు మూఁడు జతల కన్నులు తమ్ము నిశితముగ పరిశీలించు చున్నటులను గమనించుచుండెను సునీతివర్మ సైతమేదో నర్మగర్భముగ మాటాడు చున్నాఁడు. అతఁడు మధ్య మధ్య — "మీరెట్లయిన మాయకాండ్రు. అన్న లాదు

వారేనేమో! లేనిచో మగవారెచ్చటనైన నాడ వారగుట చూచితిమా! ఆ యోగి వచ్చున దెప్పుడు? నీవు మారున దెప్పుడు? ఈ రాజ్యమున నేను మీకెంత చేసితిని! ఈనాఁడు రాజధానియందు మీ పేరు మ్రోగి పోవుచున్న దనిన దానికిఁ గారణము నేను! ఇదియంతయు నే నెందు లకు చేసితిని! నేను మీకడనిట్లు హృదయమును విప్పి ప్రవర్తించుచుండ మీరు నన్నేదో గికురించు చున్నట్లుగ కప్పింతురు. ఇది న్యాయముకాదు'' అనుచుండును.

గోవిందవర్మ యొద్దనుండి భటులు వచ్చుచుందురు, పోవుచుం దురు. వారేవో కానుకలు పంపుచుందురు. అన్నియు నాడువారి కిచ్చు నట్టివే! వారవి తమకేలనని త్రిప్పి పంపుచుందురు. చారులోచనునకు తమ రహస్య మెక్కువ దినములు దాగదనిపించును. అదియు తన మంచికే యనుకొనును. ఖడ్గ విద్యా ప్రావీణ్యముండుట చేత తమకు దెలియని రాజోద్యోగులు లేరు! పురప్రముఖులు లేరు! ఇంచు మించుగ విజయవాటిక తమ యఱచేతి యద్దమైనది. సుశీలుఁడు మూఁడవకన్నుగ రాజాంతఃపుర రహస్యములన్నియు చారులోచనుని కవగతమైనవి. తాను వచ్చినపని సానుకూలము కావలెననిన నింకెన్నెన్ని రహస్యములు నన్వే షింపవలెనో! ఎన్నింటివి కల్పించ వలెనో!

ఇది యిట్లుండగా చంద్రావతీ దేవి యాహ్వానముపై పల్లవ రాజ కన్య త్రిలోచనపల్లవి ఆంధ్రములకు వచ్చుచున్నట్లొకవార్త వ్యాపించి నది. దానికి విల్వవలెను! ఒకటని యేమి? కాంచీపురమును వీడినది మొదలు సర్వమును దుర్భరముగ నున్నది. తామెన్ని విషమ పరీక్ష లకు తట్టుకొనవలెనో!

యువరాజ్ఞి సుదర్శనాదేవి భర్తను చేతిలో బెట్టుకొని యాడించును ఆమె యెంత చెప్పిన యువరాజంత చేయును. ఒకవారము దినములు యువరాజు సౌధమున నతిథులుగ నుండుటకు వారిరువురి కాహ్వానము వచ్చినది. దీనికంతకు వెనుక యువరాజ్ఞి యాదేశముండునన్న మాట! తాము వెళ్లవలెగద! వారు తమ్మెందుల కాహ్వానించుచున్నట్లు? దీనిలో నేమైన తంత్రమున్నదా? తా నన్నిఁటికి సిద్ధపడియే పోవలెను. సుదర్శనాదేవి మంత్రాంగ మెట్టిదో చూడవలె!

చారులోచనుని యాలోచన లిట్లుండగ నచ్చట సుదర్శన భర్తతో నిట్లనెను— "ప్రభూ! నేను చెప్పితిని కద. వారసాధ్యులు. సునీతివర్మ యేమి చేయఁగలఁడు? మీరు మాత్రమేమి చేసితిరి? వారు ఖడ్గవిద్యచేత మాత్రమే కాదు. ప్రవర్తనచేత శీలముచేత కూడ నప్రతార్యులు."

'నీవనిన దక్షరముల సత్యము నేనెందఱనో గూఢచారులను నియమించితిని వారు వారుగనే మిగిలిపోయిరి. మాటాడుటలో నడకలో కంఠస్వరములో వారియందు స్త్రీత్వము గోచరించలేదు. రాజధాని యందంతట వారి వీరత్వమును గూర్చిన ప్రశంసలు వారి నందఱు మహామహులనుగ మన్నించుచున్నారు. నాన్నగారు వారిని తమ యాస్థానమున నిల్పుకొని వేతనముల నేర్పాటుగావించి వారికి ప్రత్యేక మందిరమున వసతిఁ గల్పించినారు. అంతటి వారిని నీవు స్త్రీలందువు!"

"మీ తమ్మునితో నీ విషయ మంటిరా?"

"సునీతి యేమియు ననలేదు. నీవట్లు చెప్పగా నతఁడేమనును! ఇంత వదినగారు చెప్పినమీఁదట నాతఁడు మాటాడున దేముండును?"

సుదర్శన నవ్వి — „మఱ(దికిని వారికిని మధ్యనేదో చిదంబర రహస్యముండి యుండును !" అనినది

"వారితో నతని కగునదేముండును ! వారే తామాతని నాశ్రయించిరి గద !"

'నేను చెప్పుచున్నాను. వారు మన సుపీతివర్మను వలలో వైచుకొనినారు. వారల కాతని మూలమున సాధించుకో నయిన మహాకార్యమేదో యున్నది."

'సరే చూతము. నీవు వారి కాహ్వానము పంపితివి గద !'

'నేను పంపుటేమి? మీరే పంపినారు !'

'నీకును నాకును భేద మేమున్నది ?'

'స్త్రీ పురుష భేదమున్నది గద '

'మంచిదానవు, నన్నుకూడ స్త్రీ కమ్మందువా యేమి ?''

'అట్లనుటలేదు. నేన పురుషుడనై వారి పురుషత్వమును తేల్చివెచెదను.'

'నీవంతటి దానవగుదువు ! ఇంతకు వారేమనినారు ? వచ్చుట కంగీకరించిరా

'విష్ణుకుండిన యువరాజు గోవిందవర్మగారి యాహ్వానమును మహా ప్రసాదముగ స్వీకరింతురుగాని తిరస్కరింతురా ? అట్టిదాని కెన్ని గుండె లుండవలెను ?'

'ఎటులైన నీవు పట్టుదల ప్రధానముగ గలదానవు. వారరు దెంచిన నేమి చేసెదవు ?

'అది చూడ వలసినదే గాని చెప్పెడిదిగాదు."

'యువరాజ్ఞీ ! ఇప్పుడే మహారాజ్ఞిగ మాట్లాడెదవేమి ?"

'తాము మహారాజులైన పిమ్మట గద !'

'నాకా భారము వలదు. నాయనగారు రాజ్యమేలుటయే నా యభి మతము. నేను హాయిగ బాధ్యతా రహితముగ చిత్రములగీసి కొనుచు వీణ వాయించుకొనుచు సుదర్శనా వదనాంభోరుహ చంచరీకమునై జీవి తమును గడుపుటకు వాంఛింతును.'

'నాకు మాత్రము మీరు మహారాజు కావలెనని యున్నది.'

'నా కెందువలననో నేనాపదమును పొందజాలననిపించుచున్నది'

'మీరింత రాజకార్య విముఖులై యుండుట మీ నాయనగారి కనభి మైన విషయము. మీ జననీజనకు లిరువురును మీపైనెన్నోయాసల విల్చు కొన్నారు. మీయీ నిర్మమతత్వ మలుసుగఁ దీసికొని ఇంద్రవర్మ దేవ వర్మలు వారి తల్లులతో జేరి రాజ సింహాసనమును కబళించవలెనని యూహ చేయు చున్నారు '

'నీవు మహారాజనీతి వేత్రివివలె మాటాడు చున్నావు మా నాయనగారి సంతానములో నెవ్వరు రాజ్యమేలినను నాకు సంతోషమే!'

'కలియుగ శ్రీరామచంద్ర మూర్తి బయలుదేరినారు! జ్యేష్ఠులు యువరాజులు నైన మీరుండగా నితరులు మహారాజ పదమున కనర్హులు. పిన్నత్తగార్లు. మలయవతీ సుభద్రా దేవులు తమతమ పుట్టినింట వారలతో మంతనములు సల్పి తమ సంతానమును రాజపీఠమున నిల్పుటకై కుట్రలు పన్నుచున్నారు. అత్తగారు పరమ నిర్లిప్తురాలు. ఆమెకు మహేశ్వరారధనలు బ్రాహ్మణ సంతర్పణములు మిగిల్చి వేరేమియు సక్కరలేదు ఆమె స్వయముగ తామై తమ తండ్రిగారిని సోదరులను కదిలించునా! ఆమె గుప్తవంశ చక్రవర్తుల యాడబిడ్డ!'

'మాయమ్మగారి గొప్పదన మక్కడనేయున్నది. అరిజన భయంకరుడైన భర్త తనకుండగా తండ్రితో సంప్రదింపు లేమి? అది యెంత తెలివి మాలినపని! ఏమి సంప్రదించవలయును? తనభర్తను వంచించుమనియా? అసంభవము. మా తల్లిగారు పరమశీలవతి. ఆత్మేశ్వరునికి భేదహేతువుగ నాయన తనయుల బంధించుమని యామె కోరవలయుననియా! అట్లెన్నటికిని జరుగదు. సర్వవిధముల నామె నాయనగారికి ధర్మపత్ని! వారి దాంపత్యము చూచువారలకు నేత్రపర్వముగ నుండెడిదట! మా యమ్మగారు మహాభారత నాయకురాలైన పాంచాలీ దేవివలె మా నాయనగారికి పీర్యశుల్కముగ నర్ధాంగియైనారు. మా నాయనగారిచే పరాజితులై యాయన శౌర్యమునకు ముగ్ధులై తమకొమార్తె నొసంగినారు తక్కిన మా యిరువురు తల్లుల వివాహములును పట్టి రాజకీయపు టెత్తులుగ సాగినవి. మాయమ్మగా రర్ధాంగి, ధర్మపత్ని యనుట కర్థభూతు

రాలు. ఆమెకు భర్తగారిపై నంత విశ్వాసము. ఆయన యే మొనర్చినను నామెకు సమ్మతమే!'

'ఆమె భర్తగారు సమర్థులు. శత్రురాజులకు గుండెలు తీసిన కత్తివంటివారు. నిర్మల ధర్మ కర్మాచరణ తత్పరులు, ప్రేమమయులు. ఆమెకు లేనిదేమున్నది?'

'ఉన్నది!'

'ఏమది?'

'అసంతృప్తి! అత్యాశ! అధికారవాంఛ!' ఇట్లనుచు గోవింద వర్మ కనుగొనల నవ్వు పిసాళింపులుగ సుదర్శనను చూడసాగెను. ఆమె మోము మొగ్గవారి ముద్ద మందారమయ్యెను. ఆమె యుబికి వచ్చు కోపమును ముక్కుపుటముల నడ్డుచు క్రోధారుణిమమును కన్నుల దాచుకొనుచు తనులత కంపించుచుండ— 'అవును. ఆమె భర్తగారు జగజ్జేతలు! ఆమె మహారాజ్ఞి! వశీకృత భర్తృ చిత్త! ఆమె కాసలనున వున్నగద అత్యాసలు-పోవుటకు! అధికారముపై నధికారి, ఆమె కధికార వాంఛతో పనియేమి?' అనెను.

గోవిందవర్మ నవ్వుచు — 'గోవింద ప్రియ వల్లభా! నీ కింత యలుక యేల? అంతటి యత్తగారికి కోడలవైన నీకు చింతింప వలసిన పని యేమున్నది! నిన్నామె నాకన్న నెక్కుడుగ మన్నించును గద!' అనెను.

'అవి యన్నియు నే నంటినా? నా భర్త మహారాజు కావలె నంటిని!'

నీ కొంటకైన తప్పక నయ్యేదను. నీవు కోపముతో సుదర్శనవుగ నున్నావు. సత్యభామాదేవి వలె పరమ సమ్మోహన మూర్తివై నా కన్నులం బండించు చున్నావు!' ఇట్లనుచు గోవిందవర్మ యామెను కౌగలించెను. ఆమె భర్త కౌగిటం పారావతివలె నాడి నొదిగి పోవుచు కుహనా కోపముతో — 'మీ మాటల కేమి లెండు! మహారాజ పదమును స్వీకరింపంబోవు మీరు నేర్వవలసినది చాల యున్నది. దానిపై దృష్టి నుంచుండని నా ప్రార్థన!' అనినది.

'రేపు నీ రాజనీతిని మన యతిథులపైం బ్రయోగించుము.'

'చూచెదరు గద!'

'ఇప్పుడింక మన ముద్యానమున కేగుదము. అచ్చట గీయవలసిన చిత్రములున్నవి.' దంపతు లిర్వురు చెట్టపట్టాలుగ తోటలోని కేగిరి.

విష్ణుకుండిన పురమునుండి ఇంద్రవర్మయు ధాన్యకటకము నుండి దేవవర్మయు నా యువవీరుల తమ నగరములకు వచ్చి ప్రదర్శనము తీయవలసినదిగ నాజ్ఞాపత్రములను బంపిరి. ఆంధ్రదేశపు నాలుగు చెఱగుల వారి ఖడ్గవిద్యా వైశారద్యము నగ్గించుటలుగ గడచుచుండెను. ధాన్యకటకమునందు సుభద్రాదేవి దేవవర్మలు మిగుల గౌరవించి వారిని తమ యొద్దనే యుండి పోవలసినదని, వారి మూలమున తమకుం గావలసిన కార్యములు చాలగలవని యేవేవో నర్మగర్భముగ చాలమాటాడినారు విష్ణుకుండిన పురమున మలయవతీ ఇంద్రవర్మలు కూడ నట్లే యనినారు.

మీదుమిక్కిలి వారు తమసైన్యమునకు తమ యిరువురచే ఖడ్గవిద్యాభ్యాసము చేయించవలె ననివారు. అందులకై వారి నచ్చటనే యుండి పోవలసినదిగ బతిమాలిరి. కాని తాము మహారాజు కొల్వు వీడఁజాలమనియు యువరాజు నుండి తమ కాహ్వాన మున్నదనియు చెప్పి వచ్చివేసిరి.

చారులోచనుని కాంధ్రరాజ్య పరిస్థితులన్నియు సువిదితమగుచున్నవి. రాజకుమారు లింద్రదేవవర్మలు సమర్థులు గాక పోయినను తమ తల్లులచేఁ ప్రేమింపఁబడి రాజ్యమునెట్లు తమకు సంక్రమింపఁ జేసుకొనవలెనా యని యోజించు చున్నారు. గోవిందవర్మకు రాజ్యకాంక్షలేదు. సునీతివర్మ కనలేమియుఁ బట్టదు మహారాజు చారచక్షువు. ఆయనకు తన విశాల రాజ్యమున నెచ్చటనేమి జరిగినను దర్పణమునందువలె గన్నులకుఁ గట్టినట్లు చూపఁగల ప్రజ్ఞాశాలురైన గూఢచారులున్నారు. ఆయనకు దేవేంద్రునికి బృహస్పతి వలె పినాక భట్టారకుఁడున్నాఁడు. రాజకుటుంబమున నెట్టి కలతలు వచ్చినను వానినన్నిఁటి గోటితో గిల్లివేసినంత సులువుగ నాయన పరిష్కరించి వేయును చంద్రావతీదేవి ఆయనను తండ్రివలె మన్నించును. ఆయనతో సంప్రదించిన మీఁదటనే మలయవతీ సుభద్రలు తమ తమ కుమారుల యొద్ద నుండుటకుగా నేర్పాటు గావింపఁబడినది. రాజగృహమున నే యుత్సవము జరిగినను రాజ పరివారమంతయు రాజధానికి వచ్చును. మంత్రివర్గమంతయు మిగుల విశ్వసనీయమైనది. రాజ్యము నందలి ప్రజలెల్లరు మహారాజునిన ప్రాణముఁ బెట్టువారే త్రిలోచనకు తన పదకము నఫలము కావలెననిన రాజపరివారముననే గావలెను! పినాక భట్టారకు నదుపులోనికిఁదెచ్చుట మిక్కిలి క్లిష్టమైన పని. అట్టి దానిని

సాధించుటలోనే గొప్పదనమున్నది. దైవానుకూల్యమున్నచో నెంతటి క్లిష్ట పరిస్థితులనైన నెదుర్కొని నిల్వవచ్చును. రాజనీతి పుష్పించ వలెనే గాని యెచ్చటనైన తన తావిని వెలార్చును !

యువరాజు సౌధమునకు సమీపమునందున్న యొక మందిరము చారులోచన సుశీలురకై ప్రత్యేకముగ నలంకరింపఁబడినది. ఆ మందిరము కుడ్యముల నిండ తైల వర్ణచిత్రములు వ్రేలాడఁదీయఁబడి యున్నవి స్నానపుగదులు శయనాగారములు సుసజ్జితములై యున్నవి. మందిరము చుట్టును పలువిధములైన వృక్షలతాగుల్మాదులన్నవి. వానిపైఁ బ్రసరించుచు వచ్చు సుగంధానిలము లెల్లవేళలందును ఘ్రాణ తర్పణ మొనర్చుచుండును. మందిరము నందున్న పరివారమంతయు స్త్రీ మయము. వారి యందెల రవళులు మట్టియల కంకణముల కుణు కుణు క్వాణములు, పుష్పములపై వ్రాలు తేంట్ల ఝుంకారములు వినా వేరు శబ్దము లేదు. తమకేది కావలసిన మరుక్షణమునసది యచ్చట కన్పించును. క్షణమున కొక పరిచారికగ వచ్చి యేమి కావలయునో కనుగొనుచుండును.

ఆంధ్రముల కేతెంచిన తరువాత తమంతటి రాజభోగమును గోవిందవర్మ సౌధముల ననుభవించుచున్నారు. ఆ యనుభవమున నొక నిరానందరేఖ లేక పోలేదు. అచ్చటి పరిచారికలెల్లరు తమ నెల్లవేళల శంకాన్విత దృష్టుల తిలకించుచుందురు. వారి నోసరిచి సంచరించుట మిక్కిలి కష్టముగనున్నది. తామంగీని ధరించఁ బోవుచో తాము ధరింపఁ జేయుమందురు. స్నానముచేయబోవుచో తాము శరీరసమ్మార్జనము చేయుదు

మందురు. రాత్రివేళల పాదసంవాహనమొనర్తుమనిబలవంతము చేయుదురు. వారలఁ దప్పించుకొని మసలుట దుర్ఘటమనిపించు చున్నది. ఇదంతయు సుదర్శనాదేవి తంత్రమునందలి భాగము కాబోలు !

ఈ పరిచారికలు తమను నిద్రావేళలందు సైతము వదలిపెట్ట నటున్నారు, వారిరువురు నేకాంతముగ మాటాడుకొనుట కవకాశమే దుర్లభమగుచున్నది. దినములు విశేషరహితముగ గడచుచున్నవి. పరిస్థితి యధాపూర్వముగనే యున్నది. గోవిందవర్మ భార్యను— "యువరాజ్ఞీ ! నీ యతిధులేమనుచున్నారని"రని యడిగెను. 'ఏమందురు? త్వరితముగ బయటపడమందురు !"

"మఱి నీ నీతి యేమైనది ?"

"పుష్పించబోవుచున్నది. మీరీదినము వారలకు మనతో కలసి భోజనము చేయవలసినదిగ వార్తనంపుడు."

"అటులనే నీ యిచ్ఛకు తిరుగులేదు."

నాడు వారిరువురును యువరాజు సౌధమునకు వచ్చిరి. చారులోచనుడు యువరాజ దంపతులు తమ్మొ సహపంక్తి భోజనమున కడుగుటకు నివ్వెఱపోయెను. మఱల నిందులో నేమి గుప్తార్థమున్నదో చూతమనుకొనెను.

భోజన సమయమున గోవిందవర్మ— "చారులోచనా ! మీ ప్రవర్తన మాకు విచిత్రముగ నున్నది సుమా !" యనెను.

"యువరాజన్నమాట మా కర్థమగుటలేదు."

"మీరు రేబవళ్ళు సర్వసమయములందిట్లే యుందురా ?"

"అట్లనుటలో తమ యభిప్రాయము ?"

"మీకుఁ దెలియుటలేదా ? భోజన సమయమున నీ తూణీరము లెందులకు ? ఆ ఖడ్గములేల ? ఆ కవచాములు నిద్రవేళ నిట్లే ధరింతురా ? శిరస్త్రాణముల నిద్రావేళల నయితము పరిహరింపరా ? ఇది చూచిన పర మాశ్చర్యముగ నున్నది !"

"మా యలవాటట్టిది".

"అట్టి యలవాటెచ్చటనైన నుండునా ? మీవలెనే వారందరిట్లే నడచుకొందురా ! నా శత్రు, నా మఱఁది సునీతివర్మ చూచుగాని మీవలె కద ! వారిదే తీరున యుద్ధరంగమున కేగుచున్నట్లు నిరంతర మీ దుస్తుల ధరించి యుందురా !" అని సుదర్శన ప్రశ్నించెను.

"అది వ్యక్తిగతమైన యభిరుచిని బట్టి యుండును."

"మేము మిమ్మెదో యవహేళన చేయుటకనుటలేము. మా యతిథులను మేము చిన్నబుత్తుమా ? మీ తీరుతెన్నులు చిత్రమనిపించి యడిగితిమి."

"క్షమించుఁడు. మేము మాత్రమేమంటిమి ? మా మనస్సున కట్లు నచ్చినది. మా దేశమున మేమిట్లే యుందుము. అచ్చట మమ్మెవ్వరిట్టి ప్రశ్నవైచినది లేదు."

గోవిందవర్మ యిట్లనెను— "మీరు బాధఁజెందకుడు. మీకు కోపము తెప్పించవలెనని మా యభిప్రాయము కాదు. అతిథులైన వారు

కలసిమెలసి యాచారవ్యవహారములు పాటించుచో నాత్మీయత వృద్ధి జెందును. మీరు మీ వేషభాషలలో ప్రత్యేకతను నిల్పుకొన్నచొ నెప్పుడును క్రొత్తదనమే భాసించుచు మిమ్ములఁబరులుగ గన్పింపఁ జేయును. అందులకే సుదర్శన యట్లనినది, వేరేమియుఁగాదు.''

''దానికేమి? మాకు మనస్సు ప్రధానము. కాని, పై వేషము లెట్లున్ననేమిలెండు. ''భిన్నరుచిర్హి లోకః!''

సుదర్శన ''మీ యిష్టము వచ్చినట్లుండవచ్చును. మా కభ్యంతరము లేదనెను.''

గోవిందవర్మ— ''మీ ప్రదర్శనమును దిలకించిన నాటినుండియు సుదర్శన మిమ్ము తెగమెచ్చుకొనుచున్నది. మీరు తన చిన తమ్ముని వలె నున్నారనును. మిమ్ము మా సౌధముల కాహ్వానించు నందాక నామె కూఁటకలుగలేదు.'' అనెను.

మహాభాగ్యము! యువరాజ్ఞి దృష్టి కాగినిల్చిన మేము నిజముగ ధన్యులము. ''మా దేశమునకు పల్లవ రాజకుమారి త్రిలోచన పల్లవీదేవి స్నేహ యాత్రకు వచ్చుచున్నారు. ఆమె మీ దేశపు రాకుమార్తె కాబోలు! మీ కామె తెలియునా?''

''చూచినాము. మాయక్కగారి కామె యిష్టసఖి.''

''ఆమె యెట్లుండును? అందగత్తెయా? ఆమె పురుషోచిత విద్యలఁ బ్రవీణయఁట, గద!''

"ఆమెను మా దేశమున కామాక్షీదేవ్య పరవతారముగ భావింతురు. ఆమె జగన్మోహిని వలె నుండును. ఆమెతో ఖడ్గయుద్ధమున నిల్వఁజాలిన జోదు పల్లవ రాజ్యమున లేడందురు."

"ఆమె ప్రవర్తన యెట్టిది?"

"మా యక్కగారినుండి వినిన దానిని బట్టి యామె సరళ స్వభావురాలు. తోడివారలతో నామె ప్రవర్తన మధురముగ నుండును. స్వపర భేదమును పాటింపక గుణ ప్రాధాన్యము ననుసరించి యామె నడచుకొనుచుండును. ఆమె సాధారణముగ కోపిగించుకొనదు, ఆమె కోప మొదవిన నది దుర్దమముగ నుండును. ఆమె పగ కోడెత్రాచు పగవంటిది తానో వైరియో తెగవలసినదే!"

"నాకామె నెప్పుడు చూతమాయని యున్నది!"

"మన యాంధ్రముల కామె వచ్చుచున్నారంటిరి గద! ఆమెకిచ్చట తమను మించిన సఖులెవ్వరుందురు?"

గోవిందవర్మ — "చారులోచనుఁడు చమత్కారశీలి. భవిష్యదర్శించుచున్నట్లు మాట్లాడును. త్రిలోచన పల్లవిదేవి నిజముగ మీతోనే స్నేహము చేయగలదు."

"పరిహాసము చేయుచున్నారు!"

"నిజముగ నేను భావించినదే నుడివితిని."

భోజనములు ముగిసినవి. తాంబూల సేవనానంతరము చారులోచన సుశీలురు తమ వసతి మందిరమున కేగిరి. సుదర్శన కు వారి రహ

స్యములను భేదించుటెట్లో యవగతమగుటలేదు. ఆమె తన యంతః పుర పరిచారికయైన మకర కుండలను పిలిపించి యిట్లనెను — "మకర కుండలా ! నీవా యువవీరులను చూచితివికదా !"

"ఎందుకు చూడలేదు ! నాకు వారిపై మిపుల కోపముగనున్న దమ్మా. విజయవాటికలో నాభర్త గొప్ప కటారికాడుగ పేరొందిన వాఁడు. అనా భర్త నోడించిన వీరుని నేనెట్లు విస్మరింపగలను ? శివనాగుని కటారి విద్యకు మోహితురాలనై యాతని బెండ్లియాడితిని. ఆతఁడితరుల చేతిలో, అందును ముక్కు పచ్చలారని యువవీరులు మన దేశము కాని వారిచేతిలో నోటువడెనన్న నా కవమానము తలముక్కలుగ మున్నది. నాఁటి నుండి వారలనెట్లు పరాభవింపవలెనా యని యాలో చించు చున్నాను. వారిప్పుడు రాజధానిలో గొప్పవారై కూర్చున్నారు !"

'నీకు నిజముగ వారిపై నంత ద్వేషమున్నదా? మకరకుండలా !'

'ద్వేషమని నెమ్మదిగ ననుచున్నారా ? అమ్మా వారు నాకు తటస్థ పడవలెను. నాతో కత్తి యుద్ధమును జేయుమనుడు. అప్పుడు చూపింతును.'

'నీకు కత్తియుద్ధమునందు ప్రావీణ్యము కలదా ?'

'నా భర్త నాకు నేర్పినాడు. వినోదమునకై నేర్చుకొంటిని.'

'ఆ మాత్రపు విద్యచే వారల నిర్జింతు నందువా ?'

'వారు ప్రదర్శించిన యొడుపుల నే నభ్యసించితిని. వారి ప్రక్రియల తోనే వారి నెదుర్కొనవచ్చును.'

'అట్లయినచో నేను నీ కొక పని నప్పగింతును. దానిని నీవు నిర్వహింతువేని నీ కోరిక తీరగలదు. నాకు మొదటినుండియు వారు పురుషులు కారని యనుమానము. అది నీ మూలమున నే తీరవలయును.'

"వారిప్పు డెచ్చట నున్నారు ?"

"మా సౌధమునందే మా కతిథులుగ నున్నారు !"

మకరకుండల సంతసముతో — "ఆ బాధ్యతను నేను స్వీకరింతును. ఈ యవకాశమును కలుగఁజేసి నందులకు మీకు జన్మాంతము కృతజ్ఞురాలను. వారు స్త్రీలయినచో మరియు నవమాసము . . భర్త యాడువారి చేతిలో నోడె ననిన నా యనుమానము అధికతరమై బాధించుచున్నది." అనెను.

"నేటినుండి వారి మందిరము వద్ద నీవు ఖడ్గధారిణివై యుండుము. వారి ప్రవర్తన చిత్రముగ వారి యలవాట్లాశ్చర్యమును గొల్పును. వారు సర్వవేళలందును యోధులవలె దుస్తులు ధరించియే కన్పింతురు. ఇఁక నీవెట్లు నిర్వహింతువో మరి !'

'నన్ను నియమించిన కార్యమును ప్రాణపణముగ నిర్వహింతును."

మకరకుండల సెలవు గైకొని వెడలి పోయెను.

సుదర్శన తన కార్యము సానుకూలమైనట్లే సంతసించెను. అతని సంభాషణ వైఖరియే చిత్రమయినది. చారులోచనుఁడు కానేదో మహా

రాజకుమారునివలెఁ బ్రవర్తించును. వారి రాజకుమార్తె యయిన వారల కెంతటి గౌరవమో! ఆమె జగన్మోహినియఁట! ఖడ్గవిద్యావేత్త్రియఁట! పల్లవ రాజ్యమునం దామెకు మించిన ఖడ్గవిద్యా విశారదులు లేనేలేరఁట! వచ్చునుగద. చూచెదము. మకరకుండల ఖడ్గయుద్ధము చేయునా? తన భర్త యవమానమునకామె యెంత బాధఁజెందుచున్నది! తాను కూడ ఖడ్గవిద్య నభ్యసించుచో బాగుగనుండును. సాటి రాజకుటుంబములం దదియే ప్రతిష్ఠాహేతువు కాఁగలదు. త్రిలోచన పల్లవిని గూర్చి ప్రజలు తెగ చెప్పుకొనుచున్నారు. తాను సైతము పల్లవి యంతటి ఖడ్గవిద్యా విశారద కావలెను."

గోవిందవర్మ రాకచే నామె యాలోచనల కంతరాయము కల్గినది.

"సుదివ్యనా! ఏమి దీర్ఘముగా యోజించుచున్నావు!"

"ఏమున్నది. మకరకుండలను వారిపై ప్రయోగించుచున్నాను. ఆమె గొప్ప కటారికత్తెయఁట! ఆమె శివనాగుని పరాభవమునకు ప్రతీకార మొనర్చునఁట!"

"బాగున్నది. నీకు మంచి యాయుధము లభించినది. పగ పేర్చినను తీర్చినను స్త్రీకృతముగనే జరుగవలెను."

"శ్రీవారి వచనములు నిజము. స్త్రీరహస్యము స్త్రీయే భేదించవలయును. మన రాజ్యమున నాడువారు వీరనారీమణు లగుచున్నారు!"

"మగవారు లలితకళల నభ్యసించుట లేదా!"

''నీవు కూడ నభ్యసించుము.''

''తప్పక యట్లే చేయుదును.''

''నీ కిష్టము వచ్చినట్లు చేయుచుంటివిగద !''

''ప్రభువులు నా మాట నెప్పుడు కాదనినారు గనుక. నే నదృష్ట వంతురాలను.''

''అంత పొగడకుము. భర్తవింతగ శ్లాఘించు భార్య లభించుట కూడ నదృష్టమే !''

''మన మొకరి కొక రదృష్టముగ లభించినాము !''

ఇరువుర కిలకిలారు నగవులతో సయ్యాటలతో నా మందిర మంతయు నానంద తరంగితమైనది !

నాల్గు దినములుగ మకరకుండల చారులోచనాసుశీలుర మందిర ద్వారమున నిచ్చుకత్తిని బూని కావలికాయుచున్నది. ఆమెను చూడగనే చారులోచనుని కామె ఖడ్గవిద్యావేత్రి యని తెలిసిపోయినది. ఆమె కత్తిని పట్టుకొను తీరులోనే యా లక్షణము ద్యోతకమగుచున్నది. తీవ్రమైన యభ్యాసము చేసిన వైఖరి యామె శరీరమున ప్రకటమగుచున్నది. సుదర్శన తనపై మంచి కాపరికత్తె నుంచినది ! ఈమె కొండజాతిది వలె మిక్కలి బలిష్ఠములైన యవయవములు కల్గి చూపరుల దృష్టి నాగినిల్చునట్లున్నది. ఈమెను కాపుంచుటలోని తాత్పర్యమేమో ! చారులోచనుని కవగతమగుటలేదు. పోనిమ్ము చూచెద'' మనుకొనెను.

ఒకనాటి సంధ్యా సమయమున చారులోచనుఁడు స్నానాగారమున కరుగగా సుశీలుఁడు ఖడ్గధారియై వెలుపల కూర్చుండి యుండెను, మకర కుండల యేదో పనిమీఁదవలె నచ్చటికి వచ్చెను. ఆమె సుశీలునికి నమ స్కరించి.... "అయ్యా ! మీ స్నేహితుఁ డేడి ? ఆయన యేమి చేయు చున్నారు ?" అని యడిగెను.

"నీ పేరేమి ? నీ వెవరవు ?"

"నా పేరు మకరకుండల. సుదర్శనాదేవి యంతఃపుర ప్రధాన పర్యవేక్షకురాలను."

"అంతఃపుర పర్యవేక్షకురాలవైన మరి యిచ్చట తిరుగుచుంటి వెందులకు ?"

"మా దేవిగారు తమకన్ని సౌకర్యములు సరిగ జరుగుచున్నవో లేదో చూచుచుండుమని నన్నిచ్చట నియమించినారు. ఇంతకు మీమిత్రుఁ డేమయినట్లు ?",

"కనుపించుట లేదా ? నేనిప్పు డెచ్చట నున్నాను ?"

"స్నానాగారము నొద్ద !"

"మరి యింక తెలియుచునే యున్నదిగద ! ఆయన స్నాన మొనర్చుచున్నారు."

మకరకుండల విరుగబడి నవ్వసాగెను.

"అట్లు నవ్వెద వేమి? నవ్వుట కిచ్చట నేమున్నది? నా మొగమున కోతులాడుచున్నవా."

"మీ మొగమునఁ గాదు కాని మనస్సున నాడుచుండవలె! లేనిచో ఆయన స్నానమొనర్చుచుండ మీ కావలె నేమి?"

"మరియాద నతిక్రమించ నంతవరకు సంభాషణ బాగుండును."

"క్షమించుఁడు. నేనేమంటిని? మీ ప్రవర్తన విచిత్రముగ కనిపించి యట్లంటిని. క్షమించుడంటిని గద! పోనిండు. మీరిరువు రేమగుదురు? స్నేహితులా? సోదరులా?"

"స్నేహితులము!"

"మీకంటె మీ స్నేహితుఁ డెక్కువ కటారికాడు వలె నున్నాడే!

"ఖడ్గవిద్యను గూర్చి సాకల్యముగ తెలిసిన దానివలె మాటాడెద వేమి?"

'నాకుఁ గొలఁదిగ తెలియును. నా భర్త నాకు నేర్పెను."

'ఎవరాతఁడు?'

,యువరాజ్ఞి గారి జన్మదినోత్సవము నాడు మీమిత్రునితో కత్తి యుద్ధముఁ జేసినవారిలో నొకఁడు.'

'శివనాగుఁడా! అతఁడొక్కఁడే కొంచెము తెలిసినవాని వలె నున్నాడు.

‚నా భర్త గొప్ప కటారికాడు. ఆంధ్రమున నాతనికీడైన వా రొక పదిమంది యుందురేమో। అతనిని మీమిత్రుఁడు కుయుక్తులు వన్ని మాయ యెడుపులు ప్రయోగించి యోడించినాడు. న్యాయ యుద్ధమున నైనచో నాభర్త నెవ్వరును జయించలేరు."

‚అన్యాయ మొనర్పవలసిన పనియేమున్నది ? ప్రత్యక్షముగ నల్వురు జూచుచునే యుండిరి గద. మామిత్రుని యొద్ద నున్నంత లాఘవము నీభర్తకు లేకపోయినది !"

‚‚మీరు మీ మిత్రునికంటె తక్కువ తెలిసిన వారనుకొందును !''

"అది నీ వెట్లు నిర్ణయించగలవు ?''

‚‚మీకు సామర్థ్యమున్న నాతో చేయికలుపుడు.''

సుశీలు డాశ్చర్యముఁ జెందెను— ‚నీతోనా । నీవాడు దానవు ,'

‚విద్యయందు స్త్రీ పురుష భేదమేమి ? ప్రావీణ్యము ప్రధానము.'

'అయినచో సరియే నేను కవచిని, నీవు కాదుగద ;'

‚నా కవి యేమియు నక్కఱలేదు. మీమిత్రుఁ డెట్లును స్నానము చేయుచున్నాడు గద ; ఆయన స్నానము ముగించి వచ్చులోపల మనము కొంత తడవు కత్తులు కలుపుకొందమా !'

'‚నీ యిష్ట మట్లే కానిమ్ము.'

మకరకుండలా సుశీలు రిరువురు కత్తులుదూసి యొకరిపై నొకరు తమతమ ఖడ్గవిద్యా లాఘవమును ప్రదర్శించుకొన దొడంగిరి. కొంత సమయము గడచు సరికి సుశీలునికి మకరకుండల సామాన్యురాలు కాదనిపించెను. ఇంక కొంత తడవిట్లే సాగిన నామెతో పోరుట కష్టమని పించెను. మకరకుండల యది గమనించి యిట్లనినది— .ఓహో ! అప్పుడే అలసిపోయితిరి. ఒక సామాన్య స్త్రీ నైన నాతో తులాయుద్ధము ననే యింత సంకట పడుచున్నారు ! మీరింక రణరంగమున నేమిచేయం జాలుదురు ? మీ యోధ్ర లక్షణములు కేవల మా దుస్తులు ధరించు టలో తప్ప నింకెందును గన్పించుటలేదు. ఈ సాయం సమయమున హాయిగ చల్లగాలిలో స్పర్శసుఖ మనుభవించలేక చెమటతో నుక్కిపోవు నట్లా శిరస్త్రాణమెందులకు ?'' ఇట్లనుచునే మకరకుండల యొక యొడు పుతో సుశీలుని శిరస్త్రాణమును క్రిందబడునట్లుగాం జేసెను. శిరస్త్రాణము పడుటలోనే సుశీలుని కేశపాశిం జలజల చీకట్లు కురిసినవి. అతండు దిగ్భ్రాంతుండై నిలచి పోయెను !

మకర కుండల కిలకిల నవ్వసాగెను. ఆమె యిట్లనెను— "ఔరే ! నీవాడుదానవా ! అందులకా యీ యవయవ గోపనము ! మీ మిత్రుండు నైతము స్త్రీ యేనా ? మీరిరువురు భార్యాభర్తలా ?"

అలజడి నుండి తేరుకొని సుశీలుండు— కాదనెను. మే మిరువుర మన్నా చెల్లెండ్ర'మనెను

"కామ మీరు దంపతులై యుండవలెను !"

''కామని చెప్పితివి గద !"

‘‘నీ వాడుదానవని చెప్పితివా ? నీ మాట విశ్వసించుటెట్లు ?’’

‘‘నిజము చెప్పుచున్నాను. నమ్ముము. నీవు, నేనొక జాతివారమైనాము కద ! మన మిరువురమిప్పుడిఁక స్నేహితురాండ్రము. దయయుంచి యీ రహస్యము నెవరితో ననకుము.”

,,అతఁడు నిజముగ నీ భర్త కాదా !”

,,కాదనుట లేదా ! అతఁడు నాయన్నగారు.”

స్నానాగారమున నున్న చారులోచనునకు వెలుపల ఖడ్గధ్వని, యుద్ధము జరుగుచున్న లక్షణము విన్పించి స్నానాగారపు తలుపు నందు నుండి యొక కన్నుంచి శ్రద్ధగ పరీక్షించి చూడసాగెను. మకరంకుడలా సుశీలుర కత్తియుద్ధము, సుశీలుని శిరస్త్రాణము తొలగింపబడుట ప్రత్యక్షముగ కన్పించెను. చారులోచనుఁడు వెంటనే దుస్తులు ధరించి ఖడ్గముఁ బూని యీవలకు వచ్చి వారల సమక్షమున నిలచెను.

మకరకుండల— ,,రండు రాకుమారా ! రండు. ఇదుగో మీ భార్యను గుర్తించితి” ననెను.

,,ఆమె నా భార్యయని నీకెవరు చెప్పిరి ?”

,,ఒకరు చెప్పవలయునా ! పురుషవేషమున నున్న యీమె స్త్రీయని యెవరు చెప్పిరి ?’’

చారులోచనుఁడామె తెలివికి లోలోన మెచ్చుకొనుచు నిట్లనెను— ,,స్త్రీ యైనచో నా భార్యయని యర్థమా ? స్త్రీ లందఱు నా భార్యలా ? నీవును స్త్రీవే కద !”

"ఏమి గడుసుఁదనము! మోసముచేసి నా శత్రువు గెలుచుట కాదు. తులారణమున నున్న గెల్వవలెను. అప్పుడు చూపింపుడు మీ గడుసరి లక్షణము!"

"నీకు నాతో తులారణ మభిలషితమగుచో నా కెట్టి యభ్యంతరమును లేదు కాని అందుల కనువైన ప్రదేశము కావలెను. అదియు గాక ఇరువురు పోరాడుచో మధ్యవర్తులుండవలెను గద!"

"వారిని నేను తెచ్చెదను."

"ఎవరిని తెచ్చెదవు?"

"యువరాజు గోవిందవర్మగారిని యువరాజ్ఞి సుదర్శనాదేవి గారిని తీసికొని రాగలను."

"నీవు వారలతో నంతటి సామీప్యమున్నవాఁడవా? తెలిసినది. అటులనే తెచ్చుకొమ్ము. నీవు సైతము కవచధారివై రమ్ము. శిరస్త్రాణమును ధరించుము. యువరాజు క్రీడోద్యానమున విశాలములైన శాద్వల ప్రదేశములున్నవి గద! ఎచ్చటనైన సరే, ఏర్పాటు చేయుము, నేను సంసిద్ధము!"

మకరకుండల సరియని వెడలిపోయెను.

మరునాడుదయవేళ సూర్యదేవుఁడు తన నులివెచ్చని కిరణములలో లోకములఁ దనియింపఁ జేయుచుండగా గోవిందవర్మ క్రీడోద్యానమున నొక కేళాకుళి యొడ్డునఁ తులా రణ మేర్పాటు గావింపఁబడినది. చారులోచనుఁడును మకర కుండలయు ఖడ్గములఁ బూని రంగభూమి

యుండి నిలచిరి. సుశీలుఁడు రాలేదు; మందిరమునందే నిలచి పోయెను. సుదర్శన గోవిందవర్మ యెదురగ నాసనములపై నాసీను లైరి. సుదర్శన మోమున నొక యానందము తృప్తి వెలుగుచుండెను. గోవిందవర్మ కాశ్చర్యముగ నున్నది. మకరకుండలా చారులోచనులు కత్తులు కలుపుకొనవచ్చునను శంఖారావము జరిగెను. వారిరువురు నాకొన్న సింగములట్లు పగఁబూనిన త్రాచులవలె రంగమున గిరగిర తిరుగుచు నలాతచక్రమువలె ఖడ్గముల యొరపిడిచేనైన విస్ఫులింగములతో చూచుటకు భయావహముగ నుండిరి.

సుదర్శనా గోవిందవర్మలకు వారొకరి నొకరు సంహరించు కొందురేమో యనిపించుచుండెను. మకరకుండల యెంత ప్రయత్నించియు చారులోచనుని మేన నొక్కగాయమేని చేయలేకపోయెను. గాయము దాఁక నెందులకు ఆమె కత్తి యాతని దేహమున నే భాగమును స్పృశించనైన లేదు. అతని కత్తి వాదరకు మకరకుండల వస్త్రములు చినిగిపోయెను ఆమె కొడలంతయు గాయములయ్యెను. చారులోచనుని తోడి పోరాటమామెకు భారముగ నుండెను. సుశీలుఁడు అనుభవము తక్కువవాఁడు. చారులోచనుఁడట్లుకాదు. అతఁడు కత్తి యెత్తెనవినచో నాదెబ్బ వృథకారాదు. మకర కుండల యెంతవరకు చారులోచనుని శిరస్త్రాణమును తొలగించవలెనని ! అది యామెకు సాధ్యమగుటలేదు. ఇంకొక్క రెండు మూఁడు నిముసములు పోరిటులే సాగిన మకరకుండల మడియుట తథ్యము. మకరకుండల గాని సులోచనుఁడు గాని యొకరినొకరు చంపరాదని నియమము. మకర కుండల ప్రాణములు కడబట్టుచున్నవి. సుదర్శన యాందోళన జెందుచున్నది. చూచుచుండగనే చారులోచనుఁడొక విచిత్ర చంక్రమణ

మొనర్చి యామె చేతిలోని కత్తిని కొన్ని గజముల దూరమునc బడు నట్లుగ నెగురగొట్టెను. మకరకుండల తలదించుకుని యట్లే నిలచి పోయెను.

చారులోచనుcడు— మిడిమిడి జ్ఞానమును బురస్కరించుకొని యధికులమని విఱవీగుచు బ్రవర్తించరాదు. కయ్యమునకు గాని వియ్యమునకు గాని సమమైన వారి నెన్నుకొనవలెను. ఎప్పుడిట్టి పిచ్చిపనులc జేసి చాపుc దెచ్చుకొనకుము.

చారులోచనుcడు మాటాడుచునే యుండెను. మకరకుండల రోషముతో వెనుకకుబోయి తన ఖడ్గముcదెచ్చికొని చారులోచను దనవహితుcడైన యప్పుడాతని శిరస్త్రాణము క్రిందcబడునట్లుచేసెను. తానూహించని యాకృత్యమునకు చారులోచనుcడు నిశ్చేష్టుcడయ్యెను!

సుదర్శనా గోవిందవర్మల సమక్షమున నొక సుందర వినీల ప్రావృషేణ్య పయోవాహము క్రమ్మినట్లయినది! వారిరువురు విశ్చేష్టులైరి. వారట్టి స్థితినుండి తేరుకొనక పూర్వమే మకరకుండల కదలక మెదలక నిలబడియున్న చారులోచనునితో— ,,ఇcక నొక్కటి మిగిలియున్నది. ఇదిగో చేసి చూపించుచున్నాను. అనుచు తనకత్తి మొనతో నామె యురఃకవచము నూడగొట్టెను.

చారులోచనుcడు వెలవెలబోయెను! సగమాడుదియై పోయెను. ఆమె సుదర్శనతో— ,,దేవీ రాజకుమారియో రాకుమారుcడో నాకుc దెలియదు. కాని శ్రీదుర్గాదేవి యపరావతారము. మీరెదుఱుగ నున్నారు గావున నీ నాడీ మకరకుండల ప్రాణములతో నున్నది. నా భర్త యాతనిచేతిలో నోడిపోయెననిన నాశ్చర్యములేదు, నా కీతనిపై ద్వేషము

లేదు. నాడు తమ జన్మదినోత్సవ సమయమున నా భర్త పరాజితుఁడగుట సహింపలేని నేను దివారాత్రములు నిద్రాహారములను వర్జించి యీ రెండు మెలకువల నభ్యసించితిని. ఆ రెండవ రాకుమారియైనచో నా దెబ్బకు తట్టుకొన్న, జాలకపోయెడిది. ఆమెకు విద్య సామాన్యముగ తెలియును. ఈమె కట్లు గాదు, ఈమె చేతిలో మరణించిన నదృష్టమే! ఆమె నూఁటక నిలబడి యుండగా నేను వెనుక నుండి యామె శిరస్త్రాణమును తొలగించితిని. అది చాల యవమానకరమైన విషయము. ఓడిపోయి సిగ్గులేనివారు చేయుపని యది యని నాకుఁదెలియును. కాని నాపై మోపఁబడిన బాధ్యతనెట్టులైన నిర్వహించవలెనని చేసిన నా యకృత్య మును క్షమించవలయును ఆమె గోవిందవర్మ దిక్కై "రాకుమారా ! నన్ను క్షమించుఁడు. యుద్ధ ధర్మమును వీడి నా మొనర్చి యకృత్యము నకు నేను లజ్జించుచున్నాను. తామేశిక్ష విధించిన నందులకు సంసిద్ధు రాలను."

ఆమె చేతిలోని కత్తినిదించి యంజలించి నిలచెను,

చారులోచనుఁడు యోజించుకొనుచుండెను, తానెప్పటికైన గుట్టు వీడవలె గద ! ఇదియు బాగుగనే యున్నది ! ఇంక తాను త్రిలోచన పల్లవిగ ప్రత్యక్షమగుటలో నభ్యంతరము లేదు.

గోవిందవర్మ లేచి చారులోచనుని సమీపించి — "నీవ్వెవరవు ? మీరిట్లు మారువేసముల సంచరించవలసిన యవసరమేమివచ్చినది ! ప్రజలనిట్లు ప్రతారించుటలో మీకుఁ గలుగు ప్రయోజనమేమి ? చెప్ప దలఁచుకొనినచో చెప్పవచ్చును చూచుటకు నీవేదో మహారాజు కుటుం బమునకు సంబంధించినట్లు కనఁబడుచున్నావు. ఆ మీ చెలికత్తెను గూడ

రమ్మనుము. మీకు వలయు సౌకర్యముల నన్నింటిని సమకూర్చెదము. మీరు మీ యిష్టము వచ్చినట్లుండ వచ్చును. మీరు స్త్రీ లైనను పురుషు లైనను, మీరే రాజ్యమున నున్న నా రాజ్యమున కలంకారమే యగుదురు. మిమ్ము మేము హృదయ పూర్వకముగ నభినందించు చున్నాము" అనెను.

సుదర్శనా దేవి యిట్లనెను— "ఓ వీరనారీమణీ! నీ వెవ్వరివో తెలిసిన సంతసింతును. ఇతఃపూర్వ మెచ్చటనో చూచినట్లనిపించు చున్నది. నాడు కోటలో మీ విద్యా ప్రదర్శనముఁ జూచినప్పుడే మీరు మారువేసములనున్నారని పురుషులు [illegible], నా కనుమానము కల్గినది. దానికి విదర్శన మీనాడిట్లు కన్పించుచున్నది. నేను నిన్ను నా చెల్లెలుగ చూచుకొందును.''

''నా సంగతులన్నియు మీకుఁ దెలియఁజేయుటకు నాకెట్టి యభ్యంతరమును లేదు, నా మిత్రురాలిని గూడ పిలిపించుడు. నేనెప్పుడు మారితినో, వేషమును బట్టి ధర్మమును మారవలె గద! సాటి రాజపుత్రికతో నెట్లు ప్రవర్తించిన బాగుండునో యోజింపుడు."

"సుదర్శనయు గోవిందవర్మయు మొగములు చూచుకొనిరి.

గోవిందవర్మ యిట్లనెను— "భోజనానంతర మేకాంతమందిరమునఁ గలసికొందము. ఈ లోపల మీకు వలయు సర్వ సదుపాయములు సమకూర్పఁబడును.''

సుదర్శనా గోవిందవర్మలు తమ తమ సౌధముల కేగిరి. మకరకుండల వారి ననుగమించెను. చారులోచనుఁడు తన మందిరమున కేగెను.

మధ్యాహ్న విశ్రమానంతరము వారు నల్వురు గోవిందవర్మ రహస్య మందిరమున సమావేశమైరి. వచ్చినవారిలో నొకయామె త్రిజగన్మోహినిగ మెఱసి పోవుచుండెను ; రెండవ యామె ఆమె చెలి కత్తియ. ఆమెయు రూపసియే. మొదటి సౌందర్యరాశిని చూడగనే సుదర్శన మనమున నరమేధము నాటి పల్లవ రాజకుమారి త్రిలోచన పల్లవి మెఱసినది. ఆమె యేమియు పైకి వ్యక్తపరచలేదు.

గోవిందవర్మ ఆమెలోకాతీత సౌందర్యమునకు ముగ్ధుఁడై పోయెను. ఆయన మాటాడనేలేదు. నలువురి మధ్య నించుకసేపు నిశ్శబ్దత నిలచి పోయెను గది యంతయు కాచపాత్రల యందుంచిన యగురు గుగ్గులుల ధూపములచే సువాసనా భరితమై మాదకత్వము నొదవజేయు చున్నట్లుండెను. నిశ్శబ్దతను చీల్చుకొనుచు సుదర్శన యనినది— "అమ్మా ! ఇచ్చట నీ రహస్యము, అది రహస్యమే యగుచో మా యిర్వురఁ దాటి మూఁడవ వ్యక్తికి తెలియదు. మీ చెలికత్తె మీ చెలికత్తియే గద ! ఇప్పుడిఁక చెప్పవచ్చునను కొందును,"

చారులోచన సుశీలవంక చూచెను. ఆమె యిట్లుచెప్పెను "అమ్మా ! యువరాజ్ఞీ ! ఈ రాజకుమారి మహారాజ రాజశ్రీ పల్లవ రాజ, కుమార విష్ణు మహారాజుగారి యనుఁగు సోదరి శ్రీశ్రీశ్రీ త్రిలోచన పల్లవి దేవి గారు,"

ఆ మాట నాలకించనే సుదర్శనా గోవిందవర్మ లుల్కిపడిరి. వారిర్వురొకే మాఱుగ త్రిలోచన పల్లవిని జూచిరి. క్రిందటి దినము వరకు కనిపించని యొకానొక ఠీవి, యొయారము, కూర్చుండుటలో నొక మహారాజ్ఞి హొయలు, కన్నులందధికార రేఖ సర్వమామె నొక రాజ్య పాలన మొనర్చగల మహారాజ్ఞిగ చెప్పక చెప్పుచున్నవి.

ఆమె యిట్లనెను— "నా పేరు నందిక యందురు. నేనీ రాకుమారి చెలికత్తియను. ఈమె తన యన్నగారితో నరమేధమునకు మీ రాజ్యమునకు దయచేసినారు."

సుదర్శన— ఔను. నాకుఁగూడ జ్ఞప్తికి వచ్చుచున్నది. నే నీమె నెచ్చట చూచితినా యనుకొనుచుంటిని. నీవు పేరు చెప్పినంతనే నాకును విదితమైనది.

నందిక :- అప్పుడు త్రిలోచనాదేవి సునీతివర్మగారిని చూచుట తటస్థించినది. నాఁటి నుండి వారీమె మనస్సునందు స్థిరులైనారు.

గోవిందవర్మ యాశ్చర్య చకితుఁడై చూచుచుండెను.

నందిక :- తానైనచో వారిపై మనసు నిల్పినదిగాని యాయన మనోలతిలమెట్లుండునో తెలియదు గద : అందుచే నీమె పురుషవేషమున నిట్లు బయలుదేరినది. అదృష్ట వశమున నాడఁబోయిన తీర్థమెదురైనట్లాయన మాకు కన్పించినారు. తదుపరి సర్వ విషయములును మీకుఁ దెలిసినవే కద !

గోవిందవర్మ :- మరి మీరిచ్చట నుండగ త్రిలోచన పల్లవీదేవి మా దేశమునకు స్నేహయాత్ర వచ్చునను వార్తలేమి ?

నందిక :- అది యంతయు రాకుమార్తె తంత్రము : ఆమె యెట్లును తమ వేషము నవనయించవలెనని నిశ్చయించుకొని ముందా ప్రకటనకు తావొసఁగిననది ఆమె తానై పురుషవేషము నుజ్జగింపఁ దలఁచినది గాన మకరకుండల వెనుకనుండి తన శిరస్త్రాణమును తొల

గించుచుండగా నూరకొన్నది. లేనిచో నామె కెదురొడ్డి నిల్వగల వారె వ్వరు ? మీరే ప్రమాణము గద !

సుదర్శన :- చెల్లీ ! నిన్ను చెల్లెలుగఁ బడయుటకు నేను మురియు చున్నాను. మా సునీతికి సంగతి తెలియునా ?

అనుచు నామె త్రిలోచనను కౌగలించెను. త్రిలోచన ముసి ముసి నగవులుగ "సగము తెలియును, సగము తెలియ" దనెను.

గోవిందవర్మ :- పసివానిని జేసి యాతనిపై మాయలొడ్డితివన్న మాట !

త్రిలోచన :- బావగారేమనినను చెల్లును !

సుదర్శన :- మీ తమ్ముఁడేమి నంగనాచియా ? అతఁడెంత తంత్రము నడిపినాఁడు ! నేను నాడే యంటిని గద !

గోవిందవర్మ - నిజమునకు మీయక్కా చెల్లెండ్రిరువురు దేవాం తకురాండ్రు.

సుదర్శన .-మీ యన్నాదమ్ములు కానట్లు !

నాటి రాత్రియే త్రిలోచన పల్లవి యాంధ్రములకు వచ్చిన దన్న వార్త రాజధాని య దంతట మలయ సమీరము వలె వ్యాపించెను.

— o —

# 7

శ్రావణ మాసాంతమున త్రిలోచన పల్లవీ సునీతివర్మలకు వివాహము జరిగినది. ఆంధ్ర పల్లవ రాజ్యములు రెండును నెలరోజు లుత్సవ దినములుగ పరిగణింపవలెనని నిశ్చయింపఁ బడినది. రాజ్య ద్వయము నందును, ఖడ్గయుద్ధ ప్రదర్శనములు కఱ్ఱసాములు, రథవేగముల పోటీలు, గుఱ్ఱపు పందెములు నిర్వహింపఁబడెను. విజయవాటిక యందు కృష్ణానదిలో నౌకాయానముల పోటీలు కూడ జరిగెను.

కుమారవిష్ణు మహారాజాంధ్రముల నిరువది దినము లుండి పోయెను. ఆయన తన చెల్లెలిని వీడి పోలేకుండెను. మాధవవర్మ మహారాజు నెఱపిన మర్యాదల కవధి లేకుండనున్నది. ఆడ పెళ్ళివారాంధ్రులైనట్లుగ ప్రవర్తించిరి. గోవిందవర్మ సునీతివర్మలు కుమార విష్ణువును ప్రాణబంధువుగ మన్నించిరి. దేవవర్మ ఇంద్రవర్మల మొగములందొక విధమైన యసూయ దాచుటకెంత యత్నించినను విస్పష్టముగ కాననగు చుండెను.

మలయవతీ సుభద్రలు సుగంధిమోహినులు లోలోన నుడికిపోవు చుండిరి. పల్లవ రాజులు చక్రవర్తులు. వారి యింటి యాడపడుచు నగము పల్లవ రాజ్యమున కధినేత్రియై తమ యంతిపురమున నడుగు పెట్టిన దనిన తమ కింక రాజ్యముపై నాన విల్పుకొను నవసరమే లేదని

పించినది. పల్లవరాజదుహితను గూర్చివినినవార్తలు వారలకుగుండె గాలములై కూర్చున్నవి. ఆమె రాజనీతి, యుద్ధ విద్యా ప్రావీణ్యము, అశ్వారోహణ చాతుర్యము తిరుగులేనట్లాజ్ఞలను పాలింపఁజేయు నొక సుకుమారలీలా నైపుణ్యము సర్వము ననహనీయముగ నుండెను.

సుదర్శన మాత్రము సంతసించుచున్నది. ఆమెకు తన తోడి కోడలుగా పల్లవ రాజపుత్రి వచ్చుట గర్వించ దగినదిగ నున్నది. అన్నిఁటిని మించి తన హృదయాంతరాళమున నొకానొక స్వార్థలేశ మున్నది. తనకు మహారాజ్ఞి కావలెనను ప్రబలమైన కోర్కె యున్నది. తన భర్త పట్టించుకొనఁడు త్రిలోచన సాహాయ్యముతో తానెంతటి కార్యముల నైనసాధించుకొనవచ్చును.

త్రిలోచనా సునీతివర్మల ప్రణయలీల పరమ రమణీయమైన కావ్యమువలెసాగినది. అది మనస్సునందు చెఱుగనియొక మధురగాథయై విలచినది. చంద్రావతీ మాధవవర్మలు వెదకుచున్న తీవ కాళ్ళకు తగిలి నటుల ఆడఁబోయిన తీర్థ మెదురైనటుల తాము వాంఛించుచున్న పెండ్లి కూతురుతమ సౌధమున శ్రీలక్ష్మియై యడుగుపెట్టగా పరమానంద భరితు లైరి. పినాక భట్టారకుఁడు త్రిలోచనా సునీతివర్మల దాంపత్యమునకు సంత సించుచునే కళవళ పడుచుండెను. తనలోతానేదో యూహించుకొనుచు మ్లాన వదనుఁడై మాటాడక మిన్నకుండెను. మహారాజది గమనించ లేదు.

కుమారవిష్ణు మహారాజునకు తన సోదరిని పెండ్లికూతురుగ చూచుట కానందముగ నున్నను మనస్సునందొక విషాదరేఖ తాండవించు

చునే యున్నది. జగన్మోహనములైన యామె నయనములలో లీలగ భీషణ ప్రతిజ్ఞాపాలనమునకు సంబంధించిన విశితద్యుతులు మిలమిల లాడుచు నాతని గుండెలలో నగ్నికీలల రగుల్చుచుండెను. క్రొత్త కాపురపు నవవసంత చంద్రికా యామినులలో కన్ను విప్పి శరత్ జ్యోత్స్నలలో పుష్పించి వర్షాకౌముదుల పండించు కొనవలసిన వారి యనురాగ వల్లరి వసంతములోనే వాడిపోవునా ! వెన్నెలలు విరియ వలసిన బ్రదుకున గ్రీష్మాతపము నాహ్వానించు వారి నేమనవలెను ? తాను కాంచీపురమున కేగవలయును. వీడ్కోలుగ పల్లవిని చూడఁబోయెను.

త్రిలోచనకు నయిత మన్నగారి ఎడబాటు దుస్సహముగనే యున్నది. చాల తడ విరువురు నొకరినొకరు చూచుకొనుచు నిలచి పోయిరి

తుదకు కుమారవిష్ణు విట్లనెను— "చెల్లీ ! త్రిలోచనా ! నేనై నీకుఁ జెప్పవలసినదే మున్నది ! నీకుఁ దెలియని విషయములని యున్నగదా ! అయినను అన్నగా నా చెప్పునదేమన నీవు విష్ణుకుండిన వంశమును వెలుఁగు లోనికిఁదెమ్ము విన్నిచ్చిట నెల్లరును తలపై పూవుగ మన్నించుచున్నారు. ఈ దేశమును వీడి విన్నువదలి దూరమున కరుగు నీ యన్న కోర్కెను పాలింపుము,"

కుమారవిష్ణు వామె చిబుకమును స్పృశించి యామె కన్నులలోనికి చూచుచుననెను.

త్రిలోచన నేత్రము లశ్రుసిక్తములైనవి. ఆమె కన్నులు సరోవరము నీదులాడు చిఱు చేప పిల్లలవలె చలించిపోవు చుండెను !

ఆమె గద్గదస్వరమున నిట్లనెను— „అన్నా! నీ సోదరి వాగ్దాన బంధితురాలు. కామాక్షీదేవి సాక్షి, పాలితనీయమైన పల్లవరాజ రక్తము సాక్షి, త్రిలోచనపల్లవి నిస్సహాయురాలు. ఆమె చేయగల్గున దేమియు లేదు. నా యెత్తిన పథకమే కత్తివలె తనపని పూర్తిగావించుకొనితీరును ప్రయత్నకఠినమైన నా మనస్సును మరల దిగువకుము. నాడు నేను కాంచీపురమున నేమనినాను? జ్ఞాపకమున్నదా? ఎల్లరు జీవితములు వసంత మనోహరములే యగుచో గ్రీష్మాతపము లేమి కావలె! క్షీర సాగర మథనవేళ నచ్చరలను, యుచ్చైశ్శ్రవమును, ఐరావతమును శచీ నాథుఁడు గైకొన నేల? శ్రీమహాలక్ష్మిని విష్ణుదేవుఁడు స్వీకరింప నేల? మహాదేవుఁడు హాలాహలమును గ్రహింపనేల? అన్నా! మనము శైవు లము. రుద్రదేవుఁడు లయకారకుడు. ఆయన మార్గమే మన కనుసర ణీయ మగుగాక! న న్నాశీర్వదించుము!"

త్రిలోచన పల్లవి గాద్గద్యము నణచుకొనుచు కనుల నీరు కొన గోట మీటుచు సన్నగారి పాదముల నంటి నమస్కరించెను.

కుమారవిష్ణువు మనస్సులో క్రుంగి పోయెను. "నేను నిన్నేమని యాశీర్వదించ వలె నమ్మా! కడిపెడు బిడ్డలఁగని వంశకర్త్రివి కమ్మం దునా? పుట్టినింటికి మెట్టినింటికి కీర్తిఁ దెమ్మందునా? నీ వంశము చిర స్థాయిగ రాజ్యపాలనము సేయు నట్లాశీర్వదింతునా? ఏమనగలను? నా హృదయము పగిలిపోవుచున్నది. కామాక్షీదేవియే మనకురక్ష! ఆ మహా జననియే నిన్నుపాలించవలయును, వేరుదిక్కులేదు. పాపమాసునీతివర్మకు నీవు పగబట్టిన పాపపడుచువని తెలియదు! పోనిమ్ము. నీ మనస్సును కష్టపెట్టుట నాకు బాధగనుండును. నీ సంగతులు నా కెప్పటి కప్పుడు

తెలియఁజేయు చుండుము. అన్ననై నేను వాంఛింపఁ దగిన దింతకు మించి యేమి గలదు !"

కుమారవిష్ణువు చెల్లెలిని లేవదీసి కన్నులొత్తుకొనుచు— "అమ్మా! అల్లుండ్ర కోడండ్ర నడుగలేసుగద! నీ కెంతలోచిన నంతియేకద! కానిమ్ము. పదికాలములపాటు నీవైన సురక్షితముగనున్న నదియేచాలును నందిక నీతోపా టిచ్చటనే యుండి పోవును. నేనిఁక పోయివచ్చెదను." అనెను.

కుమారవిష్ణువు చెల్లెలిని వదలలేక వదలలేక యెట్లో వెడలిపోయెను

వివాహ మహోత్సవములు ముగిసి మరల రాజధాని యథా పూర్వముగ నుండెను, ఉత్సవఁపు టుద్ధృతి తగ్గినవెంటనే ప్రజానీకము నందు మఱల నొక క్రొత్త ప్రశ్న యుదయించినది. ఆయువవీరు లెచ్చటను కన్పించుటయే లేదు అన్ని విద్యాప్రదర్శనములు జరుగగా జగజెట్టీలయిన వారిరువురు ఒక్క యంశమునందైన పాల్గొనలేదు. వారే మైనట్లు? ఆశ్చర్యముగ నున్నది. కొలది కాలము లోనే తారాచువ్వల వలె నాకసమున కెగసిన వారిట్లు మటుమాయమైనారేమి? ఇదంతయు జటిల సమస్యయై రాజధానియందు ప్రధాన చర్చనీయాంశమై పోయినది. ఏ చతుష్పథమునఁ జూచినను ప్రజలు గుంపులు గుంపులుగ గుమిగూడి యీ విషయచర్చఁజేయుచు కన్పింతురు।

అచ్చటచ్చట రాజరహస్య మన్నంత సన్నగ నావీరులలో నొకరు త్రిలోచన పల్లవియని చెప్పికొనుట, జను లెల్లరు విస్వెరపోవుట! ఆమె యెంతటి సాహసి! చాల నుద్దండురాలివలె నున్నది. పల్లవరాజ దుహిత! తానే రాజ్యమును వశమొనర్చుకొను నేమో! స్త్రీయయ్యు నామె యెంతటి

పౌరుషమును వెలపినది! పల్లవరాజ సంతానము కావుననే యంతఁ ఖడ్గవిద్యానిష్ణాత్రియైనది! ఏది యెట్లయినను సునీతివర్మ చాల యదృష్టవంతుఁడు. పలురకములైన మీమాంసలు వ్యాఖ్యలు గుసగుసలుగ వెలవడుచున్నవి.

అది యట్లుండ నంతిపురమున త్రిలోచన పల్లవి తన సౌధమునం దుపవిష్టయై భవిష్యమున తాను నిర్వహింపవలసిన తంత్రమెట్లుండవలెనని యోజించుకొనుచుండెను అన్నగారు వెళ్ళిన నాటినుండి ఆమె మనస్సునందు బాధఁజెందుచునే యున్నది. తన యన్న తన్నుకుమార్తెనువలె ప్రేమించెను. లోకమునం దందరు సోదరులు, తండ్రులవలె నాతఁడు సైతము తనసౌఖ్యము నాసచేసెను. తన సంసారము తామర తంపరగ విలసిల్లవలెనని వాంఛించెను. సహజమే కాని యది పొనగించుటకు తాననుకూలురాలు కాదు. తన తాతగారి కొసఁగిన వాగ్దానమును నెరవేర్చిన గాని తాను పితృఋణము నుండి విముక్తురాలు కాదు. తాను పగ సాధించవలదా? అఖండమైన యీ సృష్టిలో నెందఱు స్త్రీలు సంతానవంతులై యానందించుటలేదు? తా నొకర్తుక సంతానమును బడయనిచో వచ్చిన ప్రమాద మేమున్నది!

ద్రుపదరాజ నందన యైదుగురు భర్తలఁ గట్టుకొని సంతానవతియైకూడ లేనిదానివలె నైనది. ఆమెకు వచ్చిన యాపద యేమున్నది? తాను తన ప్రతిజ్ఞా నిర్వహణములో గత్యంతరము లేక వివాహమాడినది కానిచో తా నవివాహితగనే విలచిపోయెడిది! యువరాజా గోవిందవర్మను తానేమిగనో భావించినది. కాని యాతడు గొప్ప యాశ్వికుఁడు, రథచోదకుఁడును అయన యశ్వారోహణ మొనర్చుచో కన్నుమూసి తెఱచునంతలో నదృశ్యుఁడగును. అయన రథవేగ మవితర సాధ్యము. ఆనాటి

నలమహారాజును తలపించును. ఆయన త్వరపడి యెట్టివవిని చేయడు. వివాహోత్సవ సందర్భమున జరిగిన ప్రదర్శనములలో నీ విద్య నాయన యనితరముగాఁ జూపెట్టును. అందరు నాశ్చర్యము జెందిరి.

సుదర్శన తన్నంటిపెట్టుకొని తిరుగును. చెల్లీ! చెల్లీ! యని సంబోధించుచు ననన్యమైన ప్రేమను విరియించును. ఆమె అమోఘమైన లోకజ్ఞత కలది. తొలి ప్రదర్శమునందే తనను పట్టివేసినది. ఆమె విషయమున నత్యంత జాగరూకతతో మెలగవలసి యున్నది. తా నామెతో సాన్నిహిత్యమును పెంచుకొనవలెను. బావగార్లయిన ఇంద్రవర్మ దేవవర్మలు, సుగంధి మోహినులు, మలయవతీ సుభద్రలు తన్ను వారి వారి నగరములకు రావలసినదిగ ప్రత్యేక ప్రత్యేకముగ కోరిరి. ఒకసారి వెళ్ళి వచ్చిననే బాగుండును.

అచ్చటచ్చటి పరిస్థితులన్నియు తనకు తెలిసినవయ్యు కొంత విశదముగ నాకళింపు జేసికొనవచ్చును. నాడు తాము పురుషవేషములలో నా నగరముల కరిగినప్పుడు వారివారి చిత్తవృత్తులను సాకల్యముగ గ్రహించియే యున్నను, అంతఃపుర రహస్యములను స్పష్టముగ దెలిసికొనవలసి యున్నది! రాజ్యమునందు తిరుగుబాటు లెచ్చటెచ్చట లేవఁదీయుటకు వీలగునో చూడవలసియున్నది. అంతఃకలహముల రేకెత్తించవలయును. అంతి పురముల గృహకల్లోలముల సృజింపవలెను. రాజకుమారుల మనస్సులం దనుమాన పిశాచములఁ బ్రవేశపెట్టవలెను; తన పిన్నయత్తగార్లలో మాత్సర్యమును ప్రోదిసేయవలెను.

చంద్రావతీదేవి వెన్నెలముద్ద! అమె యీ లోకమునకు సంబంధించినదే కాదు. సుదర్శననుమాత్రము గుప్పిటిలో నుంచుకొనవలయును

మాధవవర్మ మహారాజును వశ మొనర్చుకొనవలెను. ఆయనను మర్యాదా స్రోతస్వినులలో నోలలాడించవలె. ఆ పినాకభట్టారకునిమాత్ర మేమఱక నొక కంట కనిపెట్టి యుండవలె! నందిరను దేశము మీదకు వదల వల యును. కాంచీపురము నుండి తనవెంట నరణముగ వచ్చిన పరివార మున్నది. వారందఱను గూఢచారులుగ రాజ్యమున నలుమూలల ప్రవేశ పెట్టవలయును.

కార్యభార మెంతేని యున్నది. తాతగారియొద్ద నొనర్చిన ప్రతిజ్ఞను పాలించినచో, నటుపై నసువుల వీడినను నష్టములేదు. తానొక కార్య సాధనకై జీవితమును ధారవోయుటకు నిశ్చయించు కొన్నప్పుడు దానిని నిర్వహించుటలో నెట్టి సడకలైన నడువవలసినదేగద! అచ్చట నిఁక భర్త, మామ, అత్తయను నీ మర్యాదలుండవు. పరశురాముఁడు పితృాజ్ఞా పరిపాలనమునకై మాతృదేవి కంఠము నుత్తరించలేదా! విష్ణుకుండిన వంశమును గూకటివేళ్ళతో పెల్లగించి వేయుటకుఁ దగిన తంత్రముల నెన్నిఁటినైన ప్రయోగించ వలసినదే! మాధవవర్మ తరువాత నిఁక నా వంశములేదు! రాజులేఁడు! ఇది నిశ్చయము.

త్రిలోచన యిట్లాలోచించు చుండగనే సుదర్శనాదేవి వచ్చినదని ప్రతీహారిణి తెలియజేసినది. త్రిలోచన సంభ్రమమున లేచి యామె కెదు రేగి నమస్కరించి యామె కరమును కరమున గీలించి యామెను తోడి తెచ్చి పర్యంకముపై నాసీనను గావించెను.

త్రిలోచనా మందిరమును చూడగనే సుదర్శనకనులకు మిరుమిట్లొ దవినవి మందిరమంతయు పరమ రమణీయ శిల్పఖండము వలె నలం

కృతమై యుండెను కుమారవిష్ణు మహారాజు పంపిన యమూల్యములైన బహుమతులను చూచుటకు కనుప్రేగై తోచెను!

త్రిలోచనపల్లవి చక్రవర్తి తనూజ. స్వయముగ నామె సామ్రాజ్యాధికారిణి! పల్లవరాజ వైభవమున శిల్పప్రియత్వమున కవధి లేదు. ఆ మందిరమున నామె సాక్షాత్తు త్రిలోచనయై పార్వతీదేవివలె దర్శన మొసఁగెను. కుమార విష్ణువు త్రిలోచన యారాధించు కామాక్షీ దివ్య మంగళ విగ్రహమును తలలించుకొని వచ్చి యామెమందిరమున స్థాపించెను. దానిని చూడగనే సుదర్శనకు తన యత్తగారి మందిరమున నున్న మహాదేవుని దర్శన మట్లనిపించినది!

త్రిలోచన తోడికోడలైనందుకు సుదర్శన మిగుల నానందించినది. వివాహమై మూఁడు నెలలు గడచినవి. త్రిలోచన సుదర్శన సౌధమునకు పోలేదు. సుదర్శనయే రెండు మూఁడు పర్యాయములువచ్చినది. నే డామె త్రిలోచన నాహ్వానించుటకు వచ్చినది!

ఇంతకాలముగ సుదర్శన మనసు నందొక కోరిక బలీయముగ నున్నది. కాని యామె దానిని వెలువరించ లేదు. నేడు దానిని త్రిలోచనకు చెప్పుటకే సంకల్పించినది. వల్లవిని చూచిన మీఁదట తనకుఁగూడ ఖడ్గవిద్య నభ్యసించ వలె ననిపించినది. మకరకుండల నడుగగా నామె — అమ్మా! మీ తోడికోడలు త్రిలోచనాదేవిగా రున్నారు. ఆమెకు మీ యెడల చాల గౌరవభావమున్నది. ఆమె మీకు నేర్పవచ్చునుగద! నిజమున కామె విద్యముందు నాదేమి విద్య! ఏదో పెట్టి కోపముతో నా మగని నోడించెనన్న యవమానమును దీర్చుకొందమని నెలదినములు రేబవళ్లు నిద్రాహారములు వర్జించి చచ్చి చేయంగల విన్నపములై

యప్పటికామె చేతిలో పూచిన కింశుకము నయితిని। ఆమె పులుగడిగిన ముత్యమువలె స్వచ్ఛముగ నుండిపోయెను. తుదకు నేను దొంగచాటుగ నామె శిరస్త్రాణమును తొలగించితిని. ఆమె కేమాత్రము తెలిసినను నేనీ వేళ తమతో మాట్లాడు చుండెడిదానను కాను: త్రిలోచనపల్లవీ దేవి నన్ను ముక్కలు చేసిపెట్టెడిది !" అనెను.

సుదర్శన నవ్వి — "మకర కుండలా ! అంత చదివెద వేలనే ; త్రిలోచనాదేవి ప్రతిభావిశేషము నాఁకు దెలియనిదా ? నీవేదో దొంగగ నామె శిరస్త్రాణమును వక్షః కవచమును తొలగించితి ననుకొనుచున్నావు! అదియామెకుఁ దెలియ దనుకొను చున్నావు. అది సత్యమైన విష యము కాదు. ఆమె తా నెట్లును బయల్పడ దలఁచుకొనినది, అందుచే నెఱిఁగి యుండియు మెదలకుండ నుండిపోయినది। లేనిచో నామెయంతటి ఖడ్గవిద్యావిశారద నీవట్లొనర్చిన నూరకుండెడిదా సరి। పోనిమ్ము నీవన్నట్లామెనే యడిగి యామె యొద్దనే నేర్చుకుందును' అనినది.

సుదర్శన రాకకు కారణము తెలియవలెనని త్రిలోచన యామెతో — "అక్కగారు నేడీ చెల్లెలి ననుగ్రహించినారు।" అనెను.

"అదియేమి ? అంతమాటనవలదు. చెల్లీ ! నిన్నుఁ జూచినదాది నాకు నీవు చెల్లెలివవిపించినది. అందుకు తగినట్లు తోడికోడలువై చెల్లెలి వైనావు ! నాకొక కోర్కెయున్నది."

"ఏమది ? ఆంధ్రసామ్రాజ్య యువరాజ్ఞికి తీరనికోర్కెలున్నవా"

"ఎంతటి వారికైన కోర్కెలుండుట సహజము. నిత్యము పర మాన్నమారగించు వానికి నీరు మజ్జిగపైన మనసు పోవును. గంజిత్రాగు వాతనికి రాజాన్నముపై వాంఛ! కనుక నీ వాంఛలు చమత్కారములుగ నుండును, అవి జీవిని పట్టి పల్లార్చును. నీకు లేనిది నీకు కావలె నని పించును. అటులే నాకురాని ఖడ్గవిద్యపై మనస్సు పోయినది. మీ బావ గారు సైత మంగీకరించినారు ఆయన మొదట ఖడ్గవిద్యా విముఖుఁడు. ఈవిద్యను తిలికికచినపిమ్మట నాయనకుఁగూడ ఓనిపై శ్రద్ధ యేర్పడినది?

"బావగారిఁ దెలియక పోవుటేమి? నాడు మీ జన్మదినోత్సవ మున మేము ప్రదర్శన మిచ్చుచున్నంత సేపు నేహోరీయ్యలు వివరించుచునే యుండిరి."

"శాస్త్రము నాయన క్షుణ్ణముగ నభ్యసించినారు శాస్త్రముతెలియుట వేరు, ప్రయోగకౌశలము వేరు. చూడుము చెల్లీ! వేదపండితు లున్నారు. ఆ వేదపండితుల కేమి తెలియును? వేదమును వల్లించి కంఠస్థమొనర్చు కొని యొప్పఁజెప్పుదురు. ఆ వేదపంక్తులను వివరించి యర్థముఁ జెప్పుఁ డనిన నేమి చేయఁగలరు! అట్లే మీ బావగారు చదువుకొనినారు. ప్రయోగప్రసక్తి లేదు."

"అదేమక్కగారూ! మొన్నఁ గల్యాణోత్సవములందు చూచితివి గద! ఆయన రథము నెంత వేగముగ నడపెదరు! అది యటులుంచి అందరికన్ని విద్యలందుఁ బ్రావీణ్యమలవడుట సాధ్యమా? 'న సర్వః సర్వం జానాతి' మొదట వాంఛ యను నదుండవలయును."

"నీవన్నది నిజమే: ఆయన నన్నుద్వాహమాడిన దట్టిరథచోదక ప్రావీణ్యము వల్లనేకద! మారాజ్యమున నేఁటేట రథాశ్వ గమన వేగము

లందు పరీక్షలు జరిగెడివి. పలువురు రాజకుమారులందు పాల్గొనెడివారు ఆంధ్రరాకుమారుఁడు వచ్చుట పందెమున నెగ్గుట మానాయన గారాయః రథవేగ చాలనమునకు మోహపడి నన్నిచ్చి యుద్వాహ మొనర్చుట జరిగెను. రథ చోదకమునం దాయనను మించిన వేగరి వేరొక్కఁడులేఁడు. ఆయన యశ్వారోహణము నందు సైతము అంతటి చాతుర్యము గలవాఁడే! కాని యుద్ధము, ఖడ్గము, బాణము, యీమాటలకాయన హృదయ కోశమున నర్థములు లిఖింపఁబడలేదు. మొన్న నీ ద్వంద్వయుద్ధ ప్రదర్శనముఁ జూచినప్పటి నుండియు తాముగూడ నీవంటి ఖడ్గవిద్యా విశారదుఁడు కావలెననిపించినదఁట! నాతో ననినారు —

'సుదర్శనా! మీ చెల్లెలు త్రిలోచన వల్లవి కత్తియుద్ధమును నాకుఁగూడ నేర్పు నేమో కనుగొందువా?" యని.

"అదేమి మకరకుండల యున్నది గద! దాని మగఁడు — అంత యెందులకు? తమ సోదరులున్నారు గద!"

"మకర కుండలయు, దాని భర్తయు మన పరిచారక వర్గములోనివారు. వారినుండి యువరాజు నేర్చుకొనుట హాస్యాస్పదముగ నుండును!"

"మరి బావగారికి నేను నేర్పుటెట్లు?

"అయిన నేమి చేయవలయును?'

"ఒక పనిచేసిన బాగుండునను కొందును. నేను నీకు నేర్పెదను. నీవు బావగారికి నేర్పుము. నీకు సాధనయగును, ఆయన నేర్చుకొనుటయు జరుగును."

"ఇది బాగుగనే యున్నది. అట్లే చేయవచ్చును."

"కాని, యిందొక విశేషమున్నది. నాకు విద్యనేర్పిన గురు ...క కట్టడి చేసెను :

"ఏమది ?"

"ఈవిద్య నభ్యసించువారు బోధించువారికి సర్వాత్మనా శిష్యులు కావలయును. వారికి వశంవదులై యుండవలయును. వారే సర్వస్వ మనుకొనవలెను. లేనిచో నీ విద్య ఫలించదు. నేర్పనేరాదు !"

"నీవు గురువు వగుట నాకెంత సంతోషమో తెలియునా ! నీనియమముల విధిగ నంగీకరింతును."

"అటులైన తప్పక నేర్పెదను."

"చెల్లీ ! నీవు వెనుకటి జన్మమున నచ్చముగ నా చెల్లెలివే యై యుందువు. లేనిచో నే నడిగినంతలో నిటనుమోదింతువా ?"

"నేర్చిన విద్యను పలువురకు నేర్పుటయే కావలసినది ! నేన మీకు తప్పక నేర్పెదను. మీరు బావగారికి నేర్పుఁడు. కాబోవు మహ రాజు ! ఆయన యెంతటి ఖడ్గవిద్యా విశారదులై యుండవలసినది !"

"నీకు తెలియదు. ఆయన గొప్ప సాహసికుఁడు. ఆయన సాహసపు వడక లాయన కాపదలకు హేతు వగునేమో ! నాకు దిగులుగ నుం డును. నే నెంతగనో బ్రతిమాలుచుందును. ఆయన పెడచెవి ని... ...."

"సాహసము క్షత్రియులకు గాక వేరెవరికుండును ? బావగారెవ్వ డైన యుద్ధరంగమున కేగినారా ?''

"లేదు మామగారు, చిన్నవారని తామే యేగెదరు. దేవవర్మ ఇంద్రవర్మలెపుడైన పాల్గొనుట కద్దు, అయిన నేమంత మహా యుద్ధ ములు వచ్చినవని !"

"పోనిండు. యీ మారేమైన యుద్ధములు సంప్రాప్తమగుచో మామగారి వెంట బావగారిని పంపుదము.''

"అటులనే !"

ఇరువురును చాల ప్రొద్దు సంభాషణలో గడపిరి. సుదర్శన త్రిలోచనను తమ సౌధమునకు రావలసినదిగ నాహ్వానించి వెడలి పోయెను.

సంజ చీకట్లు ముసురుకొను చున్నవి. తేనెటీగల గుంపులు వోవి య్యాలోచనా పరంపరలు త్రిలోచన మనస్సున నుద్భూతము లగుచున్నవి. "యువరాజునకు ఖడ్గవిద్యపై మనసుపోయినదా ! సుదర్శనకు తాను నేర్పవలెనా ? ఆకస్మికముగ వారికీ విద్యయందింత మమకారమేల కల్గి నదో , సుదర్శన తన చేతిలోఁ జిక్కినది. ఆమెతో పాటే యువరాజును! త్రిలోచన ప్రజ్ఞ యిఁక దీపించవలె ! మారువేషముతో ధాన్యకటకమున కేగిన నందిక ్షయింకను తిరిగిరాలేదు. ఇందఱు కుమారులుండి మాధవ వర్మ మహారాజు నట్టింట పసిపాప పాఱాడిన జాడలేదు. కార్తాంతికుల నుడువులను బట్టి మాధవవర్మ మహారాజు తదనంతరము మరలనంతటి వాడీ వంశమున జన్మించడు. మహారాజెంతటి ప్రేమ హృద

యుఁడు ! తాను సూత్న వధువుగ నాయనకు పాదాభివందన మొనర్చు నప్పుడాయన యేమనివారు ! "అమ్మా ! త్రిలోచనా ! నీవు మా పుత్ర వధువవగుట పరమాదృష్టముగ భావించుచున్నాము. ఆంధ్ర పల్లవ రాజ్యములు వియ్యమందినవన దక్షిణాపథమంతయు నొక్క గొడుగు క్రిందకు వచ్చినట్లు, ఆ కీర్తి నీకుఁ దక్కనది తల్లీ !

ఇంత చిన్నతనముననే నీ యందింతటి విద్య ప్రకాశించినది ! నీ రహస్య గోపనశక్తి పరమాశ్చర్యకరమయినది. నీ విన్ని నాళ్ళు పురుషవేషమున మన రాజ్యమున కొలువున నుండి విద్యాప్రదర్శనముల నిచ్చుచుండ నేరును గుర్తించలేదు ! అట్టి సామర్థ్యము రాచపుట్టువులకు ప్రధానముగ కావలసినది ! అది నీ యందు సమృద్ధిగ నున్నది. నేను చాల సంతసించుచున్నాను. మా సునీతివర్మ ధన్యుఁడు. సాహసము, సౌందర్యము, సామర్థ్యము సంపదలతో సాక్షాత్ లక్ష్మీదేవి వానిని వరించి ప్రాంగణమున నిలచినది ! నీవు వేయేండ్లు వర్థిల్లుము తల్లీ !" యని యాశీర్వదించినారు. తదుపరి తానాయన నెప్పుడు దర్శించఁబోయిన నంతటి వాత్సల్యముతోనే సంభావించును! అత్తగారిఁక చెప్పనక్కఱయే లేదు ! లౌకికముగ తానదృష్టవంతురాలు !

తానై మలఁచి కొనిన తన భాగధేయము నందలి వక్రత కెవరు బాధ్యులు ! తన భర్త తన కనుసన్నల వర్తించును. అమృత హృదయుఁడాయన. అమాయకుఁడు. ఒక్కొక్క వేళ నాయనను చూచినప్పుడు తనకు జాలి దుఃఖము కలుగుచుండును. ఆతఁడేవో భవిష్యన్మహా వాంఛావలయముల సృష్టించుకొనును. తమకుఁ గలుగఁబోవు బిడ్డల యభివృద్ధి, వారల విద్యా వ్యాసంగములఁ గూర్చి యెవేవో మాట్లాడును. కలలు గనుచుండును.

అతఁడిట్లనును — "చారులోచనా ! నీవు నా కంటికి నిజముగ చారులోచనవై కన్పింతువు. నీవు చారులోచను డుగ మోహపెట్టిన వీ నీ లోచనములు !"

"అవును. మీకు చారులోచననే గాని నేను మాత్రము త్రిలోచనను! నా త్రిలోచనాత్వము మీకుఁ దెలియదు."

"పోనిమ్మది నా కక్కఱరేదు."

"మీరెల్లప్పుడు మనకుఁ గలుగఁబోవు సంతానమును గూర్చి భావింతురేమి ?"

"నీకు జనించఁబోవు సంతానమెంత సుందరముగ నుండునో త్వరితముగఁ జూడవలెనని నా యాకాంక్ష !"

"నీ నా బిడ్డఁడు రాజగునా ! రాజ్యమేలునా !"

"ఏలునేమో యెవరు చూచిరి ?"

"సుదర్శనా యువరాజుల సంతానము భవిష్యత్సింహాసనార్హమగును. కాని మన సంతానము కాదుగద !"

"అయిన నీకు పైతృకమైన రాజ్యమున్నది గద !"

"నా సంతానమునకు పైతృకమైన రాజ్యము రానేరదు "

''వారిని రానిమ్ము. వారే రాజ్యము నేలెదరేమో ఎవరుచూచిరి

''మనమే చూచుచున్నాము !"

"నీ వంటి వీరనారీమణి జనయిత్రియైన వారు మహారాజ్యాధినేత కాఁగలరు.

తలఁచుకొనినచో నీవీ భూవలయము నంతను వారికిఁ గట్టపెట్టఁ గలవు !"

"నా కంతటి శక్తి యున్నదా ? పోనిం డిప్పుడా ప్రసక్తి యెందులకు ?''

వారిరువురి సంభాషణ లిట్లు పర్యవసించును.

రాజధాని యందొక యలజడి చెలరేగినది. ఆ యువ వీరు లేమైనారో తెలియుటలేదు. అచ్చటచ్చట రహస్యముగ వారే త్రిలోచనా నందికలని గూడ చెప్పుకొన దొడఁగిరి. రాజధాని యందంతట క్రమముగ నీ విషయము వెల్లడియై గుబ్బినలు వోయిరి. లోకమున నెచ్చటనైన నిట్టి వింత యుండునా ! రాజకుమారి తానై వచ్చి వలచిన వానిఁ బెండిలి యాడునా ! ఎంతటి సాహసము ! ఇంతటి ధీరురాలు ముమ్ముందేమి యొనర్చునో ! ప్రజలు పలు పలు రీతులుగ నూహలు సేయఁ జొచ్చిరి.

నందిక ధాన్యకటకము నుండి తట్టెడు వార్తలు మోసికొని మరీ వచ్చినది ! అన్నిఁటిలో ముఖ్యమైనది మలయవతీదేవి కోడలు సుగంధి

గర్భవతి యైనదఁట ! తన కోఁడలికి జనింపఁబోవు కుమారుఁడు భవిష్య దాంధ్ర సామ్రాజ్యాధినేత యగునని యామె కలలు గనుచున్నది! దానితో విఁక విష్ణుకుండిన పురమున సుభద్రాదేవి చిందులు ద్రొక్కుచున్నదఁట !

అధికారులు విలాసబుద్ధులై భోగపరాయణులై ప్రజల సౌకర్య ముల నవలోకించక పోవుటచే విసిగివేసారిన ప్రజాసందోహమునుండి విప్లవకారులు వృద్ధిఁజెంది రాజ్యఁపు పెల్లల యం దలజడులు లేవదీయు చున్నారఁట. ఇంద్రవర్మ దేవవర్మ లేమియు పట్టించుకొనలేదు! ప్రజ లెల్లరుఁజేరి మాధవవర్మ మహారాజునకు వినతిపత్రము పంపెదరు !

ఇది ఇట్లుండ ధాన్యకటకము పదిగవ్యూతుల దూరముననున్న యొక పాళెగాడు ప్రభుత్వము నెదిరించి సామంతుఁడుగ నుండుట కిచ్ఛ గింపక యుద్ధమునకు సన్నద్ధుఁడగు చున్నాడఁట ! ఇవి ముఖ్యమైనవి."

"నీవు వెళ్ళి నిర్వహించిన కార్యము లేమి" త్రిలోచన ప్రశ్నిం చెను.

"మలయవతీ సుభద్రల మధ్య చిచ్చు ముట్టించితిని. మోహిని సుగంధి సౌభాగ్యమునకు హారున నేడ్చుచున్నది ! నేను కోయతనై రహస్యముగ నామె కోరికపై యామెకు మూలికలనిచ్చి చేతనైనచో నా మూలికల నరగదీసి నీటఁ గలిపి పానీయముగ సుగంధి కిచ్చుచో నీకు మనశ్శాంతి కలుగునని చెప్పితిని. ఆమె సంతోషముతో స్వీకరిం చినది. సుభద్ర క్రుంగిపోవుచున్నది. మలయవతి కురవంజినై నన్ను పిలిచి 'ఓసీ ! జన్మలో గర్భము రాకుండ వంధ్యగ విలచిపోవుటకేమైన మూలికలున్నవటే !' యని యడిగినది. నేను వెంటనే మీరు నా కొసఁ

గిన యా మూలిక నామె కిచ్చి పాలలో సేవింపఁజేసిన మీ కోర్కె ఫలించునంటిని. ఆమె దానిని మహాప్రసాదముగ స్వీకరించి నాకు వేయి దీనారములు, పట్టుచీర నొసఁగినది. ఆమె దానిని మోహినీ సుదర్శన లపై బ్రయోగించునఁట! దీనితో తన మనుమఁడిఁక రాజ్యమునకు ఉత్తరాధికారి యగునఁట!"

"బాగున్నది. నిప్పురాజు కొనుచున్నది; కానిమ్ము. యువరాజ్ఞి సుదర్శనాదేవి నా యొద్ద ఖడ్గ ప్రక్రియల నభ్యసించుచున్నది. ఆమె నుండి యువరాజు నేర్చుకొను చున్నాఁడు."

"మన పుళిందులముఠా యేమి చేయుచున్నది?"

"కొలది మాసములలో నొక యుద్ధము రానున్నది!"

"సంతోషము! అన్నగారినుండి వర్తమానము లేమైన వచ్చినవా?"

"వారము దినముల క్రిందట అన్నకాన్కలఁ బంపుచు వార్తలు తెలియఁజేసినాడు. నాకు మేనల్లుఁడు కల్గినాడఁట!"

"శుభమైన వార్తలు వినిపించితిరి. చాల సంతోషముగ నున్నది."

"నందీ! నీవు తిరిగి వెంటనే దేశాటనమునకు సిద్ధపడగలవా?"

"నా జన్మ కంతకంటె వింకొక పని యేమున్నది?"

"అవునే, పాపము నా మూలమున నీవు నీ బ్రతుకంతయు నడవిఁ గాచిన వెన్నెలఁ జేసికొనుచున్నావు."

"ఎంత మాటని నారు ! మీ బ్రదుకున వెన్నెలలు విరిసి యున్నవా యేమి ? మీ గుండెలో నెన్ని యగ్ని పర్వతములు బ్రద్దలగు చున్నవో నాకుఁ దెలియదందురా ! నా కెట్టి చింతయు లేదు మీ కట్లు కాదు గద ! ప్రియతమమైన భార్యగ, అణకువగల కోడలుగ, స్నేహ శీలమైన తోడికోడలుగ, వినయవతియైన మఱదలుగ ఎన్ని విధములుగ నటించవలెనమ్మా ! మీరు నిజముగ దేవి త్రిలోచనయే ! ఒక కంట నమృతమును చిందించుచు రాజకుటుంబమును జ్యోత్స్నా తరంగముల నోలలాడించుచున్నారు. వేఱొకకంట విషాగ్నికీలలఁ జిమ్ముచు కల్లోల తరంగముల ముసుకలెత్తించు చున్నారు. చివరకు మూడవకన్ను దెఱచి సర్వము భస్మసాత్కృతము చేయనున్నారు !"

"నందీ ! నా మనస్సు సంక్షోభించుచున్నది. నా భర్తను నేను మొదట నా ప్రతిజ్ఞాపాలన యందొక సాధనముగ పరిగణించితిని. కాని, ఆయన సత్ప్రవర్తనము నిర్మలానురాగము నన్ను మైమరపింపఁ జేయు చున్నవి. భర్తగ నాయనకు కొన్ని కోరికలుండవచ్చును గద ! నేను వానిని దీర్చుటకు సంసిద్ధురాలను గాను. ఆయనకు సంతానమనిన ముద్దు; నేను గంగాదేవినైతిని ! నందీ ! ఈ ద్వివిధమైన జీవితమును గడుపుట భారముగ నున్నది. రాజకుటుంబమున నన్నందరు న ల్లారుముద్దుగఁ జూచుకొందురు అత్తమామలు క్రింద కాలిడిన నరిగిపోవుదునన్నంత ప్రేమగఁ జూతురు, సుదర్శన నన్ను స్వీయసోదరి కన్న నెక్కుడుగ మన్నించును. క్రొత్తగ గురువుకూడనైతిని గద !"

"నిజమేనమ్మా ! మీరు మనసావడు వేదన దుర్భరము."

"నందీ! నేను నీకు వినా నాబాధ నెవరితో చెప్పను ! నేనుభర్త్రు పరిష్వంగమున రహోవిస్రబ్ధనై మైమరచి యానందవార్ధిలో మధుర

కల్పనలలో తేలిపోవుచు నరమోడ్పు కనులతో సోలిపోవు సమయములఁ దాతగారి కంఠధ్వని శ్రవణ గోచరమగును. ఆయన రూపము మూర్తి కట్టి కన్పించి — "తల్లీ, పల్లవీ ! నీవు నీ సుఖమును చూచుకొను చున్నావు. నీ పితామహుని కిచ్చిన వాగ్దానమును విస్మరించితివా ? నా యాసలఁ నడియాసల జేయుదువా ? పల్లవ రాజరక్తమును కలుషితము చేయ నన్నావు." అనినట్లు వినిపించును.

నేను హఠాత్తుగ నుల్కిపడి లేచి స్నానమొనర్చి దేవిని శరణు వేడఁ బోవుదును. నా భర్త కళవళపడును. ఒకొక్కప్పుడు కోపగించును. నేనేమని చెప్పను ? నా బాధ నెవ్వరికిఁ దెలియఁ జేయుదును. మనసా నరకము ననుభవించుచున్నాను."

"అమ్మా ! మీరు గరళమును మ్రింగుచు నమృతమును వర్షించు చున్నారు."

"కానిమ్మ, ఆ విషయముల కేమి ? మన ముందు కర్తవ్యము నాలోచించవలెను. నీవు విశ్రాంతి తీసికొమ్మ."

నందినియట్లేయని వెడలిపోయెను.

"త్రిలోచన కాలోచనలతో తల తిరిగి పోవుచుండెను. దైవము వ్యక్తులను సృజించునప్పుడు రకరకములుగ వారి భాగ ధేయములను దీర్చిపెట్టియే పంపును కాబోలు ! చక్రవర్తి కుమార్తెయై మహారాజు కోడలై యనంత వైభవ సంపన్నయై మనస్సుచే నతిదీనురాలు గావలసిన స్థితియేమి ? ఎక్కడి పల్లవ రాజవంశము ! ఎక్కడి విష్ణుకుండిన రాజవంశము ! ఈ రెండువంశముల కలయిక ప్రళయమున కగుటయేమి ?

మహాదేవుని లీలలద్భుతములు. దేవి తన్నిట్లు చేసినది. దైవము తనపితామహుఁడైన కుమారవిష్ణువునందు సమాహితుఁడై తన్ను వంచించినాఁడు. దైవ నిర్ణయమట్లుండ మానవ ప్రయత్నము లనుకూలించునా!

త్రిలోచన పల్లవి చరిత్రలో స్థిరమై నిల్వఁగలదగు కార్తాంతికుల నుడువు లిట్లు పరిణమించినవి. అవును. త్రిలోచన స్వీయ వంశనాశనిగ నయవంచకురాలుగ మహారాజ నీతివేత్రిగ నిలచిపోవును.

ఆమెకు దుఃఖము ముంచుకొనివచ్చెను. 'తేనవినా తృణమపి న చలతి!' శివునాజ్ఞలేనిదే చీమయైనఁ గుట్టదఁట! నేను నీ యాజ్ఞఁ బడియేగద నీ పనులు చేయుచున్నది! సర్వజీవుల హృదయాంతర దీపమవైన నీవు నా హృదయమందిరమున లేవా? ఉండినచో నా పాప పుణ్యములు నీ యవియే! ఈ త్రిలోచన నీచే నిర్వహింపఁబడుచున్న నీ మహాధ్వరమునఁబడి చనుచున్నది. నీవేమి చేసినఁ దృప్తిగ స్వీకరించును. మహాదేవా! నాయందు కార్కశ్యమును నింపుము. నా మనస్సును ప్రిదుల నీయకుము. చేసెడి పని యెట్టిదైనను పరిపూర్ణతఁ జెందింపుము.''

— ౧

# 8

వసంతము రాగమూర్తియై వచ్చినది. ఏయెడఁ జూచినను ప్రకృతి యంతయు నవనవ శోభలతో నేత్ర పర్వముగ నున్నది. సుదర్శనా గోవింధవర్మలు ఖడ్గవిద్య యందారితేరినారనియే చెప్పవచ్చును. గోవింద వర్మకు త్రిలోచన పట్ల గౌరవముతో కూడిన ప్రేమభావము స్థిరమై యామె యభిప్రాయము లెట్టివైనను ధర్మసంగతములని విశ్వాసమేర్పడి నది సుదర్శన సంగతి వేరుగ చెప్పవలసినదేలేదు. దంపతులిరువురును త్రిలోచనకు భక్తులై పోయిరి. కాల మతి ప్రశాంతముగ మనోల్లాసకర ముగ గడచి పోవుచుండెను. సుదర్శనా సౌధములలో త్రిలోచన స్వచ్ఛందముగ సంచరించును.

గోవిందవర్మ చిత్రశాలలో తైలవర్ణ చిత్రము లనేకము గలవు. త్రిలోచన వాని నన్నిఁటిని పరిశీలనాత్మకముగఁ జూచి వాని యందలి కళానైపుణ్యమున కెంతో యానందించెను. ఆమె స్వయముగ నొక తైలవర్ణ చిత్రమును చిత్రించి ఆ చిత్రశాల యందుంచెను. అదియొక రథ చిత్రము. ఒక రథికుఁ డమితవేగముగ రథమును తోలుకొని పోవు చుండెను. రథము గాలిని మించిన వేగముతో కదలి పోవుచున్నట్లని పించును సారథి కడు వేగరి. రథవేగమును తప్పించుకొనలేక చక్ర ముల క్రిందఁబడి గిలగిల తన్నుకొని లేడి కదుపులు రెండు ప్రాణములు విడిచినట్లున్న యా చిత్రము చూపరులకు వెఱపు గొల్పుచుండెను. మరి కొంత దూరమున నొక బాలుఁడు దారి కడ్డముగఁ బోవుచు చక్రముల

క్రిందఁబడి నలిగిపోయిన స్థితిని యథాతథముగ చిత్రించిన యా చిత్రకారిణి హస్తనైపుణ్య మనితరముగ ననిపించక మానదు రథమురివ్వున శరవేగమున కదలిపోవుచున్నట్లే కన్నులకు భ్రాంతి నొదవఁజేయును. ఆ చిత్రమునకు రథవేగమను పేరుంచినది!

సుదర్శన యా చిత్రమును జూచి నవ్వి — "మీ బావగారికి గుణపాఠము నేర్పుచున్నావు. నా కాయన రథ వేగమును చూచుటకే భయ మనిపించును. నేననిశమాయనను వేడికొనుచుందును. అంత వేగమాపదకు హేతువు కాఁగలదని యెంత చెప్పిన నాయన విరమించుకొనరు. శీఘ్ర గమనంబు నందాయన కపరిమితమైన యుబలాటము" అనెను.

"కావచ్చును. అది యొక్కొక్కతఱి ప్రాణహానికరముగఁ బరిణమించవచ్చును గూడ. మనకంతటి బాధ యెందులకు? కాల మెల్లవేళల మనది కాదుగద!"

"నీ వనినది నిజమే. నా మొఱ నాలించు వారెవరు? నీయీచిత్రపటమేమైన నాయన ప్రవృత్తిని మార్చునేమో చూతము. అది సరికాని చెల్లీ! నీ వీ వార్తను వింటివా?"

'ఏమది?'

"మన పిన్నయత్తగార్లు మలయవతీ దేవియు, సుభద్రాదేవియు నొకరిపై నొకరు ఈర్ష్యగ కుమారుల జీవితములకే యానందము లేని పనులఁ గావించినారఁట!"

"సుగంధి గర్భవతి యైనదఁట. దానిని సహించలేని సుభద్రా దేవియు, మోహినియు నెవతెనో యొకసానిని బిలిపించి, యేవో మూలికలఁ దెప్పించి, వాని రసమును పాలలో గలిపి సుగంధికిచ్చి త్రావించినారఁట. ఆమెకు గర్భస్రావమైనదఁట. అందులకు మలయవతి మండిపడి తానొక కురవంజితో సంప్రదించి యొక మందును తెప్పించి పాసీయమునఁ గలిపి మోహిని కిచ్చినదఁట ఆ మందు చర్యచే నామెయిఁక నీ జన్మకు గర్భవతి కానేరదఁట !

"మీకీవార్తలెట్లు తెలిసినవి ?"

"రాజులు చారచక్షువులని నీకుఁదెలియునుగద !"

"ఛీ ! ఎంతనైచ్యమున కొడిగట్టినారు ! ఏమి రాజ్యకాంక్షలో యేమో ! మాతృత్వమునుండి వంచింపఁబడినారు ! అయినను యువరాజ్ఞి మీరుండగ వారికీపరస్పర యీర్ష్యాసూయలేలనో ! వారి సంతతికెట్లును రాజ్యాధికారార్హత లేనేలేదుకద !"

'ఆ యర్హతఁ జేకూర్చుకొనవలయుననియే వారి సంకల్పము. వారిరువురుఁదామే సింహాసనము నాక్రమించవలెనని ఎవరికి వారుగ విశ్వప్రయత్నము లొనర్చుచున్నారు."

"అక్కగారూ ! ఈ త్రిలోచనవల్లవి బ్రతికియుండగా నెవ్వరీ సింహాసనము నధిష్ఠింపఁజాలరు. మీకాభయమక్కఱలేదు. అన్యాయము నీ త్రిలోచన సహించదు."

"చెల్లీ ! నీకు రాజ్యాధికారముపై కాంక్షయుండదా ?"

"నా కట్టికోర్కెలుండవు. నేనిప్పటికే యట్టివానితో విసిగిపోయి నాను. నాకు మేనల్లుఁడు కలిగినాడట ! రాజ్యమునందలి నా యర్ధభాగ మునుకూడ వానికే సంక్రమింపఁజేసెదను."

"అందరు నీవంటి నిర్మములు విశాలహృదయులు నుందురా ? నీవు నాకండగనుండ నిజమునకు నాకెట్టి భయమును లేదు. నీవు నా కదృష్టదేవతగ లభించితివి. నిన్నుఁజూచికొని నేనెంతేని గర్వించు చుండును !"

"మనము స్వీయగృహమును చక్కదిద్దుకొనుట గూడ నొక గొప్పయా ? మనయత్తగారు మహాసాధ్వి ఆమెకివియేమియుఁబట్టవు. మామ గారి ధర్మప్రవణత, అత్తగారి పాతివ్రత్యము మనరాజ్యమునకు రక్షగ వఱలుచున్నవి !"

"ఇప్పుడీ చిన్నరాణి ధైర్యస్థైర్యములుగూడ తోడైనవి. నీవు తలచుకొనిన నేమైనఁజేయఁగలవు"

"అంత పరిహాసముఁజేయకుఁడు !"

"నవ్వులకంటివి, ఇంతలో నలుకయేల ?"

"ఎవరిపై నలుగవలె ? నీపై నా కలుకయని కలలోనైతమను కొనవలదు."

"త్రిలోచనపల్లవి కట్టనికోటయై, ఆమెనీతి యగడ్తయై గోవింద వర్మ రాజ్యము వేయేండ్లు వర్ధిల్లగలదు !"

''అ మాత్రము విశ్వాసమున్నఁజాలును. అన్నట్లు బావగారికి ఖడ్గ విద్యాభ్యాసమెంతవరకు వచ్చినది ?

''వారు నిష్ఠతో నభ్యసించుచున్నారు. చెప్పమరచితిని. ధాన్యకటక ప్రాంతమున నల్లరులు తిరుగుబాటెక్కువగుచున్నవఁట. వార్తలు వచ్చినవి. వాని నణచివేయుటకు మామగారు యువరాజును పంపనిశ్చయించుకొని కబురుబెట్టినారు. యువరాజందులకు సమ్మతించి వచ్చినారు. రేపు దశమినాఁడు బయలుదేరుదురఁట !''

''అటులనా ? అయిన మనమొక పనిచేయుదము.''

''ఏమది ?''

''మీ కిష్టమగుచో మీరును నేనుమ పురుషవేషములతో యుద్ధమున కాల్గొందము బావగారితోడవెళ్ళినట్లుండును. మన విద్యకు సాఫల్య మొదవును!''

''మామగారెట్లు భావింతురో !''

''మామగారికేల తెలియవలె ? ఎవ్వరికివి దెలియనిరీతిని మన యంతిపురయును కట్టడిచేసి పోవుదము. మన భర్తలకు సైతము తెలియవలసిన యగత్యములేదు.''

''నీ యిష్టము. నీవెట్లు చేసినను నాకు సమ్మతమే !''

''మనము కూడ దశమినాడు బయలుదేరుచున్నాము.''

ఆహవరంగమున యువరాజును కంటికి రెప్పవోలె కాపాడుచు సర్వముఁదానయై వర్తించు నొకవీరుఁడు కన్పించెను. వారిర్వురు లేకపోయిన నా యుద్ధరంగముఁగడచి తాను రాజధానికి తిరిగివచ్చెడివాఁడు కాడు. తాను నగరమునకు తిరిగి వచ్చిన వెనుక తెలిసినది, వారిరువురు త్రిలోచనా సుదర్శనలని! యువరాజు మనస్సులో పొంగిపోయెను. త్రిలోచన పర్యవేక్షణలో రాతికిగూడ చైతన్యము కలుగును; ఆమె యేలేకున్న తనకాయుద్ధమున నపజయమే సంభవించెడిది. సుదర్శన యెంత నేర్చినది! వీరిర్వురును గలసివచ్చిన తనకిక రణరంగమున నపజయమనునదే యుండదు యువరాజునకు యుద్ధమసిన బెఱుకు తీరిపోయినది. ఆ కొండజాతివారు మిగుల క్రూరులు. వారినెదిరించుట సాహసమనవలయును. అట్టి దుర్ఘటమయిన కార్యము నవలీలగ నిర్వర్తించుకొని విజేతయై తిరిగివచ్చిన తనయునిజూచి మాధవవర్మ మహారాజు మురిసిపోయెను. ఆయున కుమారునెంతగనో మెచ్చుకొనెను.

మహారాజిట్లనెను—"నాయనా గోవిందవర్మ! నీవెంతటివాడవైతివి! నా కింక నునశ్శల్యము తొలఁగిపోయినది. ఆ కొండజాతుల నణచివేసితివన్న నీకింక నాహవమున నసాధ్యమనునది లేదన్నమాట!"

మాధవవర్మ మహారాజునకానందము తలమున్కలై యుక్కిరిబిక్కిరి యగుచుండగా సుదర్శన మెల్లగ నవ్వుచుండెను. మాధవవర్మ యది గమనించి, "ఏమితల్లీ! నవ్వుచున్నావు! నీభర్త విజేతయై వచ్చినాఁడని యానందమా! లేక మరేమైన విశేషమున్నదా!" అని ప్రశ్నించెను.

"వారినే యడుగుడు!"

'సుదర్శనభావమేమి'యని మహారాజు యువరాజునడిగెను.

"నాయనగారూ! ఈమె తానుగూడ నాతో రణరంగమునకు వచ్చినదిలెండు!"

"నేనేకాదు. త్రిలోచనసైతమందుఁ బాల్గొనినది!"

"ఏమీ! త్రిలోచన యుద్ధములో పాల్గొనినదా! నీవు వెళ్ళితివా! అయినచో నీ విజయము!"

గోవిందవర్మ :- ఈ విజయమున ప్రధానముగ ప్రముఖ పాత్ర యామెదే!

"అట్లయిన నాతల్లిని పిలిపించుడు!"

త్రిలోచన యరుగుదెంచి మాధవవర్మకు పాదనమస్కారమొనర్చి నిలిచినది,

మహారాజు — "తల్లీ! త్రిలోచనా! నీవును నీ బావగారివెంట కదనరంగమున కేగితివఁట!" అనెను.

"అవును. అక్కగారు తనతోపాటు నన్నుకూడ రమ్మనివారు. నేను సరేయంటిని. తమకీవిషయము తెలిసిన నద్దుపెట్టెదరని సాహసించి అక్కగారును నేనును స్వతంత్రించినాము. క్షమింపవేడెదము!

"మీరు క్షమింపరాని నేరమేమి చేసినారు! నీవు పాల్గొనిన కారణముగ యువరాజు విజయముగ తిరిగి వచ్చినాఁడు. తల్లీ! నీవు నా

గృహమున సాక్షాత్తు దుర్గాదేవియే రూపాంతరమున వచ్చినట్లున్నావు. నీ మూలమున మన విష్ణుకుండిన వంశము ధన్యతగాంచినదమ్మా ! నీ ప్రతిభనుగూర్చి వినుటయేగాని చూచినదిలేదు. ఇప్పుడు ప్రత్యక్షముగ ననుభవములో తెలిసినది. బంగారుతల్లివి ! నీకేమి కావలెనో కోరుకొనుము.''

''మామగారిట్లనిన నాకు సిగ్గగుచున్నది, ఇందు నా యొనర్చిన దేమున్నది ! బావగారికించుక బాసటగ నిల్చితినంతియ ! ముందు రాజధానియందందంతట యువరాజు విజయోత్సవమును జాటుఁబంపుడు !''

"అది యీవరకే జరిగినది ! రాజధానియంతయు నానందమున యుప్పొంగిపోవుచున్నది. నీకేమి కావలెనో కోరుకొనుము.''

"తమకు కోడలనైననాకు కోరుకొనవలసినదేముండును ! అక్కగారికి వలయున దేమైన నుండునేమో ! ఆమె యిప్పుడు కోరుకొనదగిన స్థితియందున్నారు !"

మాధవవర్మ యదిరిపడి-'ఏమనుచున్నావు త్రిలోచనా ! సుదర్శనకేమైనది ! అనినాడు.

త్రిలోచన నవ్వుచు- ''ఏమియులేదు మామగారూ ! అక్కగారు బుల్లి మాధవవర్మను మీకీయనున్నారు !" అనెను.

మాధవవర్మ పరమసంతోషముతో— ''త్రిలోచనా ! నీవన్నియు శుభవార్తలే వినిపించుచుందువు. మీ యత్తగారికీవార్త నందజేయుడు. ఆమె పొంగిపోవు'' ననెను.

మాధవవర్మ వారిద్దరకు వెలలేని కానుకలొసఁగి వారిని చంద్రవతీ సౌధములకు బంపెను. తండ్రికుమారులిరువురును మిగిలిపోయిరి

మాధవవర్మ యిట్లనెను — "నాయనా గోవిందా! నాకీనాడుపరమానందముగనున్నది. నేనెంతకాలమునుండియో యెదురుచూచుచున్న శుభక్షణము దగ్గఱపడినది. నా పుణ్యములు పండి మనుమఁడుగ జన్మించును బాబూ! చిన్ని మాధవుని జూచుటకు నా కన్నులు వికసించుచున్నవి! పుట్టఁబోవు శిశువు నాకృతి నా నేత్రములకుఁ గట్టినట్టున్నది! తండ్రీ! మనవంశమున నొక చమత్కారమున్నది. విష్ణుకుండినవంశము రాచరికమునకు వచ్చిననాటినుండి యనేకమంది సమర్థులైన రాజులు పాలించుచు వచ్చుచున్నారు. కాని చమత్కారమెచ్చట నున్నదనిన మాధవవర్మ నామముగల ప్రభువులు మహాసామ్రాజ్యపరిపాలకులై రాజ్యవిస్తారకులై విజేతలై వఱలినారు. వారి కుమారులు సామాన్యులై రాజ్యభాగములు పోగొట్టుకొనుట జరుగుచున్నది, మఱల మాధవవర్మ జనించవలె, రాజ్యమును తిరిగివిస్తరింపజేయవలె! మనవంశముననేను మూఁడవ మాధవవర్మను. మొదటి మాధవవర్మ చాల సమర్థుఁడైన ప్రజాపరిపాలకుడు ఆయనసైతము నరమేధముఁజేసెనందురు, ఆయన శైవమతాభిమాని. ఆయన చేసినన్నియుద్ధములు వేరెవ్వరుఁజేసి యుండరు. అన్నియు విజయవంతములే. ఆయన పదునొకండశ్వమేధములు చేసినఁగా తాను సర్వవిధముల సర్థుఁడై నిర్వహించినాఁడు. ఆయన రాజసూయమును సైతమొనర్చిన మహామభావుఁడు. నరమేధ రాజసూయములనుజేసిన ప్రభువులరుదుగనుందురు.

పాండవాగ్రజుఁడైన యుధిష్ఠిరుఁడు రాజసూయ మొనర్చెను. తరువాత నెవ్వరును మరి చేసినట్లు కనిపించదు. అట్టి మహోత్కృష్టము

లైన క్రతువుల నాచరించిన వైదిక ధర్మాభిమాని! విశ్వవిఖ్యాతమైన బౌద్ధక్షేత్రమగు నమరావతి నా సార్వభౌముఁడు శైవక్షేత్రముగఁ దీర్చి దిద్దినాడు. శివాలయమును నిర్మించెను. రెండవ మాధవవర్మ కాలమున నమరావతి యాంధ్ర రాజధానిగ రూపొందెను. నాటినుండి అదియే రాజధానిగ వ్యవహరింపఁబడుచు వచ్చినది. ఆయన యేలుబడిలో నా పర గణాయంతయు విష్ణుకుండిన ఛత్రము క్రిందకు తొలిసారిగ వచ్చినది. విష్ణుకుండినులాయన కాలముననే యుత్తరమున కనౌజ్ వరకు తమ సైన్యములను నడిపిరి! ఇఁక మూఁడవ మాధవవర్మను నేను!

మన రాజ్య పరిస్థితులు నీకుఁ దెలియనివి కావు. నీకు మరల మాధవవర్మ జనించవలెనని మా యభిలాష. అది ఈనాడు ఫలోన్ముఖమగుచున్నది. విష్ణుకుండిన రాజ్యమీనాడు పటిష్ఠముగ నున్నది మనతో ప్రఖ్యాతములయిన రాజవంశములన్నియు వియ్యమందినవి. దక్షిణాపథమంతటను, ఉత్తరాపథమునందు గూడ మన రాజ ప్రతినిధులున్నారు. రేపు మన చిన్ని మాధవుఁడు ఉత్తరాపథమునంతను జయించి చక్రవర్తి కాగలఁడు."

"నాన్నగారూ! పుట్టని మనుమనిపై మీ కెంతటి మమకారము! మన త్రిలోచన పర్యవేక్షణలో వానిని తీర్చిదిద్దిన వాఁడొక సామ్రాజ్య నిర్మాత కాఁగలడు. ఆమె ఖడ్గవిద్య అనితర సాధ్యము! మీకుఁ దెలిసినది కద! ఆమె యే యుద్ధమునఁ దోడుపడకున్నచో నాకెంతో కష్టమయ్యెడిది! ఈ మధ్య నేనును మీ కోడలును త్రిలోచన యొద్ద నా విద్య నభ్యసించుచున్నాము"

'చాల సంతోషము! ఆ పిల్లనుచూచిన నాకు ముచ్చటగనుండును. ఆమె ప్రియభాషిణి అవసరమగుచో రణదుర్గయై శత్రు నిర్మూలన

మొనర్చగలదు. శరచ్చంద్ర చంద్రికా శీతలాంతఃకరణముతో బంధు జనుల నానందపరచగలదు. అట్టి మహా లక్షణములు పల్లవ రాజవంశానుగతములు. వారు సామ్రాజ్య నిర్మాణదక్షులు. పల్లవి తన యన్నగారి గృహమును ధగధగ లాడించును.''

"తామనిన దక్షరముల నిజము !"

"నాయనా ! విజయముతో తిరిగి వచ్చిన నిన్ను జూచుటకు మీ జనని యారాట పడుచుండును. తక్షణమ యేగి యామె యాశీస్సుల నందుకొనుము. ఆమె తపస్విని !''

గోవిందవర్మ తండ్రికి పాదాభివందన మొనర్చి వెడలిపోయెను.

మహారాజు పినాక భట్టారకుని పిలిపించి యా శుభవర్తమానము నాయనకుఁ దెలిపెను. ఆయన మిగుల సంతసించి — "మహాప్రభూ ! మరల విష్ణుకుండిన వంశమున మాధవవర్మ జనించవలె. రాజ్యమింకొక వందయేండ్లు సుస్థిరముగ నిల్వవలె. ఇది చాల సుదినము. యువరాజు విజయవార్తయు, ఈ సువార్తయు వింటిమి'' -అనెను.

'యదార్థమున కీ విజయము మా త్రిలోచన పల్లవి దనవలెను' ఆమె కూడ కదనభూమి కఱిగి యుద్ధమునందు పాల్గొని శత్రువినాశకారిణి యెనది !''

ప్రభూ ! ఆమె సర్వ సమర్థురాలు. సామ్రాజ్యపాలన మొనర్చ గల నేర్పరి !'

చక్కగ వ్రాక్కుచితిరి. ఆ యమ సాక్షాత్తు జగముల నేలు తల్లి పరమేశ్వరి యపరావతారమయ్యా! విష్ణుకుండినుల యదృష్టము నందీ ఈ గృహపథమై యిచ్చట నడుగు మోపినది !''

పినాక భట్టారకుడు మాటాడలేదు. మహారాజది పట్టించుకొనలేదు. ఆయన మనస్సానందమున నోలలాడుచుండెను. ఆయన కాల్పనిక జగత్తునందు విహరించుచున్నాఁడు. మాధవవర్మ దీర్ఘాయుష్మంతుఁడగుచో విష్ణుకుండిన వంశము మరి నూరేండ్లు విచ్ఛిన్నముగ సంతతధారగ సాగి పోఁగలదు. ఆ భావ మొక్కటియే ఆయన హృదయము నాక్రమించి పెర యూహలకు తావిచ్చుట లేదు.

పినాక భట్టారకునికి త్రిలోచన వల్లవిపై నొక విధమైన యాయ నకే తెలియని తేలిక భావమున్నది ! ఆయన కెందులకో త్రిలోచనచర్య లన్నియు కపటముగనే కన్పించును. తన కనుకూలములైన కొన్నితావు లందాయన యామె యెత్తులను వమ్మొనర్చెను. ఆమె కూటనీతి నుపయో గించుచున్నదని భట్టారకుని యభిప్రాయము. అనుమాన నివృత్తియైన తావులు సైతము లేకపోలేదు. ఆ విషయములన్నియు మహారాజుతో తాను చెప్పుటెట్లు ? ప్రభువున కామె గృహదేవతయై కూర్చున్నది ! ఆయన యేమియుఁ జేయఁజాలని స్థితిలో నుండిపోయెను ! తనకు చేత నైనంతకు ప్రతిక్రియ యొనర్చుట వినా వేరేమియుఁ దనవల్లకానేరదు. కాలగతి నెవఁడు మార్చఁగలఁడు !

త్రిలోచన వర్యవేక్షణలో సుదర్శన గర్భము రూపు కట్టుచున్నది. వల్లవి త్రాగుమనిన త్రాగుట, తినమనిన తినుట ! ఆమె చెప్పినట్లు చేయుటగ జరుగుచున్నది.

సుదర్శనకు గర్భదోహదము లిచ్చుటకై మలయవతీ సుభద్రలు. సుగంధి మోహినులు, సుడుగరలను దెచ్చిరి. వారలకు సుదర్శన దర్శనమే పూర్తి యాయెనది .

ఒకనాఁడు సుదర్శన గోవిందవర్మతో నేకాంతమున నుండగా మలయవతి సుదర్శనకు తన పుట్టినింటి నుండి వచ్చిన జాతిరకములని ఫలములను పంపినది. సుదర్శనకు వానివి చూడగనే తినబుద్ధి వొడమెను. ఆమె వానిని స్వీకరించఁబోవు సమయమునకు త్రిలోచన వచ్చి యడ్డుపెట్టెను

'చెల్లీ ! ఇదేమి పాపము! పిన్నయత్తగారు ప్రేముడితో పంపినారు. వారి పుట్టినింటి నుండి వచ్చినవఁట. జాతిరకములఁట!"

"జాతులన్నిఁట నుండును. మనుజులలో లేవా ? చంద్రావతీ దేవిగారి జాతి వేరు. మలయవతీ సుభద్రాదుల జాతి వేరు. ఈ ఫలములు విషదిగ్ధములు!"

సుదర్శన యులిక్కిపడి — "అమ్మో ! ఇంకనేమైన నున్నదా ! చెల్లీ ! అది నీకెట్లు తెలిసినది'' అని అడిగెను.

"వీని యాకృతిని, వాసనా విశేషమునుబట్టి తెలిసికొంటివి.''

"నిజముగ నివి విషలిప్తము లందువా!''

''సందేహమా! వలసినచో ఋజువు చేసెదను.''

పరిచారికచే నొక పక్షిని తెప్పించి త్రిలోచన యా ఫలములం దొక దానిని దానిచే తినిపింపగా నది గిలగిల తన్నుకొని తలవ్రేల వైచినది. అసలే పాలిపోయిన సుదర్శన వదన మింకను పాండురతను ధరించెను. ఆమె భయవిహ్వలయై - చెల్లీ : నీవు సమయమున నిటకు రాక యుండినచో నేను సరిగా పక్షివలె నయ్యేదిదాననే!'' అనెను

'నేను నాకంత నెట్లుండును : నీ విట్టిదెగో చేయుదువని నాకు దెలియును. అందుచే సర్వవేళల గన్ను నీ మీద నుంచుకొనియే వర్తించుచుంటిని.''

'నేను నిజముగ నదృష్టవంతురాలను. నీవంటి చారచక్షువైన యాప్తురాలు చెల్లెలై నన్ను వెన్నంటి కాపాడుచుండ నాకింక నభావ మేమున్నది!''

''అక్కా ! నన్నింత యగ్గించినచో నాకు సిగ్గగుచుండును. విష్ణుకుండిన రాజవంశాంకురమును రక్షించుకొనవలసిన బాధ్యత యీ యింటి కోడలనైన నా యందుండదా !

"నీవు నిరీహావు గానట్లనుచున్నావు. మలయవతీదేవి చేసినపనిని చూచితివి గదా !"

"పోనిండు వారల్పజీవులు ! పరస్పర మొకరితో నొకరు స్పర్ధించి తమ సంతానమును సంతానహీనము గావించుకొనిన కుటిలమతులు ; మీకెందులకు ? నేమున్నాము. ఈ విషయమును పైకి పొక్కనీయకుడు"

"నీ యిష్టమెట్లో యట్లే !"

త్రిలోచన నవ్వుచు— "నా యిష్టము గాకున్న నూరకుందునా ! బుల్లి మాధవుని బుగ్గలు చిదిమివానిని చేతులలో నలిపి నలిపి నై వేద్యము పెట్టినగాని నాకు శాంతి లేదు. ఆ శుభ ఘడియలెప్పుడు వచ్చునా యని ప్రతీక్షించుచున్నాను" అనినది.

"మంచి పినతల్లివే ! బిడ్డడు కందిపోవండా !"

"పుట్టని నిసుంగుపై నీ కింతటి మోహమేమి ?"

"నీకు మాత్రము వానిపై నంత యుత్కటమైన వాత్సల్య మెందులకు ?"

ఇరువురి నవ్వులు మువ్వల మ్రోతలై మందిరారామము నందలి విహంగముల కలరములతో శ్రుతి గల్పినవి !

చంద్రావతీదేవి దినమున కొక కాన్కగ కోడలికి పంపుచుండెను. ఉభయ సంధ్యల శివార్చనలు దేవీపూజలు జరుగుచుండెను. త్రిలోచన మందిరమున నైత ముభయసంధ్యల శివార్చనలు, రాత్రులందు దేవీ పూజలుగ నుండెను.

సునీతివర్మ తన భార్య నిర్మలత్వమునకు వెఱగందును. రాజ పరివారముల స్త్రీ లెంతటి కుటిల బుద్ధులై సంచరింతురు ! తన పిన తల్లుల చర్యలెట్టివి ! మరి త్రిలోచన వల్లవి మానవి కాదా ! ఆమె నీ యాశామోహములంటవా ! ఆమె యొక విచిత్రవ్యక్తి యనిపించును. తనకేమియు నర్థముకాదు ఆ యమ సాహచర్యమున, తాను ప్రణయ సుధాసాగర వీచీ నివహములం దొప్పదోగి పోవుచున్నాండు. బ్రహ్మ

నంద స్వబ్రహ్మచారిణియైన యానందము ననుభవించుచున్నాడు. సునీతి వర్మ తన భార్యను చూచి మురిసిపోవుచుండును మొన్నటి యుద్ధమున నామె యాదుకొనకపోయినచో తన యన్నగారికి విజయము లభించెడిదే కాదఁట! ఆయనయే తనతోనట్లు చెప్పెను. తమ మఱదలాయనకు పరోక్ష విద్యాగురువఁట! త్రిలోచనపై తన యన్నగారికి గౌరవ పూర్ణమైన వాత్సల్యము. నాయనగారి విషయమిఁక చెప్పనక్కఱయే లేదు! ఆయనకు త్రిలోచన తనకన్న మిన్నయయినది! చంద్రావతీదేవి తనకు కుమార్తెలేని లోటీమె వలన తీరినదనును. రాజ పరివారము నందెల్ల ర మెప్పును పొందిన భార్యను కల్గియుండుట తన యదృష్టము!

శ్రావణమాసము వచ్చినది. ఆకసమున ప్రావృణ్ణీల పయోధరములు గర్భిణీ స్త్రీల స్తన చూచుకములట్లు భాసిల్లుచున్నవి! శ్రావణ శుద్ధ దశమి. యువరాజు జన్మదినము. నాడే సుదర్శనకు సీమంతోత్సవము సైతము చేయ సంకల్పించిరి. రాజ పరివారమంతయు సమావిష్టమైనది. అంతిపురమంతయు శబ్ద సంకులమై హాస్యములు వినోదములుగ నుండెను.

సుదర్శనను కలియవలెనన్నిన త్రిలోచన యనుమతి కావలయును. అంతఃపురమంతయుఁ త్రిలోచన కనుసన్న మెలఁగుచున్నట్లుండెను. మలయవతీ సుభద్రలకది సహింపరానిదిగ నున్నను వారేమియుఁ జేయఁ జాలక యూరకుండిరి. ఏమి చేయవలసినను చంద్రావతీ దేవి— "అమ్మా! త్రిలోచనా! ఇది యిట్లు చేయుమందువా? తల్లీ, వల్లవీ! ఈ పని నిట్లు చేసిన నెట్లుండును!" అని యడుగుచునే యుండును.

త్రిలోచన యువరాజును రాజధానిలో నూరేగుఁడవినది. విజయముతో తిరిగివచ్చిన తమ యువరాజును కన్నులారఁ గాంచి మనసార

యభినందించు నవకాశము ప్రజలకుఁ గలిగించిన బాగుండుననినది. యువరాజు రథయాత్ర చాటింపబడినది.

విజయవాటిక యందలి ప్రజా సందోహమంతయు రాజమార్గమున కిరుపైపుల బారులు తీర్చి నిలబడి యుండిరి. కొందఱ చేతులలో పూమాలలుండెను. యువరాజు సాధారణముగ నేరికిఁ గనిపించఁడు. ఆయన యుద్ధమున కేగిన సంగతి కూడ నింతవర కెవ్వరును విని యుండ లేదు. అందువలన జయలక్ష్మీ సమేతుఁడైన యువరాజును దర్శింప వలెనని యుత్కంఠతో ప్రజలెల్లరు వేచి నిరీక్షించుచుండిరి ఎంత యదుపుఁబెట్టినను ప్రజానీకము త్రొక్కుసని పోవుచున్నది. వర్షము పడినను నేల తడవ నంతగ ప్రజాద్రోహము క్రిక్కిరిసి యున్నది.

రాజభవనము నుండి రథములు బయలుదేరిన వసువార్త యంచె లంచెలుగ వచ్చి ప్రజానీకము పాదములు త్రొక్కుసనెను. మొదట యువరాజు సరదము, తరువాత నాయన అన్నదమ్ములు, హెగ్గడికాండ్రు గుఱ్ఱపు రౌతులు కాల్బలము వరుసగ వచ్చుచుండెను। తన రథమునకు యువరాజే సారథి. రథము వచ్చును, యువరాజును దర్శింపవచ్చునని గంపెడాసతో కన్నులింతలు చేసికొని చూచు ప్రజాసమూహమున కాశా భంగమైనది. యువరాజు సరదమెప్పుడు వచ్చినదో యెప్పుడు కనుమ రుగై పోయినదో ! ఎవరికిని దెలియనేలేదు. రథము గమించిన వెనుక రేగిన ధూళితప్ప మరేమియుఁ గన్పించలేదు. మీదు మిక్కిలి వారందఱి కన్నుల దుమ్ము కట్టుకొన్నది. యువరాజు దర్శనలాలసులై ప్రొద్దుటి నుండి పడిగాపులు గాచినిస్పృహులైన వారలు, ఇంకెక్కడి యువరాజు, మన కన్నుల దుమ్ముజల్లి ఆయనయెప్పుడో యేగెను. రేపాయన రాజై మనల నేమి పాలించునో । అంత వేగమా ; ముందు

నెసుకలు విచారించనంత శీఘ్రగమనము తావిజీవితమునేమిగా పరిణమించునో ! అంత యహంకారమా ? ఎటులో యొక యుద్ధమున గెల్చినాడఁట ! మహారాజుగారెన్నఁడైన నిట్లు ప్రవర్తించెనా ? ఆయన చిఱునవ్వుతో నెల్లర సంభావించుచు మెల్లగ సాగిపోయెడి వారు !

"ఆ పల్లవ రాజకుమారి లేవిచో నీయనకా విజయము సంప్రాప్తించెడిదే రాదఁట !

ప్రజల చేతులలోని పూలమాలలు తామలంకరింప నెంచిన వ్యక్తి యలభ్యుఁడగుటచే వలె వాడిపోయెను. జనులు పరిపరివిధములుగఁ జెప్పికొనుచుండిరి.

ఊరేగింపు ఇంద్రకీలాద్రి చెంతకు వచ్చినది. యువరాజు రథము మేఘములపై వాయువేగమున పోవుచున్నట్లుండెను. ఇంతలో జనసమ్మర్దమునుండి హాహాకారములు చెలరేగినవి. దుర్గాదేవి యవతరించిన పర్వతపాదదేశమునకు వచ్చువరకు యువరాజు రథవేగము నరికట్టలేక పోవుటచే నొకబాలుఁడాయన రథచక్రముల క్రిందఁబడి నలిగిపోవుట తటస్థించెను.

నేల యంతయు నెత్తురుకొల్లయిపోయినది యువరాజు గ్రమాన్పడిపోయెను ! ప్రజా సందోహము సముద్ర తరంగములవలె ముందు వెనుకలకు కదలి పోవుచుండెను. అంతయు నల్లకల్లోలముగ నుండెను ! రక్షకభటులు ప్రజల నదుపులోనికిఁ దేలేక పోవుచుండిరి మహారాజునకీ వార్త గాలిపై తేలుచు పోయి చేరినది !

కోటలో సుదర్శనా దేవికి సీమంతము జరుగుచున్నది. బ్రహ్మోత్సవము వలె సాగిపోవు చుండెను. ఈ వార్త నాలకించిన సుదర్శన

మొదలు నరికిన కదళీతరువువలె విరచుకపడి పోయినది. మాధవవర్మ మహారాజు త్రాన్పడి పోయెను. చంద్రావతీదేవి మూర్ఛ జెందెను. క్షణము పూర్వము అంతయు నానందమయము. క్షణములో నంతలో శోక భూయిష్టమై పోయెను. యువరాజపరాధి వలె కోటలోనికి వచ్చెను.

చనిపోయిన బాలుని శవమును బుజమున వైచికొని యొక స్త్రీ యెలుగెత్తి గోలుగోలున నేడ్చుచు మహారాజును న్యాయము నమర్చు దని యభ్యర్థించుటకై కోట వాకిట వేచియున్నది. న్యాయ ఘంటా నాదము రాజధాని యందంతట మార్మ్రోగుచుండెను.

— o —

ఆ ఘంటానాదము పరేతరాణ్మహిషగ్రైవేయ ఘంటికా రావమై మాధవవర్మ శ్రవణపుటముల భేదించుచుండెను. ఆ మహానాదముచే తన కర్ణ రంధ్రములు బధిరితములగునా ! తన హృదయముపై సమ్మెట పెట్లవలె తన వెన్నెముకపై కశాఘాతమువలె ననుభూతమగుచుండెను.

తన కుమారుఁడు యువరాజు నేరస్థుఁడా ! వానిపై నభియోగమా ! తండ్రియైన తాను రాజై తీర్పు నొసఁగవలెనా ! దైవమా యెంతపని చేసితివి ! తెల్లవారిన రాజసభలో యువరాజుపై విచారణ జరుగును. తానది భరించగలఁడా ! విష్ణుకుండిన వంశోద్ధారకుఁడు నిందితుఁడై తన రాజ్యములోనే తన కొల్వుకూటము నందే ప్రాడ్వివాకుల తీర్పునకు తలయొగ్గవలసిన స్థితి కలుగుట మిగుల శోచనీయము. తానేమిచేయఁ గలఁడు ? తాను ధర్మ నిరతికి న్యాయ పరిపాలనమునకు పేరు పొందినవాఁడు. తన న్యాయబుద్ధి తన బిడ్డనే శిక్షించునా ! అయ్యో ! గోవిందవర్మా ! నీవు రథము నంత వేగముగనేల తోలితివయ్యా ! నగరమున ననలీ యూరేగింపేల జరుగవలె !"

ఆ చనిపోయిన బాలుని తల్లి హృదయ విదారకముగ శోకించు చున్నది. ఆ శోకము యజ్ఞదత్తుని తల్లిని జ్ఞప్తికిఁ దెచ్చుచున్నది. రేపు పట్టమహిషి కూడ నట్లే శోకించునా ? తమ శిక్షాస్మృతిలో ప్రాణమునకుఁ బ్రాణమే యని లిఖింపఁబడియున్నది ! "అయ్యో ! సుదర్శనా ! నీవెంత

దురదృష్టవంతురాలమ్మా! గర్భస్థ శిశువెంత భాగ్యహీనుఁడు ! అయ్యో ! రాజమాతా ! చంద్రావతీ ! నీ కెంతటి కష్టము దాపురించినది !

మాధవవర్మ మహారాజు మనస్సునందు పరిపరివిధముల బాధఁ జెందుచుండెను. తెల్లవారకుండిన నెంత బాగుండును ! యుగయుగములుగ మారని సృష్టిక్రమము తమ కొఱకు మారునా! విజయోత్సాహియై వచ్చిన కుమారుని మొగము చంద్ర సుకుమారమై హృదయాహ్లాద జనకమై శాంతిదాయకముగ నున్నది ! పితృస్థానము నలంకరించఁబోవు తన కుమారుని మనస్సెంత యానందపూర్ణకముగ నుండెనో ! ఇంతలో నింతటి యాపద ముంచుకొని వచ్చినది. సమయమునకు పినాక భట్టారకుఁడైన నగరమున లేడు. నిద్రారహితములై యాలోచనా మథితములైన మహారాజు నేత్రములు చంద్రమల్లెలవలె కణకణలాడి పోవుచుండెను !

సుదర్శనకు తన బదుకంతయు నంధకారబంధురమై కనిపించెను తెల్లవాఱిన తనభర్తపై మోపఁబడిన యభియోగమునకు మామగారి తీర్పెట్లుండునో ! పాపము త్రిలోచన చెప్పనే చెప్పినది ! కాల మెల్లవేళల మనది కాదన్నది. తా నెన్నిమారులు వేడుకొనలేదు ! తుదకా తొందరపాటుతనమే యువరాజును దోషిగ నిలబెట్టినది ! ముందేమి జరుగునో ! నిద్రారహితములై యాలోచనా భారములైన యామె నేత్రములు జపాకుసుమ సంకాశములైనవి !

చంద్రావతీదేవి మహాదేవుని మ్రోల ప్రణమిల్లి ధ్యానించుచున్నది తన భర్త న్యాయనిర్ణయము తనకుఁ దెలియనిది కాదు. లోకమున కొకరీతి తమకొకరీతిగ ధర్మముండదుగద ! ఇది యేదో యనర్థమునకే వచ్చి

నదే. ఆ ఘంటానాదము ప్రళయారంభమున మహాదేవుఁడూనర్చు శంఖ ధ్వానమువలె భీతిఁగొల్పు చున్నది!

పాప మామె కోర్కెఁ దే కుమారుఁడేమో! పుత్ర శోకము ననుభవించుట దుర్భరము తెల్లవారిన తన నొసట నేమి ప్రొద్దు పొడవ నున్నదో! మహాదేవా! ఎంతపని చేసితివి! నాబిడ్డను కాపాడుము! నిద్రా రహితములై వేదనా భరితములై యశ్రు సిక్తములయిన యామె నయన ముల రక్తాశోకములు పుష్పించినవి!

త్రిలోచనవల్లవి తన మందిరమున నందికతో సంభాషించుచుండెను.

"నందీ! అంతయు సవ్యముగ మనము భావించినరీతిగనే జరిగి నది గద!"

"అక్షరముల మీరు నిర్దేశించినట్లు జరిగినది!"

"నందికా! న్యాయనిర్ణయమున రాజు స్వపరభేదమును పాటించ డందురు!"

"అవునమ్మా! రాజధాని యందెల్లరు నటులే చెప్పుకొనుచున్నారు రేపు చూడవలసి యున్నది!"

"ప్రజలే మను కొనుచున్నారు?"

"యువరాజునకు మరణదండన విధింపఁబడునను చున్నారు!"

త్రిలోచ వల్లవి— "నందీ! చూచితివా! నావధకమెట్లున్నదో ఇఁక ద్వితీయాంక మారంభమైనది!" అనెను.

"మీరెంతకైనఁ దగినవారు!"

"నందికా! నీవుపోయి రాజధానిలోని ప్రజాభిప్రాయము నింకను విశదముగఁ దెలిసికొనిరమ్ము."

నందిక చిత్తమని వెడలిపోయెను.

త్రిలోచన తనమనస్సునందానందించుచున్నదో, హృదయముసవ్యథఁ జెందుచున్నదో తెలియుట లేదు. యువరాజొక విధముగఁ దనకు శిష్య సదృశుఁడు, బాంధవ్యముచే బావగారు, నట్టివాని నిట్టి స్థితిలో చూచుటకు బాధగ నున్నది. పాపము సుదర్శన తనమాట జవదాటని శిష్యురాలు. ఆమె కెంతటి యాపద దాపురించినది! తానింత బేలగ యోచించిన నేమి ప్రయోజనము! తాను పన్నిన మాయావాగురులలో నందఱుఁ జిక్కుకొని గిలగిలఁ గొట్టుకొనుచు కాలు సేతు లాడక గింజుకొని చావవలసినదే!

సునీతివర్మ కన్నగారనిన ప్రాణము. రాజకుమారుఁడై కన్నీరు కార్చుచున్నాఁడు. తన భర్తయట్లు దీనుఁడై యుండుట తాను చూడఁ జాలఁదు. అప్పుడే యేమయినది! ముందున్నది ముసుళ్ళ పండుగ! ఆమె రేయెల్ల మేలుకొనియే యుండెను. నిద్రారహితములై యాలోచనా గర్భితములైన యామె చక్షువులఁ గాశ్మీరములు కలకల నగినవి.

యువరాజు చింతాదీనుఁడై తన మందిరమున కూర్చునియుండెను. అవును తాను మిక్కిలి తొందరపాటు తనము గలవాఁడు. పరమ సాహ

సుఁడు. పాపము చిన్నపిల్లయైన త్రిలోచన తన స్యందన వేగమును విమర్శించు ధైర్యము చాలక యా చిత్తరువును చిత్రించి తన చిత్రకళా మందిరమున నుంచినది. కాని తన సాహస మట్టి సూచనలను లెక్కఁగొనునా! ఎంతటి ఘోరము జరిగిపోయినది! తన పరిపాలనమున నిట్టి యకృత్యము జరిగినదనిన మహారాజున కెంత తలవంపులుగ నుండును!

జ్యేష్ఠ పుత్రుఁడై యువరాజైన తాను తండ్రికిఁ జేసిన సహకార మేమున్నది! తాను దోషిగ సభాముఖమునందెట్లు నిలఁబడగలఁడు! తన తండ్రి తన్నట్టి స్థితిలో చూచి యేమగునో! అయ్యో! తొందరతనము మానవు నెంత యధఃస్థితికిఁ దెచ్చును! సుదర్శన సర్వవేళల తనతో నంతవేగము విపద్హేతువని నెత్తిన నోరు పెట్టుకొని వేల పర్యాయములు చెప్పినది. తన సాహసిక ప్రవృత్తి దానిని పరిగణించ నీయలేదు. ఆమె మొగమును దానెట్లు చూడఁగలఁడు! పుట్టబోవు బిడ్డ తన తండ్రి నిందితుఁ డన్నమాటను విని సహించలేదు. త్రిలోచన తావవిన దంతయు జరిగిన దనుకొను చున్నదా! తన మాతృదేవి యెంత యడలి పోవుచున్నదో!

తా నెవ్వరికిని తన మొగమును చూపలేదు. ప్రజలెల్లరుఁ దన్ను చీదరించుకొనిరి. తాను బ్రతికియుండి ప్రయోజనమేమి? ప్రజలు తన్ను భావి సామ్రాజ్య పాలకునిగ మన్నింతురా! తానేమి చేయవలె? జరుగఁబోవునది చూచుచు నూరకుండుట వినా వేరు మార్గము గోచరించుటలేదు. యువరాజాలోచనలతో విసిగివిసిగి తుదకునిర్మముఁడై నిరీహుఁడై నిలచి

పోయెను నిద్రారహితములైన యాతని కన్నులు నందివర్ధనములవలె తెల్లనై రక్తహీనములై పాలిపోయినట్లున్నవి. అతనిలో ధైర్యము విశ్రాంతి భావము, నిర్మోహము, దుఃఖము, ఆశ, నిరీహ చిత్రముగ పెనవైచికొని ద్యోతకమగుచుండెను. ఎన్ని హృదయములు ఘోషించుచున్నవో! ఎందరెన్ని విధముల చింతించినను కాలము నిరంతర చలనశీలమగుట తన గమనమును జాలించదుగదా!

ఇందఱి హృదయములకు కత్తిపోటు వలె సూర్యోదయమయ్యెను శిక్షాతీవ్రుఁడైన మాధవవర్మ మహారాజు న్యాయ నిర్ణయ మెట్లుండునో చూడ నుత్సుకులై రావలసిన సమయమునకు ముందే బయలు దేరినట్లు సూర్యబింబము కాంతులు గిలకొట్టుచుండెను. గతరాత్రి యంతయు నగరవాసులు చతుష్పథములందు గుంపులుగఁజేరి యీ విషయమునే తర్కించుకొనుచుండిరి.

"అయ్యో! మన మహారాజుగారి న్యాయ మెట్టిదో రేపు చూడవలె" నని యొకరు.

"అంత సందేహ మెందుకు కలిగినట్లు? మహారాజునకు ధర్మ నిర్ణయమునందు స్వ పరభేదము లేదు" అని కొందరు.

"అందఱు నట్లేయందురు. తమదాఁక వచ్చినఁగాని తెలియదు లెమ్మని" కొందరు

"నోరు పారవేసికొనినఁ బ్రయోజన మేమున్నది? అసలా యవ్వ నేమనెనో తెలియునా? తన కుమారుఁడు యువరాజు ప్రమత్తతచే

నత్యంత వేగమున రథము( దోలుట హేతువుగ మరణించె'' ననెను. న్యాయము( జేకూర్చు(డనెను.

రాత్రియంతయు కోటవాకిట శనమునిడుకొని ఘంట మ్రోగించుచు కూర్చుండిపోయెను.

వినిపించుట లేదా! చెవులు చిల్లులు పడుచున్నవని యొకరు; సాధారణముగ నిట్టి నేరములకు శిక్షయే ముండుననని యొకరు ప్రశ్నింపగా తిన(బోవుచు కూరరుచి యడుగనేల? రేపు నీవు కొలువునకు( బోయిన దీరిపోవును గద. నన్ను వేధించు టెందులకని సమాధానముగ నొక(డు,—అదెట్లును చేసెదను, కాని పాపము మహారాజునకు గట్టి చిక్కు వచ్చి పడినదని యొకరనగా; రాదామరి! కాల మెప్పుడు నొకరికే యనుకూలించదు. నాలుగేండ్లకు పూర్వము మాట. మా బందుగొక(డు చెట్టునొకదానిని కొట్టుచుండగా నొక సంద్రెండేండ్ల బాలిక యా దారిని పోవుచుండెను. ఆ చెట్టు చివరి పట్టు తప్పి యాబాలిక పై(బడుట ఆమె యక్కడి దక్కడే మరణించుటయు జరిగినది. ఆ పిల్ల తలిదండ్రులు న్యాయస్థానమున మొఱపెట్టుకొనగా మనమహారాజేమి చేసెనో తెలియునా? తెలిసి చేసినను తెలియక చేసినను శిక్షశిక్షయే మరణించుటన్నది జరిగినది కద; అగ్ని తెలిసి ముట్టుకొనినను తెలియక ముట్టుకొనినను దాని ఫలితము కాలుటయే కద! ఇదియు నట్లేయనుచు నా మా బందుగునకు మరణదండన విధించిరి. ఇ(క నిప్పుడు చూడవలెనా యన తీర్పు; తన కన్న కుమారు(డు, కన్నప్రేవు. మా బంధు వజాగ్రత కారణముగ నా బాలిక యసువుల( బాసెను రాజకుమారు(డు సైత మటులే యమిత వేగముగలో యనవధానతచే నా బాలుని తప్పించలేక

పోయెను. అవును అది సరికాని కొందరా పిల్లవాని నా రథ చక్రముల క్రిందకు యువరాజనిన గిట్టని వారెవరో కావలెనని బలవంతముగ ద్రోసి నట్లున్నదని చెప్పుకొనుచున్నారని యొకరు, మనకుఁ దెలియదు, ఏమైన నేమి బాలుఁడు మరణించుట జరిగినది కద ! మన కెందుకు, మనము పోవుదమనుకొనిరి.

ఇట్టివే ప్రసంగము లనేకముగ నగరమున కూడలి స్థలములందు విన్పించుచుండెను.

తెల్లవారినది. ప్రొద్దెక్కుచున్న కొలఁది రాజుగారికొలువుకూటము జనసమూహముతో క్రిక్కిరిసి పోవుచుండెను. ప్రజలలో నాతురతయో, వేదనయో, కౌతుకమో యెదియుఁ దెలియుట లేదు వెండి బెత్తముల వారి యదలింపులు ప్రజాసందోహముపై బనిచేయకుండెను.

క్షణమొక యుగముగ ప్రజలంద అనిమిషనేత్రులై ప్రభువు రాకకై ప్రతీక్షించుచుండిరి. చూచుచుండగనే ప్రభువు వచ్చుచున్నాడనిన యలజడి కలిగినది ప్రభువు సరదము వచ్చినది. అటుపై రాణి వాసము, పిమ్మట యువరాజ స్యందనము !

రథముపై యువరాజు నిశ్చలుఁడై యున్నాఁడు. కడచిన దినము నందలి వేగము నౌత్సుకము మచ్చునకైన గానవచ్చుట లేదు. నేఁడాతఁడు రధికుఁడు. నేఁడు ప్రజలెల్లరాయనను కనులార తిలకించిరి. సద్దుమణిగి సభయందు నిశ్శబ్దత రాజ్యమేలుచుండగా సభాప్రారంభమునకాజ్ఞ నొసఁగ బడెను. ఆయన గర్భనిక్షిప్త మహాగ్నియైన శమీవృక్షమువలె గంభీరుఁడై యుండెను. ఆయన నేత్రములు మంచు కురిసిన మందారములై రక్తము

నుమియు చున్నట్లుండెను. ఆయన ఫాలమున స్థిర సంకల్పము మనస్సు నందు పరిదేవనయు దోబూచులాడుచుండెను. రాణివాసము, సభాస్తారులు తమకుఁ గన్పించునట్లును, తామెవరికిఁ గన్పింపని రీతిగను నమర్చిన యాసనములపై నుపవిష్టులైరి.

త్రిలోచన నందికా ద్వితీయయై వచ్చెను.

సభాప్రారంభము జరిగినది. యువరాజు విచారింపఁబడుటకు నిలపెట్టఁబడును. రాణివాసము కనులు మూసికొనిరి. మహారాజవనతవదనుడయ్యెను. ప్రజలెల్లరాశ్చర్యచకితులైరి. త్రిలోచన సాకూతముగ నందికను తిలకించెను. యువరాజు మాత్రము నివాత దీపకళికవలె నిశ్చలుఁడై నిలచెను. ఆయన నట్లు చూచుచున్న త్రిలోచనకు నరమేధము నాడు ఇనుప స్తంభమునకు బిగింపబడిన యజ్ఞదత్తుఁడెట్లుండెనో, ఎట్లు తిలకించెనో యట్టి లక్షణములే యువరాజునందు చిత్రముగ భాసించెను.

ప్రమాణ స్వీకారమైన పిమ్మట ప్రాడ్వివాకుఁడు యువరాజును ప్రశ్నింప ప్రారంభించెను— 'యువరాజా! మీరు రథమును నడుపుకొనుచు పోవునప్పుడా బాలుని గమనించలేక పోయినారా!''

,,నా రథవేగమున నేను చూడలేదన జాలను. కాని, సాధారణముగ నా రథమును వేగముగ నడుపుట నా కిష్టము. అయిన నింతవరకెన్నడు నొక చిన్నజంతువైన నా వాహనము క్రిందఁబడి యీల్గినదిలేదు. నా రథచోదన సామర్థ్యముపై నా కంతటి ప్రత్యయమున్నది. !''

"అయినచో నా ప్రమాదమెట్లు జరిగిన దందురు ?''

"అయ్యా ! నే నెంతటి వేగమున గమించుచున్నాను, నేను గను నించినది తెలియఁజేయు చున్నాను. ఇంద్ర కీలాద్రి పాదదేశమును సమీ పించునంతకు సరిగ నెవ్వఁడో ఆ బాలుని నా రథచక్రముల క్రిందఁ బడునటుల బలవంతముగ నెట్టినాఁడు."

"ఆ నెట్టినవానిని తమరు గుర్తింపఁజాలుదురా ?"

"కష్టము ఆ జన సముద్రమున జలకణమును రెసలేని యా వ్యక్తిని గుర్తించుట సుదుర్లభము !"

"అగుచో నేరము మీ పై స్థిరపడుచున్నది కద !"

"దైవ సంకల్ప మెట్లున్న నట్లు జరుగును !"

"మీరు చెప్పున దింకేమియు లేదా ?"

"నాకుఁ దెలిసిన దింతయే ! అంతకు మించి నేనేమియు చెప్పఁ జాలుదును !"

"మన రాజ్యమున నిట్టియపరాధమునకు శిక్షయేమో మీకుఁ దెలియునా !"

"తెలియవలసినది నాకుఁగాదు."

"నన్ను చెప్పుమందురా ?"

"అనవసరము !"

సభాభవన మంతయు చీమచిటుక్కు మనిన విన్పించు నంతటి నిశ్శబ్దముగ నుండెను సభాసదులెల్లరు చెవులు కన్నులేకము చేసికొని చూచుచుండిరి, వినుచుండిరి. యువరాజు నైశ్చల్యమునకు నిర్భీకతకు నెల్లరు విస్మేలు పోవుచుండిరి. మృత్యువు సన్నిహిత మయినప్పుడు నైరమునంత ధీరుండై యుండుట యువరాజునకే చెల్లినది! కుమారుని సమాధానమున కానంది చవలెనో ఖేదముం జెందవలెనో మహారాజునకు బోధపడునట్లులేదు. చంద్రావతీదేవి కన్నులవిరళముగ వర్షించుచునే యున్నవి. సుదర్శన స్మృతిరహిత! త్రిలోచన మహారాజు నిర్ణయమున కెదురుచూచు చున్నది.!

"మహాప్రభూ! యువరాజుగారు నుడివిన దాలించినారు కద. ఇప్పుడింక నేమి చేయవలెను ?"

మహారాజు గంభీరముగ — "శిక్షాస్మృతి ననుసరించి యీనేరమునకు విధింప వలసిన శిక్షను నిర్ణయింపుడనెను.

"ప్రాడ్వివాకుండు చలించి పోయెను!"

"ప్రభూ! ప్రభూ! వలదు. యువరాజునకట్టి శిక్ష విధింపరాదు. భావి సర్వాంధ్ర సామ్రాజ్యాధినేత కాందగిన యువరాజున కట్టి శిక్షను విధించుటనుచితము!"

"నేరస్థుడైనవాండు రాజైనను, రైతయినను నొక్కేశిక్ష! శిక్షకుం దరతమ భేదములుండునా?"

"ప్రభూ! తామట్లు సెలవిచ్చిన మేమనగల్గిన దేమున్నది? ప్రతి సూత్రమున కపవాదమున్నట్లు శిక్షాస్మృతి యందలి తీర్పులకు సైతమప నాదము లున్నవి ప్రభూ!"

"అట్టివి న్యాయ సమ్మతములు కావని మాయభిప్రాయము! ప్రభువే నీతిరహితముగఁ బ్రవర్తించిన రాజ్యమున పాలితుల విషయము చెప్పనక్కఱయేలేదు.

"యథారాజా తథాప్రజా!" నేరమునకు స్మృతిహితమైన శిక్ష మేమోతెల్పుడు"

"మాకు వాయి వచ్చుటలేదు ప్రభూ! యువరాజు సకల సద్గుణ సంపన్నుడు. ఆంధ్ర సామ్రాజ్యమునకుఁ గాఁదగిన వారసుఁడు. అట్టి వానిని బుద్ధిపూర్వకముగ కాని నేరమునకై, ఎవరో గిట్టని వారన్యాయ ముగ నాయనపైఁ బగబూని నేరస్తునిగ నిరూపించదలఁచి చేసినట్లున్న యీ నేరమున కీయన శిక్షను తొలగించిన దోషములేదు అట్టి యభియోగ ములు, తీర్పులు లేకపోలేదు."

"అది యంతయు మన కనవసరము. యువరాజనిన గిట్టని వారె వరో యాబాలుని బుద్ధిపూర్వకముగ బలవంతముగ రథము క్రిందకు త్రోసినారన్న విషయము ఋజువు కావలెగద! అట్టిది లేనప్పుడు యువ రాజపరాధి యనక తీరదు. కావున మీ నిర్ణయమును నిరాక్షేపముగ వెలి బుచ్చుడు."

ప్రాడ్వివాకునికి సభాస్థారులందఱకు పరమాశ్చర్యముగ నుండెను. 'ఇదియేమి రాజు! ఇది కలియుగమా? కృతయుగమా!' యనుకొనిరి.

యువరాజు తన తండ్రి మాటలకు మనస్సునందు సంతోషముఁ జెందెను. తన జనకుఁడు దేవతాత్మ! పూర్వజన్మ సుకృతమునఁ గాక యట్టి జనయిత సుదుర్లభుఁడు! తా నదృష్టవంతుఁడు. తనకు జనింపఁబోవు చిన్ని మాధవవర్మ కూడ నిట్టివాడై నఁ జాలును! తన జన్మము ధన్యతఁ జెందినట్లే!

సభ నిశ్చేతనముగ నున్నది. ఉన్నట్లుండి యా మరణించిన బాలుని తల్లి "అయ్యా! నాకు న్యాయముఁ జేకూర్చుడు నాబిడ్డడు చనిపోయినాఁడు అతఁడు నాకుసర్వవిధముల నాధారమయినవాఁడు. నాకంటి వెలుఁగాతఁడు! నేనెట్లు బ్రతుకుదును దేవుఁడా! యని యెలుగెత్తి యాక్రోశించెను. భటులామె నూరకుండునట్లు నియమించిరి.

'ప్రాడ్వివాకుఁడిక తీర్పు పీయవచ్చున'ని మహారాజనెను.

,"ప్రభూ! శిక్షాస్మృతి ననుసరించి నిందితునికి మరణదండనే విధింపఁబడు చున్నది!"

సభయంతయు నొక్కసారిగ జలదరించినట్లయినది! మహారాజు స్థాణుభూతుఁడై పోయెను. యువరాజు తండ్రివైపునకు చూచుచుండెను. తన తండ్రి మోమున నాడు యజ్ఞదత్తుని యావమునకు బిగించు చుండగా నాడిన భావవీచిక లీనాడును కన్పించినవి. నాడు యజ్ఞార్థమై యాబ్రాహ్మణ వటువును తెచ్చెను. నేడు న్యాయ స్థాపనమునకై తన కుమారునే బలి పీఠమున నిల్పుచున్నాడు! అంతటి మహోదారమైన మనోధర్మముఁ గలిగియుండుట మిక్కిలి యరుదు. యువరాజు హృదయమునిండ తండ్రియే నిలచిపోయెను. మహారాజు పీఠముపై నుండిలేచి

జలద గంభీరకంఠ నిస్వనమున నిట్లనెను— "శిక్షాస్మృతి ననుసరించి ప్రాడ్వివాకుఁడు నుడివిన ప్రకారము నిందితునికి ప్రాణదండన విధించు టయినది ! రేపు సూర్యోదయా త్పూర్వ మీశిక్ష యమలు జరుపబడవల యును."

మహారా జావివిష్టుడయ్యెను.

శిక్షానిర్ణయమునకు లేచి నిలబడిన మహారాజు మేరుమందర సమా నుఁడు ! కూర్చుండి పోయిన మహారాజు పిడికెడు మాంసపుముద్ద క్రుంగి పోయెను. సభయంతయు హాహాకార ముఖరితమై పోయెను !

సభలో యజ్ఞదత్తుని తండ్రి నృసింహశర్మకూడ నుండెను. మహా రాజు తన కుమారుని యజ్ఞపశువుగఁ జేసెను. యువరాజైన తన కుమా రుఁనీనాడెట్లు శిక్షించునో చూచెదనని కక్షతోవచ్చెను. మ రాజు న్యాయ నిర్ణయమునకు విస్మయము జెంది సిగ్గుతో తల వంచుకొని మహారాజున కును తనకును సామ్యమెచ్చటనని భావించుచు వెడలి పోయెను.

సభయంతయు క్రమముగ పలుచబడుచుండెను. మహారాజు కదల లేదు. రాణివాసము కదలలేదు !

మట్ట మధ్యాహ్న సమయము. మహారారాజు లేచి యభ్యంతర మందిరమున కేగెను. రాణివాసమాయ నను గమించెను. యువరాజు తండ్రిని సమీపించి— "ప్రభూ ! నిందితుఁడు శిక్షితుఁడు నైన యువ రాజు నమస్కరించుచున్నాడు." అని ఆయన మహారాజునకు పాద నమస్కార మొనర్చెను. మహారాజు మనస్సు కరలి పోయెను. ఆయన నిలువరించు కొనజాలక— "నాయనా, గోవిందా ! నేనిప్పుడు

ప్రభువును గాను. నీ కన్న తండ్రిని. కసాయివాడనోయీ ! ఈకీ తండ్రిపై నీ కింకను గౌరవమున్నదా ! నేనందుల కర్హుడను గానయా ! నేను కిరాతుడను !" అనెను.

మహారాజు యువరాజునులేవనెత్తి హృదయమునకు హత్తుకొని యాతని మోమును తన హస్తములతో తడవుచు శిరముపై ముద్దిడి— తండ్రీ ! అనలేక కంఠము రుద్ధముకాగా భళ్ళున పగిలి యార్చుచు చతికిలబడి కన్నీరు తుడుచుకొనుచు "నేను మహారాజును. మహారాజులకు సంతానముండకూడదు ! ప్రేమయుండరాదు ! కర్తవ్యము, ధర్మము రెండే కావలసినవి ! ఈ దీనుడైన మహారాజును నీ యీ తండ్రి నెట్లుగ భావించుచున్నావో ! నేనేమి చెప్పను ?" అని వాపోయెను.

"నాన్నగారూ ! తాము నాకు పితృదేవులగుటకు నేనెంతయు గర్వించుచున్నాను. మీ నిర్ణయములు ధర్మ సమ్మతములు. జగద్విదిత మయినవి. మీ యాత్మ దేవతాత్మ ! మీ తీర్పులు సమంజసములు ! నాకెట్టి బాధయులేదు. నాకు మీపై గౌరవ మినుమడించినది గాని తరిగి పోలేదు. మీ నిర్ణయమును నేను సర్వాత్మనా పాలింతును. అందులకు సంసిద్ధుడనై యున్నాను."

మహారాజునకు తన కుమారుని సౌజన్యమును భావించిన కొలది దుఃఖము పొంగులెత్తుకొని వచ్చినది. గోవిందవర్మ యచ్చముగ యజ్ఞ దత్తుని వలె మాటాడినాడు. ఏమి వ్యక్తులు ! పరమాశ్చర్యబుద్ధులు ! ఇట్టి తనయులు జన్మించుటచే తానును నృసింహశర్మయు ధన్యులైనారు !

చంద్రావతీ దేవి కుమారుని కౌగలించుకొని బిట్టు విలపించెను. సుదర్శన కన్నులు కళాహీనరులైనవి ఆమె చూపు నిశ్చలమై

పోయినది. త్రిలోచన నేత్ర ద్వితయమున సుఖదుఃఖములు తాండవించు చుండెను. ఇట్టి తండ్రి కుమారుల మధ్య తాను తనయునికియు హాస్యా స్పద మనిపించెను. వారల యచ్ఛమయిన సౌశీల్యమునకు ఆమె మనస్సు నందుననే నివాళులెత్తినది. సునీతివర్మ తన సర్వమును గోల్పో యిన రాజువలె క్రుంగిపోయెను.

సమయము దొర్లిపోవుచున్నది. యువరాజు కల్లికి ప్రణమిల్లి సుద ర్శనను స్పృశించి సునీతివర్మ నాలింగనము చేసికొని, త్రిలోచన యొద సెలవుగైకొని తిరిగి మహారాజునకు పాదాభివందన మొనర్చి భటులు వెంటరాఁజెఱసాల కేగెను. రాజపరివారమంతయు తమ తమ నెలవుల కేగిరి.

యువరాజుశిరచ్ఛేదముచే చిమ్మినరక్తాసారము జగమెల్లవిండి శోణ కాంతులు దాల్చినటుల ఉదయ సంధ్యారాగము రాజప్రాసాదమును వెలి గించు చుండెను. రెండు దినములుగ విద్ర నెఱుఁగని రాజకుటుం బము కన్నులు రక్తముఁ జిమ్ము చున్నట్లుండెను!

అయిపోయినది! మాధవవర్మ మహారాజు ప్రథమ సంతానము, భావి సామ్రాజ్యాధినేత యువరాజు శిరచ్ఛేదము జరుగు సమయమున కోటి సూర్యులఁ బరిహసించునంతటి తేజోవంతమైన వెలుఁగొక లిప్త కాలము చూచువారల కన్నుల నాంధ్యము ద్రిమ్మరించినది. ఆ యాంధ్య మునందే మెఱపు తీవలవలె బంగారు నాణెములు కనకధారయై వర్షించి నవి!

తెల్లవారు వరకు రాజధాని యందంతటను బంగారు నాణెములు వెదజల్లబడి యుండెను. ప్రజలెల్ల రాశ్చర్యమగ్న మానసులైరి. దేవి

దుర్గాంబ మాధవవర్మ ధర్మ నిర్ణయమునకు సంప్రీతురాలై సువర్ణవృష్టిని గురిపించినది. మహారాజు ధర్మబుద్ధిని పొగడుకొనుచు ప్రజలెల్లరా నాజ ముల నేరుకొనిరి !

త్రిలోచన పల్లవికి మామగారి దేవపూజా మహిమపై నపరిమిత విశ్వాసమేర్పడెను. ఈ వార్త ఆంధ్ర సామ్రాజ్యము నంతటను విద్యు ద్వేగమున ప్రసారితమయినది మాధవవర్మ మహారాజు ధర్మ నిర్ణయము నకు మెచ్చి శ్రీ దుర్గాదేవి ప్రీతిచేతస్కయై కనకవర్షముఁ గురిసినది. నాటినుండి యామె కనకదుర్గయైనది !

ఎవరెంత మెచ్చుకొనినను యువరాజు లేచివచ్చునా ? బంగారు తండ్రి యేజన్మమునఁ జేసికొనిన పాపముల పుట్టయో పగిలి యీ నాడిట్లు పుత్రశోక రూపమున దాపురించినది ! చంద్రావతీదేవి కహర్నిశలు గోవిందవర్మ స్మరణము వినావేరొండు కార్యము లేదు. ఆమె మనసా చివికి పోవుచుండెను. ఆమె దేహమున నెదోరుగ్మత ప్రవేశించినది. రాజ వైద్యులెంత ప్రయత్నించి యెన్ని యౌషధముల వాడినను ప్రయో జనము కన్పించుట లేదు.

మహారాజునకు మనస్సు మనస్సులో లేకుండెను. ధర్మవిరతికై కుమారుని పోగొట్టుకొనినది చాలక యిప్పుడిఁక భార్యయేమి కానున్నదో ! ఆయనకు వార్ధక్యము తఱుముకొని వచ్చుచున్నట్లుండెను !

యువరాజునకు మరణదండన విధించిన నాటినుండి సుదర్శన చూపులట్లే పిచ్చిగ నిలచిపోయినవి. ఉన్మాదమువంటి దేర్పడినది. ఆమె యెవరితో మాటాడదు. తనలో తాను నవ్వుకొనును, అంతలో నేడ్చును. నిముసములో సర్వాభరణముల నలంకరించుకొనును. మరు నిముసమున

నన్నింటి పెరికివైచి జుట్టు విరియఁబోసికొని విరుగబడి నవ్వును. ఆమె యెవరి మాటను మన్నించదు. త్రిలోచనను కొంచెము మన్నించును. అటు చంద్రావతీ దేవిని యిటు సుదర్శనను జూచుకొనలేక త్రిలోచన సతమత మగుచున్నది !

యువరాజు మరణించి నెలదినములు గడచినవి. కోటలో శోక దేవత నాట్యము జేయు చుండెను. పినాకభట్టారకుఁడు వచ్చెను. ఆయనను చూచి మాధవవర్మ దుఃఖమాపుకొనజాలక పోయెను ఆయన భట్టారకుని కౌగలించుకొని బిట్టు విలపించెను. పినాక భట్టారకుఁడాయనను పట్టుకొన లేకపోయెను. ఆయన యిట్లనెను— "ప్రభూ ! మీకేమి మీరు సర్వము దెలిసినవారు. మీరు సైతమిట్లు దుఃఖపడుచో మహారాజ్ఞి యేమికావలె ! యువరాజున కాయుర్దాయము తీరినది. మీ ధర్మ నిర్ణయమును సాకుఁగ నాతని మృత్యువు సంభవించినది. మనమెవర మెందులకుఁ గర్తలము కాము."

"భట్టారకా ! యువరాజు శిరచ్ఛేదము జరిగిన నాటనుండి నన్నొక సందేహము వేధించుచున్నది. నీవు నగరమున లేవు. నీవుండి నచో నాతఁడు సంరక్షింపఁబడెడి వాడేమో ! నేనానాడు యజ్ఞదత్తుని బలి పశువుగ చేయకుండ నుండవలసినది ! ఆ పుణ్యదంపతుల శావములు నా కుమారునికి తగిలినవయ్యా ! యజ్ఞదత్తుని తల్లివలెనే చంద్రావతీదేవి శుష్కించి పోవుచున్నది. సుదర్శన కున్మాద మేర్పడినది. నీ స్నేహితుని సంసారము తుదకిట్లు తయారైనది. ఇవన్నియుఁ జాలవన్నట్లు పులకేశి మనపై అచిర కాలములో దండెత్తి వచ్చుటకు సన్నాహముల చేయుచున్నటుల వార్తలు వచ్చినవి. ఈ కష్టములన్నియు నాకేసారి చుట్టుముటినవి !"

"ప్రభూ ఓరిమి కావలెను. కష్టములు మానవులకుగాక ప్రాణులకు వచ్చునా !"

"ఎంతకని యోర్చుకొమ్మందువు ! దేనికైన హద్దుండవలదా !"

"మీరు ప్రాకృతుల వలె డిల్లపడుట న్యాయమా ?"

"పినాకీ ! నేను నరమేధ మొనర్చుకున్నచో బాగుగ నుండెడిదేమో !"

"ఎందువలన ?"

"ఆ యజ్ఞ ఫలితముగనే యిట్లు జరిగిన దనిపించుచున్నది !"

"మహారాజా ! నేనొక ధర్మసూక్ష్మమును మనవిజేసెదను, యజ్ఞ యాగములున్నవి వానినేదో యొక ప్రయోజనము నర్థించి చేయుచున్నాము. ఆ ప్రయోజనము సిద్ధించు చున్నది గద ! అది యంత వరకే ! ప్రతికార్యమునకును రెండు ముఖములున్నవి. మంచి జరిగినదని సంతసింతుము. చెడు జరిగినదని దుఃఖింతుము. జగత్తంతయు కర్మాధీనముగ నడుచు చున్నది. మీరుచేయు ప్రతిపనీ మీ భూత భవిష్యద్వర్తమాన జీవిత పద్ధతిని సూచించుచుండును. నరజన్మమెత్తిన భగవంతునికైనను నిట్టిది తప్పలేదు. శ్రీరామ చంద్రుఁడేమిచేసెను ! వాలిని పరోక్షమువనుండి సంహరించెను. అప్పటికది ధర్మమే, నీతియే, కాని తరువాత తన్నా ధర్మము కట్టికుడిపి జీవితాంతము భార్యా విరహియై జీవించవలసి వచ్చినది. రావణుఁడు లోక కంటకుఁడు. ఆయనను సంహరించి లోకముల సంరక్షించెను. కాని ఆయనకు బ్రహ్మ హత్యా

దోషము టుకొన్నది కద ! [illegible] కిరాతుని బాణహతిచే హతు[illegible] మును కర్మాధీనమై [illegible].

మీరు నరమేధ మొనర్చు[illegible] నర[illegible] యజ్ఞ కర్త తన్ను తాను బలిపశువుగ [illegible]ంచుకొని యున్నా సర్వ విషయముల నుండి విరామమును పొంది [illegible] గావించి భగవదర్పితుండగుటయే కత. అప్పుడింక వ్యక్తి లోని ప్రవృత్తియును సరించుచున్నను అన్నింటి నుండి దూరుడై ముక్తిం జెందిన యనుభవమును పొందియుందురు. దాని మూలమును సంభవించు ఫలిత[illegible]ండగా నీ నరమేధము వలన దుష్ఫలితము లెట్లుండును ? [illegible] బ్రాణ మీ వలనివచ్చినది. కర్మరీతు లిట్లే యుండును. ఆ వృద్ధబ్రాహ్మణ దంపతుల శాపము మీ కర్మ పరిపాకమై యుపలాబ్ధ శిక్షింపబడినాడు. ఆతని యందలి యమిత వేగాభిరతి యాతనినట్లు చేసినది. అందువల్లనే యిట్టి క్లిష్టములైన యజ్ఞ కర్మలను సాధారణముగ నేయను సంకల్పించరు."

"అయిన మీరు నన్నేల వారించ లేదు ?"

"ప్రభూ ! మీకు వచ్చిన నష్టమేమున్నది ! మీనామ మితిహాసములో మహాసామ్రాజ్యాధినేతగ యజ్ఞకర్తగ, న్యాయశీలిగ, ధర్మాచరణ సంపన్నుండుగ చిరస్థాయిగ నిలచి పోగలదు ! శ్రీదుర్గామ తల్లి మీ ధర్మ నిరతికి సంతసించి సువర్ణవృష్టిం గురిపించినది ! [illegible] కము దివ్యమయినది !"

"అయిన విధి యంతయునేమి ?"

"ఇది కర్మ! చెప్పితిని గదా! మీ యంతటి మహారాజు మీ వంశమున మరి జన్మించఁడు. యువరాజంతటివాఁడు కాఁడు. మీకును నాదనిది సంబంధము లేదు. ప్రభూ! ధైర్యమును వహింపుఁడు."

"చెట్టంత కుమారుని పొట్టఁబెట్టుకొనిన నాకు ధైర్యముకాక మరే మున్నది! చంద్రావతీదేవి యేమగునో తెలియకున్నది. ఆమె బాధ చూడలేకున్నాను. గోవిందుని మరణమామెను క్రుంగఁదీసినది. పినాకీ! నీవు చూచుచున్నావు. నా జాతకమున గ్రహములు వక్రించి యుండును; నా గోవిందుని తల్లియైన నామె దక్కునా? సుదర్శన యెట్లుండును? చిన్ని మాధవుఁడుదయించునా?"

మాధవవర్మ యాందోళన జెందుచుండెను. పినాక భట్టారకుడు భయము లేదనుచు, కాని యది పెదవులపై నుండి వచ్చిన మాటయే!

దినములు భారముగ గడుచుచున్నవి. మహారాజ్ఞి వ్యాధి తీవ్ర రూపము ధరించినది. రాజ్ఞి గోవిందుని తలఁచుకొనుచుండును. శివారాధన నేమరదు. శిరఃస్నానమాచరించును; మహారాజు వచ్చిన మర్యాద చేయును. రాకున్న రాలేదనరు. ఆమె ప్రాణములామె విశాలములైన కనురెప్పల నంటిపెట్టుకొని యున్నవి. ఆ దీపమెప్పుడారి పోవునో!

రాజవైద్యులు పెదవి విరచిరి. మహారాజు కుమిలిపోవుచుండెను. భట్టారకుని యనునయ వాక్యములచే నాయన వేదన యుపశమించుట లేదు. విష్ణుకుండిన వంశమునకు తుదకెట్టి దుస్థితి సంభవించినది! ఇఁక ముందేమి కానున్నదో! పులకేశి దండయాత్ర కూడ వచ్చిపడినే గాని పూర్తిగాదు! ఆ పులకేశి కంత రాజ్యదాహ మెందులకో! తాను

మాత్ర మట్టి దండయాత్రలను నడపియుండలేడా ! క్షత్రియుఁడైన వానికి రాజ్య విస్తరణా కాంక్ష జన్మహక్కువలె నున్నది !

సమకాలీనులైన రాజులలో తనకు మించిన సమర్థుఁడు లేడు. తన కున్నంత శౌర్య మెవరికిని లేదు. రథాశ్వగజ బలములు తన కుండినంతగ నితరరాజు లెవ్వరికి లేవు. పులకేశి తాను తరిమి వేయఁ జాలఁడా ! ఇట్టి సందేహము మున్నెన్నడును తనకు కలుగలేదు. నేడెందుల కీ యూహ యంకురించినదో ! దుఃఖము మానవునెంత క్రుంగ దీయును ! ప్రాణాధికుఁడైన యన్నగారు మరణించగా సునీతి బెంగపడి పోయినాడు. దేవవర్మ ఇంద్రవర్మలకు చీమకుట్టినట్లయిన లేదు ! అవును. రాజ్యదాహము బంధుతను, రక్త సంబంధమును పాటించ నీయదు గద !

యువరాజస్తమింపగా తాము సునీతివర్మను నరకుగొనక రాజ్యాధికారము చేజిక్కించుకొనవలెనని వారల తంత్రములు ! ప్రావి వరుసలు లేవు. అన్నదమ్ములని లేదు. ఒకరినొకరు సంహారించుకొనుటలే ! ఏమి రాజ్యములు, ఏమి రాజులు ! ఇట్టి రాజుల కతమననే 'రాజ్యాంతే నరకం ధ్రువమ్' అను నార్యోక్తి వెలసినది అంతఃదనుక నెందులకు ? రేపు పులకేశి దండెత్తి వచ్చుచో నతని నెదుర్కొనక సమర్థుఁడైన తానూరకుండునా ? మరల నరమేధమే కద !

పినారక భట్టారకుఁడేమో చెప్పును. అప్పటికా మాటలు మన శ్శాంతిని కలిగించినట్లుండును. ఆయన కనుమఱుగగునంతనే ఆయన నుడువులను మనస్సున మఱుగుపడును. ఈ మనస్సు మిగుల చిత్రమైనది. బుద్ధి వచ్చినట్లే యనిపించును మఱలరాదు ! దేని వనహ్య

ముగ భావింతురో దానినే తిరిగి తిరిగి చేయుదురు. ఈ లోకము తీరింతే నేమో : దీనికి పరిష్కారములేనే లేదేమో !

ఏమైననేమి ! నరమేధము తనను పట్టి వల్లార్చుచున్నది యాజ్ఞికమయిన నరమేధము, సమరరంగమున జరుగు లౌకికమయిన నరమేధము! ఈ నరమేధమున కంతులేదు వలె నున్నది. గోవిందుఁడే మనివాడు ! తాను దేవతాత్మయఁట : తానొనరించిన కృత్యము లన్నియు దేవతా ప్రీతికరములఁట : అతఁడెంత వశ్య వాక్కు ! నిజముగ భగవతి శ్రీ కనకదుర్గా మహాదేవికి తనపై నెంతటి యనుగ్రహము : తన యకృత్యమును మన్నించి కనకధార కురిపించి లోకమున తన్ను పుణ్య పురుషునిగ స్థాపింపఁదలఁచినది కాఁబోలు ! ధర్మరక్షకుఁడుగ తానై చేసిన దంతయు ధర్మబద్ధము కాఁబోలు ! కాని జనయితరగ తానొనర్చిన దానికంటే హేయమైన కార్యముండునా : "విషవృక్షమపి సంవర్ధ్య స్వయంఛేత్తు మసాంప్రతమ్ " అని కద ! తనకన్నబిడ్డ సుగుణముల ప్రోవు, యువరాజు. తాను వానిని శిరచ్ఛేదము చేయించినాడు. పినాక భట్టారకుఁడు చెప్పినట్లు దీనికి గూడ కర్మానుభవముండవలె గద !

మాధవవర్మ మహారాజాలోచనా పరంపరలచే తాడితమైన మనస్సుతో రేయెల్ల కంటిమీఁద కునుకు లేకుండ గడపెను. తెల్లవారినది. చంద్రావతీదేవి సౌధము నుండి కబురువచ్చినది : పట్టపురాణి స్థితి నాటి నాటికి క్షీణించిపోవుచున్నది నేడు మరియు నధ్వానముగ నున్నది. రేయి పేగినగాని యామె బ్రదుకును నిశ్చయముగఁ జెప్పలేమనినారు రాజవైద్యులు ! వైద్యులందఱు తప్పుకొనిరి.

వాడిన ముద్దమందారమువలె త్రిలోచన ముఖాగ్రానికి పరివసించు చుండెను. సునీతివర్మ దీనవదనుఁడై తల్లిపాదముల చెంగట నిశ్చలముగ కూర్చుండి పోయెను. సుదర్శన యోధుడు తెలియని నిద్రముంపులో నుండెను. చంద్రావతీదేవి పూజామంటపమున మహాదేవుఁడు మూర్తిని సర్వాలంకార భూషితుఁడై, విభూతి విభాసితుఁడై, బిల్వ పూజితుఁడై పులుగడిగిన ముత్యమువలె మిలమిలలాడు చుండెను. ఆయన సన్నిధి మున చంద్రావతీదేవి యాదేశముగ నఖండము వెలిగింపఁబడి యుండెను జ్యోతి విశ్వలముగ వెలుగుచుండెను. మందిరమంతయు సుగంధ ధూప ములచే సురభిళముగ నున్నది. మహారాజు స్నాతానులిప్తుఁడై మహా దేవార్చనలు చేసెను. చిత్రముగ ప్రభువునకా దీపకళికలలో నాయఖండ జ్యోతిలో గోవిందుని కన్నులు తన్నవలోకించు చున్నట్లు భ్రమయొద వినది! నాడు మహారా జుపవసించెను. మహారాజనియేమి! రాజపరివార మంతయు నట్లే నిరాహారముగ నుండిపోయెను.

మహారాజ్ఞి నీరసించిపోయినది. ఆమె వదనమున తెలివిమాత్రము ధగధగలాడుచున్నది. ఆమె కన్నులు ప్రకాశవంతములై తరలజ్యోతుల వెలిగ్రక్కుచున్నవి ఆమె శుభ్రవసనములఁదాల్చి మొగమున గుంకుమఁ దీర్చికొని దానిక్రింద శివవిభూతి నలకొనినది. శిరోజాలంకరణమునకై పరిచారికల కాజ్ఞయిడినది. వారామె నలంకరించి కేశబంధమున పూమాల నుంచిరి. మహారాజ్ఞి యెఱ్ఱని పట్టుచీరధరించి పసుపుపచ్చని రవికఁదొడి గినది. పుణ్య స్త్రీ జనోచితమైన సర్వాలంకారములు చేయించుకొనినది. సుగంధ ద్రవ్యముల మేననలఁదుకొని లేనియోపికఁ దెచ్చికొని మహా దేవుని మందిరమునకు త్రిలోచనా సునీతవర్మ లిరుదెసలఁ బట్టుకొని తీసి కొనిపోవగా పాదచారిణిగ పోయినది. స్వామికి వందన సమర్పణ గావించి — "మహాదేవా! నాభర్త పరమపుణ్యమూర్తి! ఈ సంగతి

ములు నెంతధర్మ సమ్మతములో శ్రీదేవి కనకదుర్గామతల్లియే లోకము నకుఁజాటి చెప్పినది ! మీసుగుణముల బంగరువానగ కురిసినది. మీధర్మ ప్రవృత్తి కంతకుమించిన నిదర్శనమేమి కావలెను ? నాకు పరమ సంతృప్తికరముగ నున్నది. నాకిక తీరవలసిన కోర్కెలులేవు. మహా దేవుని పిలుపుకొఱకెదురు చూచుచున్నాను !"

దేవీ ! నీవెందుకింత బేలవగుచున్నావు ? నీవుత్వరితముగనే పూర్ణా రోగ్యమును పొందఁజాలుదువు. నీబుల్లిమనుమని నెత్తుకొని ముద్దాడ గలవు !"

"కాదుస్వామీ ! నాకిఁక విలుకడలేదు. సుదర్శనను తలచుకొనిన గుండెలు కొట్టుకొనుచున్నవి. ఆ బిడ్డఁడు నిజముఁగ బ్రదికి బట్టకట్టు నా యని !"

చంద్రావతీదేవినాడు శివప్రసాదముగ పరమాన్నమును భుజించి నది. సంధ్యాసమయమున మహాదేవునర్చించినది. యువరాజు పరమపదిం చినదిమొదలు ఆమెనింత యుత్సాహవంతురాలివిగా నెవ్వరును చూడ లేదు. ప్రమాదము తప్పినది, వ్యాధి నెమ్మదించిన దనుకొనినారు.

చీకట్లుముదిరినకొలఁది మహారాజ్ఞిస్థితి మారిపోఁదొడఁగినది ! మహారాజామె నామెసౌధమునకే గొంపోవుదమనుకొనెను. ఆమె యందు లకు సమ్మతించలేదు. తన దేవుని సమక్షముననే తానుండెద ననెను. ఆమె అభిలషితము మన్నింపఁబడినది. వైద్యులు తామిఁక చేయవలసిన దేమియు లేదనిరి. సమయము దొర్లిపోవుచున్నది. వెలుపల చీకట్లడవి యేన్గులు గుములు గుములుగ వచ్చినట్లున్నవి. ఆకసమున కాఱుమేఘ

ములు వాని ప్రతిబింబములవలె నలముకొనినవి నా డమావాస్య సోమ వారము. శివ ప్రీతికరమైన దినము మహారాజ్ఞి ధ్యానమో లేక నీరసమో మాదకతయో తెలియనిస్థితిలోను మహాదేవు నరమోడ్పు కనులతో తిల కించుచుండెను. మహారాజూరక స్థాణువువలె దేవివంకను మహాదేవుని వంకను జూచుచుండెను. ఆమె మాటాడదు. ఆయన మాటాడదు. మం దిరమునం దఖండ జ్యోతిమాత్రము నిశ్చలముగ వెలుగుచున్నది.

అట్లెంత సమయము గడచినదో వారిరువురకును తెలియదు. వాకిట నురుములు మెఱపులు హోరుగాలి పెనుగాలి పెనుమ్రోతలుగ వర్షమారంభించినది. ఒక పెనుగాలి కెరటము మందిరములోనికిఁ జొచ్చు కొని వచ్చుటయు నఖండజ్యోతి యారిపోవుటయు చంద్రావతీదేవి భర్తృ పాదదేశమున నొఱగి పోవుటయు నైకకాలికముగ నైనవి. తన పాదము లపై నొఱగిన చంద్రావతీ దేవిని లేవనెత్తుటకు చేయిచాచిన మహారాజా మెను విగతజీవిగఁ దెలిసికొనుటకు క్షణము పట్టలేదు. ఆయనకు దుఃఖము కుత్తుక బంటియైనది. సర్వము నాశనమైనది. తన దారా పుత్రులు నశించిరి — "ఓయి మాధవవర్మా ! నీవు జీవితమున సాధిం చినదేమి ? నీ ధర్మబుద్ధి నీ గృహమును కాల్చివేసినది !

మహారాజునకు ధైర్యము చాలుటలేదు. చంద్రావతీదేవి పెండ్లి కూతురు వలె నున్నది ! మహారాజామె మోమును తన చేతులలోనికిఁ దీసికొని దుఃఖి చెను. ఈమె తన ధర్మపత్ని ! తన తొలివలపు పండిన స్వర్ణభూమి. స్త్రీయననేమో తెలియని నాఁడు స్త్రీ యనుభవ సర్వస్వమును తనకుఁ జూరలిచ్చిన ప్రణయమూర్తి ! తన హృదయ వేదికపై స్థిరు రాలైన మహాలక్ష్మి అర్ధాంగి శబ్దమున కర్థమీమెయే ! తానే

యామెగ జీవించినాడు. ఇప్పుడేమి చేయవలె! ఇంక ముందు తన బ్రదుకీ కాళరాత్రివలె నిలిచిపోవును కాబోలు! ఛీ! మాధవవర్మ యెంతటి లజ్జాహీనుఁడు! జీవన సుధాకలశము చేజారి వ్రక్కలై పోవగా తాను నీరసముగ మిగిలినాడు. మహాదేవుఁడెంత పక్షపాతమును జూపినాడు! ఆయనకే తనపై కరుణరాలేదు.

రాత్రియంతయు మహారాజు చంద్రావతీదేవి యొద్ద గల జీవితమునందలి మధుర స్మృతులఁ ద్రవ్వుకొనుచు దుఃఖించుచు గడపెను.

ఆయన వ్యథాభరిత హృదయము నుండి వెలువడిన వేదనా సంక్షోభములకు మహాదేవుఁడే సాక్షి!

# 10

ఆది మహారణ్య మధ్య ప్రదేశము, బ్రహ్మాండమైన శివాలయము. ఆ యాలయములో నుండి మేఘ గంభీర నిస్వనము వినవచ్చుచున్నది. "మహాదేవా! మల్లికార్జునా! తుదకీ నీ భక్తుఁడిట్లయినాఁడు. నీలీల లనంతరములు. నిరంతరము నిన్నే మనస్సున నిల్పుకొని నీ పదములే నిశ్వాసములని, నమ్మికొనిన నన్నింత పరీక్షించుట న్యాయమా ప్రభూ! నీజాయే, జగన్మాత కరుణించినది. కాదనను, నా ప్రియ పత్నిని ప్రాణ ప్రియుఁడైన కుమారుని నీ లోకమునకుఁ బిలుచు కొన్నావు. అవును. నేను మహారాజునే! మహారాజుగ న్యాయ నిర్ణయమున నా కన్న సంతానమునకు మరణదండన విధించితిని. అది రాజునైన నా విధి! మరి తండ్రిగ నొనర్చిన కార్యము క్రూరము మహాపాపము కద! "ప్రజాతంతుమ్ మావ్యవత్సేచ్ఛీత్" అను వాక్యము వివాహమునకు పరమార్థమై యుండగా నేను చేసిన పని యెట్టిది! పుత్ర ఘాతకుఁడైన తండ్రిని నీ వెన్నఁడైన జూచితివా స్వామీ! అదేమి నీ కనుగొనల నవ్వులు రువ్వుచున్నావు! ఓహో! తెలిసినది, శిరియాళుఁడుండెననియా! అది వేరు. అచ్చట నీవైకోరగా శివార్పణ బుద్ధితో చేసిన పనియది. నీవాతని మరల బ్రదికించితివి!

నా కుమారునట్లు కాదుగద! మహాలింగా! పుత్రహంతయైన తండ్రి కెట్టి శిక్షయు నుండదా ప్రభూ! తండ్రినై నేనొనర్చిన యీ పాపమునకు నిష్కృతి యనునదున్నదా! నా వంశమేమి కావలె!

పినాక భట్టారకుఁడనినట్లు ధర్మము కర్మము రెండును రెండుగనుండునా ! ఇప్పుడిఁక నేనేమి చేయవలె ? శివా ! శివా ! నన్ను నీలోనైక్య మొనర్చుకొనరాదా ! నాకీ లోకమున నంతయు శూన్యముగ నున్నది."

ఆ మాట లనుచున్నది విష్ణుకుండిన మాధవవర్మ మహారాజు ! శ్రీశైలమున వేంచేసిన మల్లికార్జున స్వామి వారి కారాధ్య దైవము. ఆయన శ్రీగిరికి వచ్చి పరమేశ్వరునితో తన గాథ మొఱ పెట్టుకొనుచున్నాడు.

వేకువజాము, వెలుఁగు రేకలింకను రూపుకట్టుటలేదు. రుద్రాభిషేకమప్పుడే పూర్తియైనది. మహారాజునకు మనస్సు మనస్సున లేదు. రాజ్య పరిస్థితులు సైతము బాగుండలేదు. విశాలాంధ్ర సామ్రాజ్యాకాశమున విషాదమేఘములు క్రమ్మినవి. యువరాజు మరణము మహారాజ్ఞి నిర్యాణ మీ రెండును చాలవన్నట్లు పులకేశి దండెత్తి వచ్చుచున్నాడను వార్త సర్వమనర్థదాయకముగ భాసించుచున్నది.

సుదర్శనకు నెలలు నిండినవి. ఆమె యున్మాదస్థిలో నెట్టి మార్పును లేదు. త్రిలోచనయే యామెను కనిపెట్టుకొని యుండెను. మహారాజున కేమిచేయుటకును పాలువోవక శ్రీగిరిస్వామికి నివేదించుకొనుటకు శ్రీశైలమునకు వచ్చెను. వచ్చెననగానేమి ! ఆయన దేహము వచ్చెను. మనస్సు రాజ్యకార్యముల నూహచేయుచుండెను. తాను వృద్ధుఁడైనాడు. పులకేశి మహాసమర్థుఁడైన రణనీతి విదుఁడు ఆతని కెదురొడ్డి నిలచుట కష్టసాధ్యమైన విషయము. తన మానసిక దౌర్బల్యము హేతువుగ నాతఁడు తన యాటలు సాగించుకొనఁ జూచుచున్నాడు. తన కన్ని విధములఁ బరీక్షాసమయము వచ్చినది. కానిమ్మేది యెట్లు జరుగవలసియున్నదో యది యట్లే జరుగును. తాను సర్వమునకు సి

యున్నాడు. తన యాశా శిఖరములను యువరాజు కూల్చివేసినాడు. తన మమతానురాగముల మహారాజ్ఞి తనవెంటఁ గొంపోయినది. తానో జీవన్మృతుఁడై కాలమును ద్రోయుచున్నాడు. కావున నీ రాజకార్యముల నిర్వహించవలె నంతియ కాని తృష్ణాగాఢమైన మనస్సులేదు. భార్యా పుత్రుల మరణముచే నకాల వార్ధక్యము తరుముకొని వచ్చినది.

తన జీవితము సారరహితముగ నడచుచున్నది ఏది యెట్లు పోయిన నట్లుపోనిమ్మనిపించుచున్నది. మనశ్శాంతి యాత్మనుండి నమ ద్భూతము కావలెఁగాని దేవాలయమునకు వచ్చిన గల్గునది కాదుగద ! మాధవవర్మ చింతా వ్యాకులితమానసుఁడై శ్రీశైలారణ్యములఁ దిరుగు చుండెను. మధ్యాహ్నమయ్యెను. వేగులవాండ్రు మహారాజు నన్వే షించుచు వచ్చి ఆయనను కన్గొని— "ప్రభూ ! ఆ పులకేశి బయలు దేరినాడు. అమితవేగముగ మనరాజ్యముపై కెత్తి వచ్చుచున్నాఁడు తాము వెంటనే విజయవాటికకు తరలవలెను, లేనిచో ప్రమాదము" అని నుడివిరి.

మాధవవర్మ మహారాజునకేమి చేయవలెనో తోచుటలేదు తక్ ణమే బయలు దేరవలయును. దేహమున్నంతవరకు బాధ్యతలు తప్పవు కద ! మహారాజు దేవాలయమున కేగి పరమేశ్వరుని మ్రోల సాగిలపడి, "ప్రభూ ! పోవుచున్నాను. నీ సంహారక శక్తిని నాయందు నింపుము. బ్రదికి యున్నచో మరల విన్న పేవింపవత్తును. లేనిచో నిదే కడసారి ప్రార్థనము. ఈ దీనునిపై నీ దయానుగ్రహ వీక్షణములఁ బఱపుము. సెలవు స్వామీ ! సెలవు'' అనెను.

మహారాజు వేగవంతములైన యశ్వములఁ బూనిన యరదమె క్కి విజయవాటికకు చేరెను వేటనే యుద్ధ ప్రయత్నములు

మంత్రులకు దండనాధులకు నాజ్ఞాపించెను. యుద్ధరంగము కొల్లేటి నిర్ణయించుకొని పులకేశి నచ్చటనే యెదిరింప నిశ్చయించుకొనెను.

త్రిలోచనా సునీతివర్మలను నగరరక్షణమునకును సుదర్శనా పరిచర్యకును నియోగించి మహారాజు తానును తన బలగమున నేగుటకు తీర్మానించెను. పినాక భట్టారకుఁ డాహవరంగమునకు తాను గూడ వచ్చెదననగా మహారా జందుల కామోదించెను. మహారా జపారమైన సేనా వాహినితో గజఘటలతో, అశ్వికదళములతో, రథికులతో సమరక్షేత్రమునకు తరలెను. ఆయన సాధారణముగ యుద్ధముల కేగునప్పుడు చంద్రావతీ దేవి యాయన వదనమున వీరతిలకము దిద్ది హారతినిచ్చి వీరఖడ్గము తాంబూలము నొసఁగుట పరిపాటి. మహారాజలవాటుగ చంద్రావతీదేవి సౌధమున కేగి యుస్సురని కన్నులు నీరుక్రమ్మ తిరిగివచ్చెను ఎదురుగ త్రిలోచన వీరతిలకము నిడి హారతిఁదెచ్చెను. రాజు మొగమున లేని నవ్వుఁ దెచ్చికొని వానిని స్వీకరించెను.

"తల్లీ! త్రిలోచనా! నేను సర్వబాధ్యతలను నీ యందు నిలిపి కదనభూమి కరుగు చున్నాను. సుదర్శనను జాగ్రతగ కనిపెట్టియుండుము. విష్ణుకుండిన వంశాంకురమును పరిరక్షింప వలసిన బాధ్యత నీపై నిలుపు చున్నాను. ఎట్లు నిర్వహింతువో!" అనెను.

త్రిలోచన మహాప్రసాద మనెను.

రణభేరి మ్రోగినది. మహోత్సాహముతో సేనా నివహములు కొల్లేటివైపునకు సాగినవి. ఇఁక కోటలోనున్నది త్రిలోచన పల్లవి, పద్మ, సుదర్శనాదేవి ముగ్గురే; సుదర్శనకు నెలలు నిండినవి.

ఆమెకు నీ లోకమునకు సంబంధము లేదు. ఆమె దేహమునందు ప్రాణము లెందుకు నిలచియున్నవో భగవంతునికే తెలియవలె! గోవింద నామ స్మరణ యొక్కటే యామెకు కొంత చలనము కలిగించును. ఆమెను చూచిన త్రిలోచనకు గుండె నీరగు చుండెను. ఎంతటి బుద్ధిశాలిని ఎట్లయినది! ఆమెకు భర్తయెడల నెంతప్రేమ! తాను నిజముగ నీ విష్ణుకుండిన వంశమున నడుగుపెట్టుట కనర్హురాలు! ఇచ్చట నెల్లరమృత మూర్తులు! తాను విషనాగిని వలె నిచ్చట నవతరించినది! తానట్లు తీర్చఁబడినది. తన ప్రతిజ్ఞ నెరవేరు సమయము దగ్గర పడినది. తన కార్యమును ముగించుకొనినచో నామీఁదట నిశ్చింతముగ నుండిపోవచ్చును.

పులకేశి మహారాజు తన సందేశమును స్వీకరించి సరియైన యదను జూచి చెప్పినరీతిగ దండెత్తి వచ్చినాడు. తన జీవిత నాటకమున తుది రంగమున నడచుచున్నది. తన యన్నగారి కిష్టము లేకపోయినను తన యభీష్టమును పులకేశికి కబురుపెట్టినాడు. సర్వము తన పథకమున కనుకూలముగ నడచుచున్నది! సునీతివర్మలో దీప్తి తఱిగిపోవు చున్నది. జననీ సహోదరుల మరణము లాతని క్రుంగఁదీసినవి. తండ్రి యాహవ రంగమున ఒరుగుట అన్నలు సహాయముగ రాకపోవుట, ప్రేమమయి యయిన వదినగారి యున్మాదస్థితి యన్నియుఁజేరి యాతని సుకుమారమయిన మనస్సును వికల మొనర్చినవి. తానేమియు పట్టించుకొనకుండ, సర్వమును త్రిలోచనకు వదలివేసి నిస్పృహునివోలె మాతృమందిరమున నిరంతరము కూర్చుండిపోవును. తానేమియుఁ జేయలేకుండెను.

కొల్లేటి యుద్ధభూమి యందు పోరు ముమ్మరముగ సాగుచున్న వార్తలంచలమీఁదవచ్చి చేరుచున్నవి. ఇంతవఱకు జయాపజయముల ప్రశ్నయే తావేలేదు. సమానబలములతో నిరువురుఁ బోరుచున్నారఁట

పదునేను దినములు గడచినవి. యుద్ధరంగమున నిరువాగుల నపారముగ సైన్యనష్టము జరిగినది, భటులుతెచ్చుచున్న వార్తలనుబట్టి రణస్థలిఁ గూలిన సేనావాహిని యొక్క రుధిరధారలచే కొల్లేరు రక్తపుటేరుగ మారినదఁట ! మాధవవర్మ డస్సిపోవుచున్నాడు. ఆయన పరిస్థితి యను మానాస్పదముగ నున్నది. తమ పక్షమున నాసలన్నియు సన్నగిలు చున్నవి. పులకేశి ద్విగుణితోత్సాహముతో కలియుచున్నాడు. పరిస్థితియును మానాస్పదముగ నున్నది. విజయలక్ష్మి పులకేశినే వరించునట్లున్నది. !

త్రిలోచన యావార్తల నాలకించును. ఆనందించును దుఃఖించును! విచారపడును ! దైవము తన్నెంత విచిత్రజీవిగ సృజించినాడు ! తనకు హృదయమున్నది ! ఆర్ద్రతయున్నది ! బంధుప్రీతి గౌరవము సమృద్ధిగ నున్నవి కాని, వానిన్నిటిని విపరీతముగ మలచుఁకొని వర్తించవలసిన వికృత పరిస్థితిని కలిగించినాడు తనయత్తగారు పరమసాధ్వి, మామ గారు దైవసముఁడు ! ఆయన ధర్మనిర్ణయములు సుధర్మలో ననుకరిం చుకోదగినట్టివి ! తనభర్త సాక్షాత్తు ప్రేమావతారము ! బావగారు తోబుట్టువుకన్న నెక్కుడు వాత్సల్యముఁ జూపువారు ! తోడికోడలాప్తమిత్రురాలు 'కాని వేరుకాదు. రాజ్యమున నిఁక తాననిన భయముతో కూడిన గౌరవము : అధికారవర్గమునందందఱామె నత్యంతముగ గౌరవింతురు .

పల్లవయోధులరి వీరభయంకరులు ! మహాసామ్రాజ్య నిర్మాతలు! విజేతలు, అద్భుతశిల్పకళా విలసిత దేవాయతన నిర్మాణ దీక్షాదక్షులు, అట్టి రాజవంశమున జన్మించి స్త్రీయయ్యు నన్నిగుణములఁ బుణికిపుచ్చుకొనిన యామె యసామాన్య సామర్థ్యమునకు సర్వులు తలయొగ్గ వలసి దే ! ఆంధ్రసామ్రాజ్యమున పల్లవ సామ్రాజ్యమున త్రిలోచన రాజ్ఞిగ రణతంత్ర కుశలురాలుగ పేరుమోసినది. కాని, యేమిలాభము

తన మనస్సు ఖేదపడుచున్నది.తనకు శాంతి దూరమయినది. ఒకయానం దములే దనుభవములేదు ! తన బ్రదుకున కసలర్థమేలేదు !

కుమారవిష్ణు మహారాజు ప్రతీకారదీక్షకు తాను సాధనభూతురాలై నది. తనయన్నగారెన్ని విధముల నచ్చజెప్పినను దానిమార్గమునే సర్వా త్మనా కోరుకొనినది. తుదకేమైనది ! అంతయు ముగిసిపోయినది, సర్వ నాశనమయినది ! విష్ణుకుండిన రాజవంశమున నవ వధువై తానుపాద మిడి యయిదేండ్లయిన ముగియలేదు. ఎన్ని యనర్థములు కలిగించినది ! తనపైఁదనకే యసహ్యముగ నున్నది.

త్రిలోచనపల్లవి తన జీవితగ్రంథమును విప్పిపుటలఁ దిరుగవేసి కొనుచున్నది. తానెంత కఠినురాలుగ ప్రవర్తించు చుండినను నాంతరమై సహజమైన యొకానొక పరమ సుకుమారమయిన హార్దికవృత్తి తనయందు మిక్కుటముగనున్నది. దానిని వెలికి రానిచ్చుటకు వీలులేదు తనజీవిత మంతయు కృతకమైపోయినది. ఇఁకమిగిలినదేమున్నది ? మాధవవర్మ మహారాజులేని యాంధ్రదేశము శ్మశానదృశము ! ఆమహారాజు యుద్ధ మునకు బయలుదేరిననాడే రాజదుర్గము కళావిహీనమై పోయినది ! పాడుపడినట్లయినది. దానిని తిరిగి ధగధగ లాడించగల నమర్థుఁడు వేరొకఁడులేడు. విష్ణుకుండిన వంశమంతరించ వలసినదే !

త్రిలోచన పరిపరి విధముల తలపోసికొనుచు తన మందిరమున విచారదీనయై కూర్చుండి యుండెను. సుదర్శనాదేవి సౌధమునుండి మకర కుండల వగచుచువచ్చి— దేవీ ! సర్వనాశమైనది !సుదర్శనాదేవి ప్రాసా దోపరిభాగమునుండి కిందఁబడినారు. తల చితికి మెదడుబయటికి వచ్చి

నది. గర్భస్థశిశు వాయుదునకు జారిపోయి భూపతితుఁడై యసువులు వీడనాడు ? త్వరపడవలెనమ్మా !" యనెను.

త్రిలోచన వణకిపోయెనుఁ "ఏమంటివి ? సుదర్శనయెట్లు దీనది ? అయ్యో ! పద, ముందచ్చటికి పోవలె."

ఇరువురు సుదర్శనా సౌధమున కరిగిరి. అచ్చటి పరిచారిక లందఱు గుమికూడి యుండిరి. సుదర్శనాదేవి శవము నొక తల్పముపై నుంచిరి. ఆమె మృతదేహమును ధవళ వస్త్రముచే నాచ్ఛాదిత మొనర్చిరి, పసిబిడ్డ కళేబరము నామెప్రక్కనే యుంచిరి, త్రిలోచన శిలాకర్కశమైన గుండె యా దృశ్యమును చూచి ప్రిదిలి పోయినది. ఆమెకు కన్నీరాగ లేదు. సుదర్శన పాపము తనకేమి గాదు ! శిష్యురాలు, చెలిమి కత్తియ తోడికోడలు. అయ్యో ! ఆమె చివరకెట్లు మరణించినది ! మాతృత్వపు తొలియానందము తలమునుకలగు సమయము సమీపించుచుండగా నీదుర్ఘటన జరిగినది !

దైవము తన్నొకవిధముగ మన్నించినాడు. కానిచో సుదర్శనాగర్భగత శిశువును తాను సంహరించవలసె యుండెడిది, ఏ పుణ్యాలేశమో దాని కడ్డు పడినది. అంతవరకు తానదృష్టవంతురాలు ! సునీతివర్మ కింకర్తవ్యతా విమూఢుడయి పోయెను. ఏమిచేయుటకును పాలుపోవక నతఁడు కోటయందలతను వెఱ్ఱిగ తిరుగుచుండెను. త్రిలోచనయే తాగల కార్యకలాపముల కేర్పాట్లు గావించినది. ఎంత ప్రయత్నించినను నాతనికి దుఃఖ మువశమించుటలేదు. తనకు తెలియకుండగనే నాతని కన్నులవిరళముగ వర్షించుచున్నవి, విధులన్నింటని యధాక్రమముగఁ బూర్తిగావించెను. సునీతివర్మయే కర్మకాండ లన్నింటిని త్రిలోచన యాదేశాను

సారముగ నిర్వర్తించెను. కోటలో నెల్లెడల నిశ్శబ్దము మహాశ్మశా
సంబంధియైనది వ్యాపించెను. ఆ నీరవ నీరస వాతావరణమును త్రిలో
చన పల్లవి సహించ లేకుండెను.

మామగారు సుదర్శను తన కొప్పగించినారు. విష్ణుకుండిన రా
వంశాంకురమును పరిరక్షింప వలసిన బాధ్యత తనయందుంచి యాయన
యాహవరంగమున కేగనాడు ఆయన తిరిగి వచ్చి ప్రశ్నించిన తానేవి
సమాధానము చెప్పును! ఆయన తిరిగివచ్చుటనునదుండనా? తన
ప్రస్తుత కర్తవ్య మేమి? తన నాటకమున చరమాంకమున తుదిరంగము
నడచుచున్నది. తన జీవితమునకు కూడ పరాకాష్ఠ స్థితి వచ్చినది. ఆ
మలిన కృష్ణవేణీ తరంగనులు తన్నాకర్షించుచున్నవి!

విజయవాటికయందు తన్నెక్కువ పట్టి నిల్పినవి. కనకదుర్గాదేవి
కృష్ణవేణీ తరంగణి! వారిరువురును తన్ను తమలో లీనమొనర్చుకొనరా
కామాక్షీదేవికిని, కనకదుర్గాంబకు నేమి భేదమున్నది? ఇరువురును
నొక్కరూపే! స్థానభేదము ననుసరించి నామభేదము ఇహమును
రోసిన తనకు పరమైన దక్కునా!

అనంత ముఖముల సహస్రాధికములైన యోజనలఁజేసి త్రిలో
చన యొక నిశ్చయమునకు వచ్చెను. ఆమె మనస్సు తేలిక పడినట్లయి
నది. సునీతివర్మకై వెదుకగా నాయన తన మాత చంద్రావతీదేవి మంది
రమున మహాదేవుని ముందుఁ గూర్చుండి దుఃఖించుచుండెను. ధాన్యము
రాల్చిన వరివెన్నువలె వన్నెబడి పాలిపోయి యుండెను. బంధు మరణము
లాతనిని విలువెల్ల నిస్సారునిగ నొనర్చినవి. దిక్కులేని పసివానివలె
బెంగపడి కృశించిపోవు చుండెను. తాను వినా యాతని నెవ్వరోదార్చు

వారు లేరు. ఆతని జూచిన జాలి కలుగుచున్నది. తానేమి చేయఁగలదు? ఊసరక్షేత్రమును సస్యశ్యామలముగ చేయగలదా? గగన కుసుమములఁ బూయించగలదా? నిజమునకు సునీతివర్మ యెవరు, తానెవరు? తమ దసలు వివాహమగునా! వివాహ శబ్దమునకు తమ దాంపత్యమునకర్థము లేదు తానెట్టి లౌకిక సుఖాను భూతులకును అనర్హురాలు. తానీ నాడు సునీతివర్మ జీవితమున వసంతము సృజించగలదా? అసంభవము.

తనను వలచిన హేతువై యాతఁడు తన విరహాగ్నిలో నసువుల పీడవలసినదే? తన్ను ప్రేమించిన యాతఁడు వేఱొకతెను ప్రేమింపఁ జాలఁడు మహాసర్ప దంష్ట్రా విషాగ్నికీలల కెఱయైన వానిపై నల్ప విషములు పనిచేయునా? వాని గతియంతే! అతఁడట్లు విషాక్తుఁడై యసువుల పీడవలసినదే? ఆతనికిఁక విష్కృతిలేదు. త్రిలోచనను స్మరించుకొనుచు జీవితాంతము గుండెదిగులై చివికి జీర్ణించి తడువుఁ జాలించవలసినదే! తాను మాత్ర మేమగుచున్నది? తన జీవితమున తానను భవించిన దేమున్నది? భగవతి తనవంటి విచిత్ర జీవులను గూర సృజించు టెందులకో! లోకములో జరుగవలసిన కొన్ని యసాధ్య కార్యములను సాధ్యముఁ గావించు కొనుటకు తనవంటి వారి యవసర మెంతేని యుండును అందులకే తనవంటి వా రుద్భవించు చుందురు. కానిమ్ము. కాఁగల కార్యమును గంధర్వులే తీర్చెదర'న్నట్లు సుదర్శన విషయము భగవంతుఁడే చూచుకొనినాఁడు!

త్రిలోచన దేవీమందిరమున కేగి యామెకుఁ బ్రణమిల్లి— "తల్లీ నీ యనుగ్రహముననే నాంధ్రముల నడుగు వెట్టిన కార్యమును సాధింపఁ గల్గితిని. నా వచ్చినపని ముగిసినది, నీవు నాకిఁక సెల వొసగుచో నీ పాదసన్నిధిని నిర్మాల్యమగుదును. నా ప్రతిన నెఱవేర్చు కొంటిని.

త్రిలోచన పల్లవి పల్లవరాజ రక్తమును కలుషితము గావించలేదు. పల్లవి వ్యచ్ఛమైన ప్రేమనే నెఱపలేదు.' పల్లవరాజవంశ గౌరవ విచ్ఛిన్న కరములైన కార్యముల నొనర్చలేదు. ప్రతిజ్ఞాపాలనమునకై తన బిడ్డ కును బలియిచ్చినది. కుమారవిష్ణు నరపతి ప్రతీకార యజ్ఞమున త్రిలో చన బలిపశు వైనగి! పోనిమ్మా యజ్ఞ ఫలితముగ .నా ప్రభువు నాత్మ శాంతి నొందుచో తనాకుఁ గావలసినది లేదు.

"అమ్మా! తల్లిలేని తండ్రిలేని నన్ను నీవే తల్లివి దండ్రివినై నీ చల్లని కడగంటి చూపులఁ సాకితివి. నీప్రేమార్ద్రమైన దరహాస చం ద్రికలు పర్వి నా జీవితము పవిత్రమైనది. నీకృపా విశేషముచే నెదురు లేని యేకచ్ఛత్రాధిపత్యమును వెలయించితిని. నేటికి నా పాకములో మరి పుణ్యములో పండినవి. ఈ లోకమున నా యొనర్పఁ దగిన పనునే వేమియు మిగులలేదు.

లయకారకుఁడైన రుద్రుని యర్ధాంగి రుద్రాణివి నీవు! నీయా రాధనే జేసి విష్ణుకుండిన వంశమును నీలో లీనము చేసితిని. ఆ వంశము నకు మోక్షదాయినివి కమ్మ శిక్షలేమైన నున్నచో నేననుభవింతును. సుధార్ణవము వంటి వారివంశమున కాలకూటమునై ప్రవేశించి వంశమున విరచి వేసితివి! తల్లీ! నన్ను పల్లవ రాజ్యమున నీ యంశావతార మను చుందురు. నిజముగ నట్లేయగుచో నా యంశ నుపసంహరించుము. నీలో లీనమొనర్చు కొనుము!"

కొల్లేటి సమరరంగమున పలికేశిదే పైచేయిగనున్నది మధవ వర్మ మనశ్శరీరముల రెంట నలసిపోయెను. పినాక భట్టారకుఁడన వరత మాయనకు పార్శ్వవర్తియై కంటికి రెప్పవోలె కాపాడుకొనుచున్నను

ధైర్యముఁ జెప్పుచున్నను మహారాజు నిలువ బ్రొక్కకొనసాగుచుండెను. ధైర్యహేమాచలుఁడైన యాయన యువరాజు మరణముతో పిఱికి వాడై నాడా! యనిపించుచున్నది! సుదర్శన సంతానముపై మమకార మాయ నను జీవింపఁజేయు చున్నది. మరల మాధవవర్మ జన్మించును. ఆంధ్ర సామ్రాజ్యము మూఁడు పూవులారుకాయలుగ ధగధగలాడగలదను నాశ యాయనచే ప్రాణధారణము చేయించుచున్నది!

ఇరువది యైదవనాడు పోరు ఘోరముగ సాగినది. మహారాజా క్షతగాత్రుఁడైనాడు. విజయమిఁక పులకేశికి దక్కినట్లే! రణరంగమున బడియున్న మహారాజునొద్ద పినాక భట్టారకుఁడుండి పరిచరించుచుండెను. రాజధాని నుండి వార్తరాలేదు. మాధవవర్మ మహారాజా వార్తకై ప్రాణ ములఁ గన్నుల నిల్పుకొను చున్నాడు. రక్తము విపరీతముగ స్రవించినది. బలము క్షీణించినది. పినాక భట్టారకునికి గూడ భుజముపై ఖడ్గఘాతమై రక్తస్రావమైనది. కదనరంగమంతయు భీభత్సముగ నున్నది.

ఇంతలో రాజధానినుండి యాశ్వికులిరువురు మరువులు గ్రక్కు కొనుచు నచ్చటకు వచ్చిరి. వారు రాజును చూచి యెంతో వాపోయినారు. త్రిలోచన పల్లవీదేవి తమ కందఁజేయు మనినారని యొకలేఖను మహా రాజున కొసఁగిరి. మహారాజత్యంత వ్యగ్రమానసుఁడై పినాక భట్టార కుని దెసఁ జూచెను. భట్టారకుఁడు లేఖను చదువసాగెను.

"మహారాజ రాజ పరమేశ్వర విష్ణుకుండిన వంశపారావార సుధా కర శ్రీశ్రీశ్రీ మాధవవర్మ మహారాజుగారి చరణారవిందములకు నమస్కరించి, పల్లవ రాజదుహిత త్రిలోచన పల్లవి వ్రాయు లేఖా ర్థములు,

ధ

మామగారూ ! నేను పల్లవరాజకన్యను. పల్లవ చక్రవర్తులను, విష్ణువంశప్రభువులను విరోధము తప్ప హిత మెన్నడును లేదు. శ్రీశ్రీశ్రీ సహార విష్ణు సార్వభౌముని తాము సంగరరంగమున నిర్జింపగా నాయన తన యవమానమును మనస్సునందు భద్రపఱచుకొనినారు. సమయము వచ్చుచో ప్రతీకార మొనర్పవలెనని వారియాశయము. అట్టి యవకాశము మొనగూడలేదు. తమకా వయసు తీరిపోవుచున్నది. మృత్యు ఘడియలలో నాయన మనుమరాలనైన నన్ను పిలచి— "తల్లీ ! త్రిలోచన పల్లవీ ! నీవు నాకు ప్రతీకారముఁ దీర్చిపెట్టుమని యాదేశించగా నేనటులేయని వాగ్దాన మొనర్చితిని. అందులకై నేనన్నో పదకముల వైచి ఛద్మవేషముతో మీ రాజ్యమున ప్రవేశించితిని. తమ కుమారుని వలపించితిని !

తమ నరమేధ మహాధ్వరమునకు పేమన్నాచెల్లెంద్ర మిరువుర మరుదెంచినది కూడ యీనా పదకములోని భాగమే ! తాము పల్లవ రాజదుహిత నిష్టకుండిన వధువైనదని సంతసించినారు. కాని రాచకన్య కానై యిట్లు వివాహేచ్ఛతో స్వగృహము వీడి వచ్చునా ! అది వక్రపాన భాజనము కాదా ? యని కూడ తాము దూరాలోచన చేయలేదు. "నరత్న మన్విష్యతి మృగతేహి నః" అని నైతము తామూహించలేదు. నేను తమ రాజ్యమున నడుగువెట్టినది మీ వంశమును నిర్వంశము గావించుటకు ! పితామహునికి నా యొనర్చిన వాగ్దాన మట్టిది నేను పదకము వైచి సర్వమును సుసంపన్నమగు రీతిని నడుపుకొంటిని.

మొదట సుగంధి గర్భవతియైనదని తెలిసి సుభద్రాదేవి ఈర్ష్యఁ జెందగా నేనొక యెఱుకతను బంపి మూలికల నిప్పించితిని. పిన్నయత్త గార్లిరువుర యీర్ష్యాసూయలు నా పన్నుగడకు బలము నిచ్చుటచే వారిరువురి

కోడండు వంధ్యా సదృశులైరి ! సుదర్శనా గోవిందవర్మలకు ఖడ్గ యుద్ధమునేర్పి వారిని నా యజ్ఞాబద్ధులనుగ నొనర్చుకొంటిని. యువరాజు జన్మదినోత్సవమున రథయాత్ర కల్పించినది నేను ! ఆయన రథచక్రముల క్రిందికాబాలుని బలవంతముగ త్రోయించినది నేను ! చంద్రావతీ దేవి మరణించగా, యువరాజు మరణము, మహారాజ్ఞి నిర్యాణము మిమ్ముఁ గ్రుంగదీయుచుండగా నదియె యదనని నా యన్నగారైన పమార విష్ణు మహారాజు సాహాయ్యమున నాంధ్ర సామ్రాజ్యముపై దండయాత్ర సల్ప నె చుచున్న పులకేశి నీ సమయముననే సన్నద్ధమై రావలసినదిగ సందేశమంపినది నేను !

మహారాజా ! మీరు నరమేధముఁ జేసినారు. నేనును నరమేధముఁ జేసితిని. మీరు స్వర్లోకావాసకాంక్షతో నా యువకుని యజ్ఞపశువును గావించితిరి నేను నా ప్రతిజ్ఞాపాలనమునకై విష్ణుకుండిన వంశాంకురములనే యజ్ఞపశువులను జేసితిని ! సుదర్శనాదేవి యున్మాదస్థితిలో ప్రాసాదోపరి భాగమునుండి క్రిందఁబడి మరణించినది. ఆమె మెదడు వెలికి వచ్చినది. విష్ణుకుండిన వంశాంకురము గర్భచ్యుతమై విగతాసువయ్యెను. అచ్యుత భగవతి నన్ననుగ్రహించినది లేవిచో ఆ పాపమును నేను కట్టుకొనవలసి వచ్చెడిది. అదృష్టవంతురాలను. నా ప్రతిన తీరినది మీ వంశమిఁక వృద్ధికానేరదు. నా భర్త సునీతివర్మ సగము చచ్చినాయుడు! అతఁడు వంశమును సాగించి రాజ్యమేలఁ జాలఁడు. మీతోనే మీ వంశమంతరించి తీరును. పులకేశి మిమ్మెల్లను జయించును. విష్ణుకుండిన రాజ్యవంశమిఁక పతనమై పోయినది !

నరమేధమునకై మీరు యజ్ఞదత్తుని, తమకేక మాత్ర సంతానముని తలిదండ్రులెంత మొఱలిడినను గణించక యజ్ఞపశువుగ నాతని యూవ

ముసలు బిగించి విలసన మొనర్చితిరి. అయినచో మన మిరుపురమును మహాపాపులము. దేనిచో నేమియుఁగాదు. రాజనీతి పుష్టించిన కథలిట్లే యుండును కద ! నేను మీ గృహమున నడుగుపెట్టు నాటికి గర్భనిరోధ కౌషధమును సేవించి వచ్చితిని. మీ చిన్న కుమారుఁడమాయకుఁడు. ఆయనకు ప్రత్యేక వ్యక్తిత్వము లేదు. ఇంద్రవర్మ దేవవర్మల సమర్థులు. వారిచే నగునదేమియులేదు. మీకు సర్వనాశనమే మిగిలినది. మహాప్రభూ! నా పితామహుని కొసఁగిన వాగ్దానమును నిలబెట్టుకొంటిని: కాని, మహారాజా ! మీరరసిన నాకెంతయో గౌరవమున్నది. మీ ధర్మబుద్ధికి మెచ్చి భగవతి శ్రీదుర్గామహాదేవి కనకవృష్టిఁ గురిసి కనకదుర్గ యయినది. మీ వంటి వారు మామగారగుట లౌకికముగ నెంతో యానందించఁదగిన, గర్వించఁదగిన విషయము ! మా పితామహులైన శ్రీకుమారవిష్ణు మహారాజుగారు నాచే ప్రతిజ్ఞఁ జేయించుకొనుచు పల్లవ రాజరక్తము కలుషితము కారాదన్నారు. అందులకే నేను శలాటువు వలె నిలచినాను ! అమృతాంతః కరణులైన మమ్ములనెల్లవిభవముల నయవంచనము చేసితిని. నాడు సరిహద్దులందలి కొండజాతివారలచే వల్లరుల లేవదీసి తిరుగుబాటు చేయించినది నేను, కొంగునఁగట్టుకొనిన యగ్నికణమునై మీ వంశమును మండించితిని. నా మనస్సునందు పశ్చాత్తాపము రగులుకొన్నది. ప్రయోజనము శూన్యము చేతులు కాలిన వెనుక నాకులు పట్టుకొనుటలో ప్రయోజన మేమున్నది ?

యజ్ఞదత్తుని నేను తొలుతచూచినాడు నాకాతని కన్నులలో యువరాజు కన్నులు గన్పించినవి. ఆ నేత్రములు దివ్యములు ! నేను సునీతివర్మను వరించినది కూడ నందులకే ! దైవాంశగల కన్నులు భూమండలమున నుండనేరవు ! మహారాజా ! విజయవాటిక శ్మశానవాటిక వలె

నున్నది. ఇచ్చట నేమియు మిగులలేదు. పులకేశి సైన్యము నగరమును ప్రవేశించినచో నిచ్చట నెదిరించువారు లేరు. ఈ లేఖ మీ కందు నమయమునకీ త్రిలోచన యుండదు ! చదివిన పిమ్మట మీరుండరు ! ఇంకేమి వ్రాయఁగలను ? వైరిరాజదుహితగ ప్రతిజ్ఞాపాలన మొనర్చితిని. మీ కోడలుగ మహాఘములఁజేసితిని. త్రిలోచన వల్లవి స్వకుల విధ్వంసకురాలుగ మహాపాపిగ కూటనీతిజ్ఞురాలుగా చరిత్రలో శాశ్వతముగ ముద్రవైచికొని నిలచిపోఁగలదు. మీరు సామ్రాజ్యాధినేతలుగ, ధర్మమూర్తులుగ, న్యాయనిర్ణేతలుగ, విజేతలుగ నిలచిపోఁగలరు !

ఈ త్రిలోచన విధిచేత కీలుబొమ్మయై వర్తించినది. విషయమును సవిస్తరముగఁ దెలుపకున్న నా మనస్సున కూరట చిక్కుట లేదు. ఇప్పటికి కొంతశాంతి చేకురినది మిమ్ముఁ క్షమింపుఁడని యర్థించుటకు నైతము అర్హతను కోల్పోయినదానను ! దైవమే క్షమించదేమో! పితామహుని కొసఁగిన వాగ్దాన నిర్వహణలో నెన్నికుట్రలు పన్నితినో, దానిని నిర్వహించిన పిమ్మట నంత ఖేదముఁజెందితిని. బ్రదుకంతయు నటనమై పోయినది ! ద్విధావిభక్తమై జీవితమున శాంతి సౌఖ్యములు లేకుండ నగ్నికుండమున మగ్గిపోయితిని ! హిమాంశు శీతలమైన మనోలక్షణము కలిగియుండియు ప్రళయాగ్ని కీలనై వర్తించితి. ఏమి వ్రాసి యేమి ప్రయోజనము ? సర్వనాశనమైనది. మహాప్రభూ ! నేను శాశ్వతముగనీ లోకమునుండి నిష్క్రమించుచున్నాను. మిమ్ము పైలోకములఁ గలసికొని క్షమాభిక్ష నర్థింతును.

సెలవు

మీ వంశ విధ్వంసిని, కులవధువు

త్రిలోచన వల్లవి.